సంస్థాపకులు
కీ॥ శే॥ వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి లీలావతి
రాఘవయ్య

సంపుటి 18 విషయసూచిక సంచిక 12



ఈ నెల నవలానుబంధం

# మైత్రేయి

రచన : శివల జగన్నాథరావు

ముఖచిత్రం : జయప్రద, చివరి అట్టమీద : సుజాత

జ్యోతి, 1-8-4-1/1/ చిక్కడపల్లి, హైదరాబాదు 500 020
సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో సహా) రు. 50

# నవదశాబ్దానికి నమస్కారం!




మరొక దశాబ్దం కాల మహాసముద్రంలో రాలిపోతోంది యీ నెలతో. ఈ దశాబ్దంలో చెప్పుకోదగిన పరిణామాలు అనేకం జరిగాయి. మన దేశంలో మూడు దశాబ్దాల కాంగ్రెసు పాలనకు జనతా పార్టీ తొలికామా పెట్టింది. అవును, అది కామాగానే మిగిలి పోయింది చరిత్రలో. మళ్ళీ కాంగ్రెసు పార్టీయే శ్రీమతి ఇందిరా గాంధీ నాయకత్వంలో అధికారంలోకి వచ్చి యేలుబడి సాగిస్తోందిప్పుడు. రాష్ట్రంలో చూస్తే సాహిత్య రంగంలో పెద్ద సంచలనమే కలిగిందని చెప్పాలి. విప్లవ రచయితల సంఘం యేర్పాటు, అందులోని వైరుధ్య శక్తుల వేర్పాటు, అభ్యుదయ రచయితల సంఘ పునరుజ్జీవ కృషీ, రచయితల జైలు జీవితాలూ, చలం, కృష్ణశాస్త్రి, కొడవటిగంటి వంటి మహా రచయితల అస్తమయం– అన్నీ, యీ దశాబ్దంలోనే జరిగాయి, కన్ను మూసి కన్ను తెరిచేంతలో వెలిగి కరిగి పోయాయి పది సంవత్సరాల కొవ్వొత్తులు. కొత్త ఆశలతో, కొత్త ఆశయాలతో నవ దశాబ్దానికి నమస్కరిస్తూ స్వాగతం చెబుదాము!



కథల పోటీ ఫలితాలు యీ పక్క పేజీలో ప్రచురించాము. మొదటి మూడు బహుమతులు పొందిన కథల్ని వచ్చే సంచికలో ప్రచురిస్తాము. పోటీలో దాదాపు ఆరు వందల మంది రచయితలు, రచయిత్రులూ పాల్గొన్నారు. వారందరికీ అభినందనలు. విజేతలకు విజయాభినందనలు!




## జాలి కథ

నవంబరు జ్యోతి ఆసక్తికరమైన చిన్న కథలతో చక్కని వ్యంగ్య రచనలతో దసరా సరదాలను సృష్టించింది. శ్రీ వాకాటి క్లుప్తంగా వ్రాసినా, మోక్షమూలరు గాథ ఎంతో మనోరంజకంగా ఉంది. ఆ మహాత్ముని జీవితచరిత్ర సంపూర్ణంగా చదవాలనే ఉత్కంఠ కలిగించింది. 'వేమన్న వాదం' అనే ఉత్తమ గ్రంథాన్ని చక్కగా పరిచయం చేశారు, 'డి.పి' గారు. ఏ ఎన్. మణి గారి 'ఉద్యోగం' జాలి ఒలికించింది. మీరు మంచి సెలెక్షన్సు చేసి అందిస్తున్నందుకు కృతజ్ఞుడను.

అయ్యగారి వారబ్బాయి
హైదరాబాదు.

ఇది నా అభిమాన "జ్యోతి"కి నా తొలి ఉత్తరం. ఎన్. టి. ఆర్. ముఖ చిత్రంతో వెలువడిన నవంబర్ 80 "జ్యోతి" ఆకర్షణీయంగా వుంది. ఈ నెల నవలానుబంధంతో ప్రచురించిన వాకాటిగారి నవల "మబ్బు వీడిన సూర్యుడు" చాల బాగుంది. కథల్లో పిరికివాడు, టాక్సీ, అసమర్థుని ప్రేమలీల బాగున్నాయ్, వాకాటిగారి "చేత వెన్నముద" పత్రికకే అందం!

... దర్ కుమార్
...పల్లి

నవంబర్ 80- జ్యోతిలో 'ఛాయాచిత్రం' హృదయ స్పందనగా ఉంది. ఆర్.ఎస్. కృష్ణమూర్తి గారికి అభివందనలు.

పి. ఆర్. రవీంద్ర
మైలవరం.

ఎన్. టి ఆర్. ముఖచిత్రంతో వెలువడ్డ నవంబర్ '80 జ్యోతి సర్వాంగ సుందరంగా ఉంది. "ప్రేమ సింహాసనం" "భూమిగుండ్రంగా ఉంది" "మీరా" సీరియల్స్, "కులపతి కొడవటిగంటి" జ్వాలాముఖిరచనా బాగున్నాయి. అనుబంధ నవల "మబ్బు వీడిన సూర్యుడు" బాగున్నది. కడుపుబ్బ నవ్వించే కార్టూన్లనందిస్తున్న కార్టూనిష్టులకు అభినందనలు.

కోట. రామప్రసాద్
తణుకు

ఈసారి నవంబర్ జ్యోతిలో మీరిచ్చిన నవల, "మబ్బు వీడిన సూర్యుడు" మాకు ఎంతగానో నచ్చింది. కథ నడిపిన తీరు, శైలీ చాలా బావున్నాయి! రచయిత "వాకాటి పాండురంగా రావు" గారికి ప్రచురించిన మీకూ ధన్యవాదాలు.

విజేంద్రనాథ్ ప్రసాద్
ఆదోని



వంశీబర్కిలీ అవార్డు నాటికల పోటీలో ఉత్తమ నాటిక రచయిత అవార్డు "సర్పయాగం రచయిత శ్రీ కామేశ్వరరావుకి శ్రీమతి మాదిరెడ్డి సులోచన రోలింగ్ షీల్డు" అందిస్తున్న శ్రీమతి మాదిరెడ్డి సులోచన

---

నవంబర్ "జ్యోతి" ఎంతో ఆకర్షణీయంగా ఉన్నది. 'జ్యోతి'లో ప్రచురించిన "మబ్బు పీడిన సూర్యుడు" (వాకాటి పాండురంగారావు నవల) చాలా బాగున్నది. కార్టూనులన్నీ బాగున్నాయి. ఈ నెల "మీరా" సీరియల్ చాలా చక్కగా ఉన్నది. "మనసు సంగతి" డా॥ జయానాగరాజ్ గారు చాలా బాగా వివరించారు. కథలన్నీ బాగున్నాయి.

సోమనాధ్
పూనే.

నవంబర్ జ్యోతి మా యింటిల్లిపాదినీ ఆకర్షించింది. మినీ కథలు పెద్ద కథలతో పోటీ పడుతున్నట్లున్నాయి. వాకాటి వారి నవల కొత్త తరహాగా వుంది. శ్రీ శ్రీ నిర్వహిస్తున్న పదబంధ ప్రహేళిక చాలా కష్టంగా ఉంటోంది. "రాజీ" కథ బావుంది.

వై. బాలరాజ్
జనగాం.

ఇటీవలి జ్యోతి సంచికలలో కొడవటిగంటి కుటుంబరావు గారి మీద జ్వాలాముఖి వ్యాసం, మాక్స్‌ముల్లర్ వెన్నముద్ద, డా॥ జయానాగరాజ్ గారి మనోవిజ్ఞానం జ్యోతికి కొత్త వన్నెలు తెచ్చాయి. పాలకోడేటి సత్యనారాయణ గారి టాక్సీ (కథానిక) బాగా నడిచింది.

చామర్తి వీరభద్రరావ్
చూరాచాంద్‌పూర్ (మణిపూర్)

ఎన్. టి. రామారావు ముఖచిత్రంతో వెలువడిన నవంబర్ జ్యోతి చాల బాగుంది "టాక్సీ" కథ ఈ తరంలోని ఒక రకం మనుషులకు బుద్ధిచెప్పే విధంగా ఉంది "పిరికివాడు" "అపెమర్థుని ప్రేమ లీల" కథలు చకచక్కగా ఉన్నాయి జ్యోతి ధర ఎక్కువగా గాంచకుండా 50 పైసలు మాత్రమే పెంచటం సంతోషించ దగ్గ విషయం.

జి.పెంటగౌడు
కామారెడ్డి

## డాక్టరాఫ్ లెటరేచర్!

జ్యోతి నవంబర్ '80 సంచికలో హైలైట్, సెర్చిలైట్, టార్చిలైట్ శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ గారి "లెటరేచర్". "ఇది సామాన్యుడి గోడు"ని ద్యోతకం చేసింది. రమణ గారి మేధకి ప్రశంసాపూర్వకంగా ఆయనకి "డాక్టర్ ఆఫ్ లెటరేచర్" గౌరవ పట్టా ప్రదానం చేయడం సబబు! ఆయనకి మా అభినందనలు.

ఇకపోతే, ఇదే సంచికలో శ్రీ దేవిప్రియ గారి "నాలుగు కందాలు" చాలా అర్థవంతంగా ఉన్నాయి అయితే ఆయన సంబోధించిన "ఈశ్వర్" ఎవరా అని ???

ఓలేటి వెంకట సుబ్బారావు
ఖమ్మం.

(దేవిప్రియ గారి కందాలలో సంబోధించబడిన ఈశ్వర్ ఆయన అనుంగు మిత్రులు, కథారచయిత. మద్రాసులోని ఒక ప్రముఖ సినీమా మాసపత్రికలో సహాయ సంపాదకులుగా వున్నారు.

-ఎడిటర్)

## కన్నడంలో తెలుగు కథ!

జ్యోతి 1980 దీపావళి సంచిక సర్వాంగ సుందరంగా వుంది నగ్నముని, శివారెడ్డి గార్ల కవితలు సంచికకే తలమానికం అయితే శ్రీ శ్రీకంఠమూర్తి అనువాదం చేసిన 'చావు-బతుకు' కన్నడ కథ సంచికకే అలంకారం. సంచికలో వున్న అన్ని కథలకంటె గొప్పగా వుంది ఆ కథ. కన్నడ మూలం అని వేయకపోతే అది తెలుగు కథ తెలుగు దేశంలో సంభవించిన ఉప్పెనని దృష్టిలో పెట్టుకుని రాయబడిన ఆ కథలాంటిది తెలుగులోనే ఇంతవరకూ రాలేదు. మన తెలుగు రచయిత లెవరూ ఆ సబ్జెక్టు మీద కథ రాయకపోవడం నిజంగా విచారకరం అచ్చ తెలుగు కథలు రాసి ప్రసిద్ధుడైన శ్రీకంఠమూర్తి కన్నడంలో వచ్చిన "తెలుగు జీవితం" వున్న కథను తెలుగు పాఠకులకు పరిచయం చేసినందుకు ఆయన్ని మనసారా అభినందిస్తున్నాను.

రావి నారాయణబాబు
హైదరాబాదు.

1980 జ్యోతి దీపావళి ప్రత్యేక సంచిక చదివే భాగ్యం ఈమధ్యనే కలిగింది. శ్రీ యర్రంశెట్టి శాయిగారు వ్రాసిన "కర్తి" కథ చదివాక ఈ ఉత్తరం రాయాలనిపించి రాస్తున్నాను. రచయిత యర్రంశెట్టి శాయిగారు "కర్తి" కథలో శంకర్రావ్ కర్తి విషయంలో జాగ్రత్తపడే సందర్భంలో "కాఫీ పొడి వాడే సంవత్సరానికోసారి అస్సాం వెళ్ళి కాఫీ తోటల దగ్గరుండి స్టాక్ తెచ్చుకొంటాడు." అని ప్రస్తావించారు. రచయిత అస్సాం కాఫీ తోటలకు ప్రసిద్ధి అని అభిప్రాయపడటంలో పొరబడ్డారని చెప్పక తప్పదు. ఎందుచేతనంటే అస్సాం లో చెప్పుకోదగ్గ కాఫీ తోటలు లేవు. ఇప్పుడిప్పుడే కాఫీ తోటల పెంపకానికి తగు చర్యలు తీసుకోబడుతున్నాయి. అస్సాంలో విరివిగా టీ తోటలే ఉన్నాయని గమనించ ప్రార్థన. అస్సాంలో నివశిస్తున్న దక్షిణ భారతీయులు తదితరులు మంచిరకం కాఫీపొడిని దక్షిణ భారత దేశం నుంచే తెచ్చుకొంటున్నారు. తెప్పించుకొంటున్నాను.

గంగుల ప్రకాశరావు
గౌహతి-11



ప్రముఖ వాణిజ్యవేత్త, కళాపోషకులు, ఎల్.వి. చారిటీస్ మేనేజింగ్ ట్రస్టీ శ్రీ ఎల్. వి. రామయ్య 1980 నవంబర్ 26న మద్రాసులోని తాజ్ కోరమండల్ హోటల్లో జరిగిన ఒక ప్రత్యేక అభినందనసభలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్యని సన్మానించారు. ఈ సభకి తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎమ్. జి. రామచంద్రన్, పెక్కుమంది మంత్రులూ హాజరయ్యారు. (పై చిత్రం)

ఆంధ్ర మహిళాసభవారు మహాకవి దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మృతి చిహ్నంగా నెలకొల్పిన "కృష్ణశాస్త్రి జయంతి బహుమతి" తొలి పురస్కృతి డా॥ ఎన్.గోపీ రచించిన వచన కవితా సంపుటి 'తంగేడుపూలు'కి లభించింది. హైదరాబాదు ఆంధ్ర మహిళా సభలో ఇటీవల జరిగిన ఒక సభలో ఈ బహుమతిని శ్రీ గోపీకి బహూకరించారు. బహుమతి ప్రదానోత్సవంలో పాల్గొన్న శ్రీ రావూరి, డా॥ సి. నారాయణరెడ్డి, డా॥ ఎన్. గోపీ చిత్రంలో వున్నారు. (క్రింది చిత్రం)



"వదినా. మావయ్యొచ్చారు" ఆడబడుచు [illegible] గబగబా బీరువాలోని స్టీలు చెంబు బయటికి తీసి కడిగి దాన్నిండా నీళ్ళు తీసుకుని అంత వేగంగానూ వీధిలోకి వచ్చింది పార్వతి.

కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళ చెంబు అందిస్తూ "అమ్మా అన్నయ్యా అంతా బావున్నారా నాన్నా" అని పలకరించింది ఆయన అందించిన సంచి అందుకుంటూ.

"అం అం బాగానే వున్నారు...." అంటూ కాళ్ళు కడుక్కుంటూ ఇంటినీ పరిసరాల్నీ పరిశీలనగా చూడసాగారు వెంకట్రామయ్యగారు.

తను కాపరానికొచ్చాక తనని చూట్టానికి తండ్రి రావడం ఇప్పుడే గనుక అనిర్వచనీయమైన ఆనందంతో తనవు పులకిస్తోంటే తండ్రికే చూస్తోన్న పార్వతికేదో గుర్తు రావడంతో గబగబా వంటింట్లోకెళ్ళి గ్లాసుడు నీళ్ళలో ఇంత పంచదార వేసి కలుపుకు వచ్చింది.

పై పంచెతో చేతులు తుడుచుకుంటూ లోపలికొస్తోన్న తండ్రిని తమగదిలోకి తీసుకెళ్ళి కూర్చోబెట్టి గ్లాసందించింది.

"ఇక్కడంతా బావుటోంది కదమ్మా నీకూ"

"బాగానే వుంటోంది నాన్నా"

"అత్తగారూ ఆడబడుచూ కలివిడైన మనుషులే అనుకుంటాను".

తలూపింది.

"అల్లుడుగారింకా ఆఫీసునుంచి రాలేదా?"

"ఇంకా రాలేదు నాన్నా, ఇంకో గంటలో వస్తారు" అని చెప్పి ఇప్పుడే వస్తానంటూ లోపలికెళ్ళింది తండ్రి తెచ్చిన మిఠాయి పొట్లంతో

"పార్వతీ మీ నాన్న వచ్చార్టగా" ప్రక్కింటికి బాతాఖానీకి వెళ్ళిన అత్తగారు వియ్యంకుడి ఆగమన వార్త విని పరుగునొచ్చి అంది మెల్లగా.

"అవునత్తయ్యా" అంటూ పొట్లం అందిచ్చింది అత్తగారికి.

"పొయ్యిమీద కాఫీ పెట్టకపోయావా"

"మా నాన్న కాఫీ తాగరత్తయ్యా"

"పోనీ మజ్జిగ నీళ్ళన్నా ఇవ్వు. దాహానికేమీ ఇవ్వకపోతే ఏం బావుంటుంది"

పంచదార నీళ్ళిచ్చానని అత్తగారితో చెప్పలేక అలాగే అని తలూపి పెద్ద గ్లాసుతో మజ్జిగ తీసుకెళ్ళి ఇచ్చింది తండ్రికి

"మళ్ళీ ఎందుకమ్మా" అంటూనే అందుకుని "పాడి బాగానే వుందనుకుంటాను" అన్నారు

"వుంది నాన్నా. ప్రొద్దున్న శేరు సాయంత్రం శేరూ ఇస్తుంది గేదె."

"బాగానే వుంది మీ మావగారు వూళ్ళో వున్నారుకదా"

"ఆం-పొలం వెళ్ళారు - ఇంకాస్సేపట్లో వచ్చేస్తారు"

"దానికేంలే అయితే అల్లుడుగారు రోజూ ఆఫీసుకి సైకిలుమీద వెళ్తున్నారన్నమాట. నర్సాపురం అంటే వూరుప్రక్క వూరా ఏమన్నానా! దగ్గిర దగ్గిర అయిదు మైళ్ళ దూరం వుంటుంది. అంటే రోజూ పదిమైళ్ళు సైకిలు త్రొక్కాలన్నమాట."

అవునన్నట్టు తలూపింది పార్వతి.

# ఒకమనిషి - రెండు పాత్రలు

— సింహప్రసాద్

"అబ్బే-గోపిక్షయంలో మాత్రం అల్లుడి గారి పద్ధతి నాకేం నచ్చలేదమ్మా. నిక్షేప లా వేరడిపోయి నర్సాపురాన్ని కాపరం పెడితే నీకూ అతగాడికీ కూడా హాయిగా వుండదూ?"

తండ్రి మాటలకి కొంచెం కలవరపడింది పార్వతి. ఇంట్లోవాళ్లెవరైనా ఆ మాటలు విన్నారేమోనని హాల్లోకోసారి చూసి నెమ్మదిగా ర్చింది.

"అప్పరే-అల్లుడుగారికి జీతం నెలకి నాలు గైదొందల వరకూ వస్తుందిగా ఏమాత్రం నిలవేలారేమిటి?"

గతుక్కుమందామె ఏం చెప్పాలో తెలీక దిక్కుదిక్కుమంటూ చూసింది.

"ఏమిటో మాటాడవ్?"

అబ్బే-ఏంలేదు-అసలు-అహ జీతం రాగానే ఆయన డబ్బంతా మావగారికిచ్చేస్తారు నాన్నా పై ఖర్చులకని పదిరూపాయలిస్తా యన ఈయనకి."

"ఏవిటీ!" నోట్లోంచి చుట్ట బయటికితీసి ఆశ్చర్యంగా చూసి అన్నారు. "వచ్చిన జీతమంతా తెచ్చి మీ మావగారి చేతిలో పోసేస్తాడా అల్లుడు? అతగాడేమో భిక్షం వేసినట్లు పది రూపాయలిస్తే మీ ఆయన తీసుకోడిసూ పుచ్చుకుంటాడా?! బాగానేవుంది వరస. నే నింకా అల్లుడు తెలివైనవాడూ నాలుగురాళ్ళు వెనకేస్తున్నాడూ అనుకుంటున్నానుగాని సంపాదనంతా ఇలా వున్నట్లో పోసేస్తున్నా డనుకోలేదు...." ఇంకా ఏదో అనబోతూంటే వీధిలో కిర్రుచెప్పుల చప్పుడయ్యింది.

మావగా రొచ్చినట్టున్నారు...." పార్వతి అంది.

గదిలోంచి బయటికొచ్చి వియ్యంకుడ్ని పలకరించారు వెంకట్రామయ్యగారు. తర్వా తిద్దరూ కూర్చుని పిచ్చాపాటి మాట్లాడు కున్నారు కష్టం సుఖం చెప్పుకున్నారు పెద్ద మనిషి తరహాగా.

సాయంత్రం అరవుతోంటే నారాయణరావు వచ్చాడు ఆఫీసునుంచి వీధిలోనే మావగార్ని చూసి "ఎంతసేపయ్యిందండీ వచ్చి" అని పలకరించాడు.

"ఇందాకే, గాలి తిరిగాక. ఏమయ్యా యి-అల్లుడుగారొచ్చారు మంచినీళ్ళివ్వు. బట్టలు మార్చుకోండి అలా పొలం వెళ్దాం"

మరి పావుగంటకి వెంకట్రామయ్యగారూ నారాయణరావూ కబుర్లు చెప్పుకొంటూ పొలాలవైపెళ్ళారు.

వేసవి కాలం వడతో సూర్యుడికా పశ్చిమ దేశి ముంగిట్లోనే తచ్చాడుతున్నాడు

"అన్నట్టు రోజూ నర్సాపురం సైకిలుమీద వెళ్లి వస్తూ అవస్థపడేకన్నా అమ్మాయిని తీసుకెళ్లి అక్కడే మకాం పెట్టేస్తే బావుంటుంది కదోయ్" వెంకట్రామయ్యగా రన్నారు వెల్లగా అసలుకి పయనంలోకొస్తూ.

"అయిదుమైళ్ళే కదండీ అంతా పోగజేస్తే రానూపోనూ ఓగంట ప్రయాణం"

"అయినా ఇబ్బంది ఇబ్బందే కదా. ఒప్పుకుంటావా?"

"నిజవే అనుకోండీ-కానీ ఇదికి పెద్దవాడ్ని కదా మావాళ్ల నొదిలేసి నాదారిన నేను వెళ్లి పోతే ఏ బావుంటుంది చెప్పండి?"

"ఎవరికి బావు-దాలయ్యా? నీకు బావుంటే చాల్దా? మరి కేసయ్యా ఇప్పట్నుంచీ మీ బాగు మీరు చూసుకోపోతే రేపు పిల్లాజల్లా పుట్టేక అప్పటికప్పుడు తడుముకుంటే ఏం లాభమయ్యా? నేనన్నానని దుడుకనవ్వే ఆలోచించి చూడు జీతంరాళ్ళు తెచ్చి మీ నాన్న కివ్వడం తప్పని అని నేననను. నీ జీతం గాక మీ పొలంమీద ఏడాదికో వందబస్తా వస్తోందిగా అదీ ఇదీ మీ నాన్నేం జేస్తు న్నారో ఆలోచించు. పెళ్లైన ఈ ఏడాదిలో అమ్మాయికి కాసు బంగారమైనా కొన్నారా అంటే అదీ లేదుకదా. మీ అక్కల పెట్టుపోత లకో, మీ తమ్ముళ్ల చదువులకో వమ్మాడి సంసారపు ఖర్చులకో అంతా ఖర్చయి పోతోంది. అవునా?

తలూపాడు నారాయణరావు

"ఇంకో రెండేళ్ళు పోతే నీ చెల్లెలు పెళ్లి కెదుగుతుందికదా. మళ్లీ ఆ ఖర్చొకటి ఇంకో నాలుగైదేళ్లకిగాని నీ తమ్ముళ్ల చదువులవ్వవ్. దానాదీనా తేలేదేంటంటే ఇప్పుడు నీ జేబులో



# 1980 కథల పోటీ ఫలితాలు

ప్రథమ బహుమతి : రు. 750

కథ : మురికి

రచయిత : సదానందశారద

ద్వితీయ బహుమతి : రు. 400

కథ : మరో మొరావియా

రచయిత : కే ఎస్వీ

తృతీయ బహుమతి : రు. 300

కథ : గోడమీది రాతలు

రచయిత్రి : టి. శశికళ

ప్రత్యేక బహుమతి రు. 116 పొందిన పది కథలు

1. హింస—పి. శ్రీనివాసశాస్త్రి
2. సశేషం—జె. సుబ్బలక్ష్మి
3. జీవనస్పర్శ—వి. రాజారామమోహనరావు
4. ఐ లవ్ యూ—జి. పి. జీవి
5. ఎందుకిట్లా జరిగింది?—అరవింద
6. ట్రాఫిక్—నాగరాజు
7. ఇంటావిడ మొగుడు—నటరాజ్ ముక్కామల
8. నచ్చనిదొకటి—లక్ష్మి
9. బంగారుబొమ్మ—టి. రాఘవేంద్రరావు
10. అన్నదానం—ప్రసన్నకుమార్ సర్రాజు

ఎంతుంది! అయిదారేళ్లు పోయేంతకూడా అంతే వుంటుంది. కాని అప్పటికి పిల్లాజల్లా పుడతారు. వాళ్ల చదువూ సంధ్యా చూడాలి. సంసారపు ఖర్చూ పెరుగుతుంది కదా. మీరిప్పుడు నాలుగురాళ్లు వెనకేసుకోకపోతే రేపెలాఅంటున్నాను నువ్వే ఆలోచించు..."

అల్లుడి మొఖంలో ఇబ్బంది కదలుతూండడం చూసి అన్నారు. "మా చిన్నన్నగారి అల్లుడు రాంబాబుని ఎరుగుదువుకదా. అతడేం చేశాడో తెలుసా? పెళ్ళయ్యీ అవ్వగానే ఆస్తులు పంచెయ్యమన్నాడు. ఇతడివాటాకి మూడెకరా లొచ్చింది మా చిన్నాన్నో రెండెకరాలిచ్చాడు కదా. వెరసిఅయిదెకరాలయ్యింది జీతరాళ్ళతో తన ఖర్చుచేసుకుంటూ అయిదెకరాల పంటా నిలవేసుకుంటూ ఏడాదికి ఎకరం పొలం చొప్పున కొంటున్నాడు మొన్నటి నెల్లోనే ఉద్యోగం చేస్తున్న వూళ్ళో ఇంటికి స్థలం కొన్నాట్ట ఈ పంటలు చేతికి రాగానే ఇల్లు కట్టేస్తాడు కూడాను. మీరూ అలాగే నిలవేసుకుంటే ముందు ముందు ఖర్చుని తట్టుకోవచ్చు. సుఖపడనూవచ్చు. ఇక ఈ జంయూటాలంటావా ఇదెప్పుడూ వుండేవే నీ జీతమంతా ఉమ్మట్లో పెట్టేవని నీకెక్కువెక్కువ ముట్టజెబుతా రనుకుంటున్నావేమో-అదంతా వట్టిమాట!"

మావగారు చెప్పేదీ నిజమే అన్పించింది నారాయణరావుకి. కాని మనస్సులో ఏదో గుంజాటన! నలుగురూ ఏమంటారో నన్న భయం! కన్నవాళ్ళకి ద్రోహం చెయ్యడమా అన్న సంకోచం!

"మీరన్నదీ నిజమే అనుకోండి- కాని నలుగురూ నాలుగు మాటలనరూ, తల్లిదండ్రులకి పెట్టాల్సొస్తుందని వేరడిపోయాడనీ"

అల్లుడు మెల్లగా దార్లో కొస్తున్నందుకు సంబరపడిపోతున్నారు వెంకట్రామయ్యగారు "చూడు అల్లుడూ - తనది కాకపోతే తాటి పట్టెకి ఎదురుదేకమన్నాట్ట. ఈ జనం కూడా అలాటి వాళ్ళే తమకైతే ఒక మాటా బయటి వాళ్ళకైతే యింకో మాటా అంటూంటారు. అంచేత మనం వాళ్ళని పట్టించుకోకూడదు నువ్వేవ నాపదేదే పండుతుందికదా. అంచేత నువ్వేలాటి భయాలేం పెట్టుకోకు. మరీ లోకులేమైనా అంటారని మరీ యిదిగా వుంటే కాస్త దూరంగా బదిలీ చేయించుకో. మాటా దక్కుతుంది మనీ మిగులుతుంది. ఎంత లేకన్నా నెలకో వంద రూపాయలు వెనకేసుకోవచ్చు. మా అమ్మాయికి కట్నంగా యిచ్చిన పొలంమీది పంటా అదీ కలిపితే మూడేళ్ళకో ఎకరం పొలం కొనొచ్చు ఇంక నువ్వేలాటి అనుమానాలూ పెట్టుకోక-నీ మేలుకోరి చెబుతున్నాను-నేను చెప్పినట్టు నడచుకోవయ్యా అల్లుడూ ఏమంటావ్?"

"అలాగే నండి."

"అదీ మగాడి తడ మంటే. నువ్వు మాట మీద నిలబడు చాలు. మిగిలిన ముగ్గులు నేను పెడతానుగా. అబ్బో చాలా చీకటి పడిందయ్యా ఇక వెళ్దామా?"

"పదండి."

ఇద్దరూ వెనుదిరిగారు.

మర్నాడు ఉదయమే వెళ్ళిపోతానన్న వెంకట్రామయ్యగార్ని ఫోన్‌చేసి వెళ్ళమని ఆపేశారు నారాయణరావూ అతడి తండ్రీను

నారాయణరావు తొమ్మిదింటికే ఫోంచేసి ఆఫీసు కెళ్ళడానికి సైకిలు తీస్తోంటే "నేను ఫోంచేసి వెడతాను అల్లుడూ - నేన్చెప్పింది మాత్రం మర్చిపోకేం" అన్నారు వెంకట్రామయ్యగారు.

అలాగే అని తలూపి శలవు తీసుకు వెళ్ళిపోయాడతడు.

గంగిగోవులాంటి అల్లుడు దొరికేడని మురిసిపోయారు. ఆ పిమ్మట గర్వపడ్డారు కూడాను.

తనూ ఫోంచేసి ప్రయాణమవుతూ మెల్లగా అన్నారు కూతురితో "అల్లుడిగారితో నిన్న మాటాడాన్లే. నర్సాపురాన్ని మకాం పెట్టడమో, ఇంకో వూరు బదిలీ చేయించుకోవడమో చేస్తానన్నాడు నువ్వుకూడా కాస్త పోరుతూండు. ఈ ఉమ్మడి సంసారం నుంచి ఎంత త్వరగా విడిపోతే అంత మంచిది. వేరడిపోతే మీకు జీతమూ మిగుల్తుంది నీకిచ్చిన పొలం పంటా దక్కుతుంది లేకపోతే మీ

మావగారు మీ సొమ్మని కూడా ఉమ్మడిలో కలిపేసి నీ ఆడపడుచుల పెళ్ళిళ్ళకీ పురుళ్ళకి నీ మరుదుల చదువులకీ చట్టుబండలకి హారతి కర్పూరంలా వెలిగించి ఆఖరికి మీకింత అప్పు పంచుతాడు. తెల్సిందా? ముందు మీరు వేరే కాపురం పెడితే తర్వాత నేనొచ్చి ఆస్తి పంపకాల గురించి మాట్లాడతాను. తెల్సిందా? తెలివిగా వ్యవహరించి మీ బాగు మీరు చూసుకోవాల్సిన సమయం ఇదే. అంతగా అల్లుడు కాస్త భీష్మించితే నా కబురు పెట్టు-వచ్చి మాట్లాడతాను."

అన్నిటికీ ఆనందంగా తలూపింది పార్వతి.

అందరితోనూ పేరుపేరునా పిలిచి మరీ వెళ్లొస్తానన్చెప్పి వచ్చేశారు వెంకటామయ్య విజయగర్వంతో.

ఇంట్లో కొస్తూనే "అల్లుడు చాలా బుద్ధిమంతుడేవ్" అన్నారు భార్యతో.

"ఏం? మావగారికి మనుగడుపు అల్లుడ మర్యాదలు చేశారేవిటీ" నవ్వుతూ అడిగిందామె.

"మా అమ్మాయి ఇంటిదగ్గర మన మర్యాదలకి లోటేమిటిగానీ ఎలాగోలా ఉమ్మడిలోంచి వేరడిపోయి వేరే కాపురం పెట్టేసుకోమన్నాను. సరే అన్నాడు అల్లుడు."

"ఊఁ- బాగానే వుంది" నిట్టూరుస్తూ అందావిడ.

"అదేవిటే- నేనన్న దాంట్లో తప్పేముందనీ. వాళ్ళ మేలుకోరి ఆ మాత్రమైనా చెయ్యకపోతే ఇక మనముండి లాభమేమిటే."

"వాళ్ళ సంగతి తరవాత చూద్దురుగాని కానీ ముందు మనింటి సంగతి చూడండి. మన పెద్దాడు వేరడిపోతాట్ట."

"ఎవరే- మన రామ్మూర్తా?!" వెర్రిగా అన్నారు బ్రమాన్పడి చూస్తూ.

"అవునండీ. ఉమ్మడిలో వుండి ఉమ్మడి పొలంలో రెక్కలు ముక్కలు చేసుకుంటూ ఎద్దులా మేమెందుకు పనిచెయ్యాలీ, మిగిలిన

పిల్లలు చ...పుకుంటున్నారు. రేపు ఉద్యోగాలూ చేసుకుంటారు. ఆసిలో బాగా కి వస్తారు. ఆఖరికి అందరితో బాటే మాకూ ఏకసమో అరెకరమో పొలం పంచుతారు. దాంతో మేమెలా బ్రతకాలి? ఇప్పుడే వేరడిపోయి బండీ ఎడ్లూ, కొనుక్కుని పట్టుబడికి తోలుకుంటాం అంటూ నిశ్చింతగా తగూవేసుకుంది డీ కోడలూ!" ఇంకా ఏదో చెప్పాలనుకుందిగాని కన్నీళ్ళు వులికి రావడంతో ఆగిపోయిందామె.

వెంకట్రామయ్యగారి కంతా అయోమయంగా వుంది. ఆవేశం, దుఃఖం కూడా పొంగి వచ్చాయ్. "ఒరేయ్ రామ్మూర్తీ" అని పిలిచారు గట్టిగా.

గదిలోంచి రామ్మూర్తి భార్యా ఆ వెనుక రామ్మూర్తీ వచ్చారు.

"ఏంట్రా వేరడిపోతా నంటున్నారట. ఆవదాని మాటట్టుకుని ఉమ్మడి సంసారం నిలువునా చీల్చడానికి సిద్ధమవుతావట్రా? నలుగుర్లో మన పరువూ ప్రతిష్టా ఏంకావాలనుకుంటున్నావురా? నీ తమ్ముళ్లూ చెల్లెళ్లూ చిన్నవాళ్ళు- వాళ్ళ గతేమవ్వాలనుకుంటున్నావురా? ఇంటికి పెద్ద కొడుకువే. వాళ్ళ మంచీ చెడ్డా చూడాల్సిన బాధ్యత నీమీద లేదట్రా? వాళ్ళు నీలా వాళ్ళ కాళ్ళమీద నిలబడేవరకైనా కలిసుండకపోతే పసివాళ్లు వాళ్లేమైపోతార్రా? ఈ సంసారాన్నీడ్చడం ఎలా రా? ఒరేయ్ రామ్మూర్తీ- ఒక్కసారన్ని విషయాలూ ఆలోచించి చూడరా. పెద్దవాడివి నువ్వే ఇలా వేరడిపోతే నలుగురూ ఏమనుకుంటారో ఆలోచించరా. వాళ్ళకి నీలాగే మంచి సంబంధాలు రావొద్దట్రా. పెద్దవాణ్ని చెబుతున్నాను కలిసి వుండేనే సుఖం వుందిరా- నా మాటవిని అలాటి అభిప్రాయాలు పెట్టుకోకు. మనలో పరాయి వాళ్ళెవరున్నార్రా తినేస్తున్నారూ పాడు జేస్తున్నారూ అనుకోడానికి మేంగాని నీ తమ్ముళ్లూ చెల్లెళ్లుగాని పరాయివాళ్ళంటావా కిదా మరిందులో తేడా లెంచకురా? లేనిపోనివి చెప్పి నీ మనసు నెవరు విరిచేశార్రా" ఘద్గదేకంగా ఆవేదనతో అన్నారు.

"మీ నాన్నగారు చెప్పినట్టు వింటే బాగు పడతాం కాబోలు! మీ తమ్ముళ్ళ చదువులూ మీ చెల్లెళ్ల పెళ్ళిళ్ళూ అయ్యేప్పటికి ఇంకేం మిగులుందో మనకేం పంచుతారో అదికూడా చెప్పమనండి" వ్యంగ్యంగా అంది కోడలు

"నేన్నితో మాట్లాట్టంలేదు మాట్లాడవేంరా రామూ ఏం బెల్లంకొట్టిన రాయిలా."

"ఆయనేం మాట్లాడతార్లెండి. మీ అబ్బాయికి మీరేం బోధించారో అది ఆ తగారికి మీరు చెబుతోంటే ఆయనా విన్నారు."

"అండే... అండే..."

"ఇంకా ఏమీ ఎరగనట్టు నాటకాలాడతారెందుకండీ అక్కడేమో అల్లుడ్ని వేరడిపోమని హితబోధచేసి వచ్చారా? ఇక్కడేమో కొడుకుని వేరుపెట్టడానికి పరవులూ మర్యాదలూ అడ్డొచ్చాయా మీకు కూతురూ అల్లుళ్ళు బాగేకాని కొడుకూ కోడళ్ళు బాగు అక్కర్లేదాండీ" వయసు వసే సదండీ కాస మంచీ జ్ఞానమూ వుండాలి మాటలకీ చేతలకీ కొంచెం కాకపోతే కొంచెమైనా పొంతనుండాలి" అంటూ మావగార్ని దులిపేసి "విన్నారండీ మీ నాన్నగారి మాటలూ? పెద్దవాళ్ళు పెద్దవాళ్లు- వాళ్లు నొచ్చుకుంటారు అన్నారుగా. ఇప్పుడేమంటారండీ?" అంది భర్తవైపు తిరిగి రామ్మూర్తి భార్య.

శిలావిగ్రహంలా నిలబడి చూడసాగింది వెంకట్రామయ్యగారి భార్య

వెంకట్రామయ్యగారికంతా అయోమయంగా అగమ్యగోచరంగా వుంది. కళ్లు బైర్లు క్రమ్ముతున్నాయ్. కన్నీళ్లు వరదలై పడుతున్నాయ్. గుండె ముక్కలైపోతున్నది శరీరంలోని రక్తమంతా కాళ్ళలోకి పరుగులు తీస్తోంది. నిస్సత్తువ నిలువెల్లా ఆక్రమిస్తోంది తలలో నరాలు పట్‌పట్‌మని తెగిపోతున్న చప్పుళ్ళు అంతకంతకీ ఎక్కువవుతున్నాయ్

కళ్ళముందు తన చిన్న ఇల్లు ముక్కలై పోతున్నట్టుగా కన్పించడంతో స్పృహతప్పి పడిపోయాడాయన.

కాని—

ఆయనకి వియ్యంకుడి ఇల్లు మాత్రం ఆ సమయంలో గుర్తురాలేదు।



# కళలు - శాస్త్రీయ విజ్ఞానం

రచయిత : కొడవటిగంటి కుటుంబరావు

ప్రచురణ : 'విరసం'

సెప్టెంబరు 1980

వెల : ఆరు రూపాయలు

ప్రతులకు : సృజన, హనుమకొండ, వరంగల్-2

36 వ్యాసాలున్న ఈ 190 పేజీల పుస్తకంలో ఈనాటి—అంటే క్రీస్తుశకం 1980 డిసెంబరునాటి మనిషి జీవితాన్ని, నాగరికతని, సంస్కృతిని, కళల్ని, భయసందేహాల్ని, జయాపజయాల్ని కుటుంబరావుగారు ఏకబిగిని అవపోశన పట్టారన్నా, అట్లాంటి రచయిత మరి తెలుగులో లేడన్నా, ఆయన మేధావులకు మేధావన్నా నేను మరేమన్నా—

సగటు తెలుగు పాఠకుడు ఈ పుస్తకాన్ని ఒక పట్టాన చదవడు.

అది అంతే. ఈ దుస్థితి తెలుగు పాఠకునిదా, తెలుగు దేశానిదా, జాతిదా అంటే అన్నిన్ను, అందరిదీను.

గురజాడ పోయి 80 ఏళ్లయ్యాక, కమ్యూనిస్టులు ఆయన్ని పైకి తీశారు మొన్న మొన్నటిదాకా ఆయన కవా, అకవా అని పండితులు ఎడతెగని తర్కాలు చేస్తూనే వున్నారు. కారణం మరేంలేదు. ఆయన్ని భుజాని కెత్తుకున్నవాళ్లు కమ్యూనిస్టులు. మన కలగూరగంప ప్రతిపక్షాలకూడ ఒక భారతీయ జనతాపార్టీ ఈ రోజున ఎందుకో విడకాతిగా, అస్పృశ్యంగా కనిపిస్తోందిగాని కమ్యూనిస్టులు—ఆ మార్క్సు మహాశయుడు ఏ క్షణాన పుట్టాడో, రాశాడోగాని - కమ్యూనిస్టులు ఏ దేశంలోనూ, సమాజంలోనూ, ఏకాలంలోనూ కూడ అంటరానివారే.

మరీ విచిత్రం-కమ్యూనిస్టుల్లో వీర కమ్యూనిస్టు అయిన కొల్లా వెంకయ్యగారికి గురజాడ అభ్యుదయకవి కాకపోవడమే కాదు, అభ్యుదయ నిరోధకుడుగా కూడ కనిపించాడు ఇంక యీనాటి కమ్యూనిస్టు నాయకులలో కొందరికి కొడవటిగంటే అభ్యుదయ నిరోధకుడిగా కనిపిస్తే మనం ఆశ్చర్యపడనక్కర్లేదు.

ఈ వంకరలు ఎందుకొస్తాయంటే డొంక వెంటే యింటికి తిరిగొచ్చే పశువుల్లాగ ఎవడి గాడంట, దారంట, వాడు నడవడం సుళువు.



ఒకడు రామాయణాన్నే స్పెషలైజు చేసి రేడియోలో, బయటా కూడ దాన్నే నమ్ముకుని, అమ్ముకుని బతుకుతాడు. మరొకడు రామాయణాన్ని తిట్టటమే స్పెషలైజు చేస్తారు ఒకరు పగలనక రేయనక ఈ వ్యవస్థని తిట్టిపోస్తూ యింత డబ్బు, కీర్తి గడిస్తాడు. మరొకడు అధికారం ఎక్కడ కనబడనీ—సాష్టాంగపడి అవతలివాడు జుట్టుపట్టుకుని లేపేదాకా వలెకు డా స్తోత్రం అభినయం చేస్తాడు.

ఇట్లా ఎవడి దుకాణం వాడు పెట్టుకుంటాడు. తన దినుసులేవో అమ్ముకుని జీవనం సాగిస్తాడు.

ఇక కొడవటిగంటో? ఆఖరి శ్వాసవరకు

కలం ఆడస్తూ టన్నులకొద్దీ రాశాడు. అందులో తననిగురించి రాసుకుంది కొన్ని గ్రాములు మాత్రం.

"నా చిన్నన్నగారు" అని ఆయన రాసి ది ఆయనకి చుట్టంకాని కృష్ణశాస్త్రి గురించి.

"నా కథారచన" అని ఆయన రాసింది తన అశక్తత గురించి. ఏమంటాడో చూడండి:

"నేను అభ్యుదయ రచనలు చేయగలను గాని ప్రజాసాహిత్యమూ, శ్రామికవర్గ సాహిత్యమూ సృష్టి చేయలేను. అందుచేత నా రచనలు ప్రజాసామాన్యాన్నీ శ్రామికులనూ ఉత్తేజపరచలేవు."

ఆయన రాసిన "పుచ్చిపోయిన జీవితం" తనది కాదు. జాతిది. ఆమాటకొస్తే మానవ జాతిది.

మేధావులకి, శాస్త్రజ్ఞులకి, కళాకారులకి, సాహిత్యకారులకి ఏం చెయ్యాలో, అది ఎందుకు చెయ్యాలో ఆయన చెప్పాడు. ఉదాహరణకి:

"మనిషికి సరయిన అవగాహనా జీవితానుభవమూ ఉండటం సరయిన దృక్పథానికి ముఖ్యం. కాని పరిమితమైన వాతావరణంలో పెరిగిన వ్యక్తికి జీవితానుభవమూ, జీవితాన్ని అవగాహన చేసుకునే శక్తీకూడ పరిమితంగానే వుంటాయి. ఈ లోపాన్ని తీర్చగలది సాహిత్యం."

ఈ పుస్తకంలో 'కళలు' అని రచయిత రాసింది ఒక సాహిత్యం గురించే. ఇక "శాస్త్ర విజ్ఞానం" కింద ఆయన తరచని శాస్త్రం లేదు. తర్కం, తత్వం, చరిత్ర, ఆర్థికశాస్త్రం, పదార్థ విజ్ఞానం, జీవశాస్త్రం, సమాజశాస్త్రం, మానవ శాస్త్రం— విశ్వాంతరాళమే హద్దు! ఈ అన్ని శాస్త్రాలలోనూ ఆయన బతికిన ఆఖరురోజు వరకూ ప్రతిరోజూ అప్ టు డేట్‌గా వుండి, సమగ్ర జ్ఞానంవేపు అడుగులు చాచారు కొడవటిగంటి. ఈనాటి మనిషి సమస్యనీ, జీవితాన్ని ఇంత వేదనతో ఇంత సీరియస్‌గా తీసుకున్న రచయిత కనీసం తెలుగు సాహిత్యంలో మరొకడు లేడు.

కొడవటిగంటి "దురదృష్టం", "శాపం" ఆయన జర్నలిస్టుగా మనుగడ సాగించవలసి రావటం, ప్రతిరోజూ పదో పదిహేనో పేజీలు తుంపులు తుంపులుగా రాయటం. ఇందులో ప్రతి చిన్నవ్యాసం ఒక్కో ఉద్గ్రంథంగా రాసి పుండవలసింది. వివరంగా, అధికారికంగా, ప్రవక్తలాగ రాసి వుండవలసింది. ఆ పుస్తకాలు యీ పుస్తకం మోస్తరుగా న్యూస్‌ప్రింటు కాయితంమీద వేయకూడదు. రవివర్మ చిత్రాల్లాగ, క్రిస్టియన్ల బైబిళ్లలాగ కళకళలాడుతూ రావాలి. తెలుగువాడు బాగుపడాలి.

ఈ పుస్తకంలో వ్యాసాల్ని కూర్చిన త్రిపురనేని మధుసూదనరావుగారికి, సేకరించిన కృష్ణాబాయి, చలసాని ప్రసాద్, చె. చయ్య ప్రభృతులకు, యితర అనేకానేక తెలుగుదేశపు సాహిత్య, సైన్సు అభిమానులకు ఈ సమీక్షకుడి విజ్ఞప్తి యిది: కొడవటిగంటి అసంఖ్యాక వ్యాసాల్ని వేర్వేరు శీర్షికల కింద విడదీసి పుస్తకాలు ప్రచురించండి. భాష సరళమైనా, విషయం విశ్లేషణాత్మకం గనక కామాలు, ఫుల్‌స్టాపుల దగ్గరినుంచీ శ్రద్ధ తీసుకోండి. అనంత శాస్త్రాల్ని అవి స్పృశిస్తాయి గనక, ఆయా శాస్త్రజ్ఞులతో టీకాతాత్పర్యాలు, వివరణలూ రాయించండి.

ఈ పని చేస్తే భవిష్యత్తును నిబ్బరంగా పట్టుకోవాలనుకున్న తెలుగు యువతీ యువకుల పని సుళువవుతుంది. వారికి కావలసిన పరికరాలు చాలావరకు మనం అందించినవాళ్ళమవుతాం. ఇది గొంతెమ్మ కోరికేం కాదని, కొంచెం నిస్వార్థం, 'సొంతలాభం కొంత' మానుకోవటం చాలనీ నా నమ్మకం.

ఈలోగా—

ఈ పుస్తకాలు వెయ్యి కాపీలే ముద్రించారు. జీవితాన్ని సీరియస్‌గా తీసుకొని, యింకా ప్రపంచంమీద ఆశలు వున్న ప్రతి ఒక్కడూ తొందరగా ఒక కాపీ సొంతం చేసుకోవాలి

—సి. ధర్మారావు




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమండి కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

**కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:**



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుపోయి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది



ఫలితం ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ

**కోల్గేట్‌లోని తాజా మింటే రుచివలన బ్రష్ చేసుకుంటున్నప్పుడు ఎంతో హాయి.**

**నోటి దుర్వాసనను ఆపండి...**
**కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో**
**దంతక్షయాన్ని**
**ఎదుర్కోండి!**




DC.G.74 TL

# ఖుషియా

మూలం
సాదత్ హసన్
తెనుగు
సాకారం రామాచార్య

("ఖుషియా" కథ "సాదత్ హసన్‌మంటో" అనే ప్రఖ్యాత ఉర్దూ రచయిత కథకి తెలుగు అనువాదం. మూల కథని హిందీలోకి తర్జుమా చేసింది శ్రీ మహావీర్ అయితే దానిని ప్రచురించింది హిందీ కథల పత్రిక "సారికా".

కీ. శే. మంటో, దేశ విభజనకు పూర్వం, బొంబే. ఢిల్లీ ప్రాంతంలో జీవించి, పాకిస్తాన్‌కి పోయిన ప్రఖ్యాత ఉర్దూ కథా రచయిత. ఈయన గురించి "సారికా" ఒక ప్రత్యేక సంచికనే ప్రచురించింది.

కథలు వ్రాసిన మంటో మీద పాకిస్తాన్ ప్రభుత్వం ఆ రోజులలోనే కోర్టులో (అశ్లీలంగా వున్నాయని) కేసు మోపింది. క్రింది కోర్టులు శిక్షలు విధించినా, పై కోర్టులు నిర్దోషిగా ప్రకటించాయి. అలాంటి విచారణకు హేతువయిన వాటిలో ఈ కథ ఒకటి. బొంబాయి జీవితం ఆధారంగా ఓ బ్రోకర్ అనుభవాన్ని అద్భుతంగా చిత్రించారీకథలో రచయిత.

మే 11, 1912 లో లూధియానా (పంజాబ్) ప్రాంతంలో జన్మించిన సాదత్ హసన్, అమృత్‌సర్, అలిగఢ్‌లలో చదువుకుని పెక్కు కథలు రాశారు. 18 ఆగస్టు 1954 లో మరణించారు.)

ఖుషియా ఆలోచనల్లో మునిగి వున్నాడు.

నల్ల పొగాకు కల్సిన తమలపాకు బన్‌వారీ కిళ్ళీకొట్టులో కట్టించి ప్రక్కనే రాతి అరుగు మీద కూర్చున్నాడు. దినమంతా టైర్లు తదితర మోటారు వాహనాలకు పనికివచ్చే సామాన్లతో నిండివుండే ఆ అరుగు, రాత్రి ఎనిమిదింటికల్లా ఖాళీ అవుతుంది.

నెమ్మదినెమ్మదిగా తమలపాకు నములుతూ ఆలోచిస్తున్నాడు ఖుషియా. పళ్ళసందుల్లోంచి పొగాకు పూటుకల్సిన తమలపాకురసం నోటినిండా తొణకటంతో, తన ఆలోచనలు పంటి కొసలలోంచి తమలపాకు రసంలో




స్నాన మాడ తున్నట్లనిపించింది బహుశా ఈ కారణంగానే ఉమ్మి వేయకుండా వుండిపోయాడు.

నోటినిండా ఘాటు జివ్వుమంటుంటే కొద్దిసేపటి క్రితం అనుభవాన్ని గూర్చి ఆలోచించసాగారు.

○ ○ ○

ఎప్పటిలానే, ఈ అరుగు చేరే ముందు ఖత్ వాడి లోని అయిదవ నెంబర్ వీధిలోకి పోయాడు. మంగుళూరునుంచి కొత్తగా వచ్చిన పిల్ల కాంతా ఆ వీధి చివర వుంటుంది. ఎవరో అన్నారు కాంతా ఇల్లు మార్చబోతోందని. అసలు తన వ్యాపారమే అలాంటిది. ప్రతి ఆడపిల్ల అలా తీసుకోవటం అవసరం. ఆ పని మీదే ఇందాక అక్కడికి వెళ్ళింది.

అతను తలుపు తట్టాడో లేదో, లోపలి నుంచి -

"ఎవరూ?"

అన్న మాట వినబడటంతో "నేను ఖుషియాని" అన్నాడు

మాట లోపలి గదిలోంచి వచ్చింది. రాగానే పట్లో తలుపు తెరచుకోగానే ఖుషియా లోనికి చొరబడ్డాడు. కాంతా లోనుంచి గడియ పెట్టాక ఖుషియా వెనుదిరిగి చూశాడు. దాంతో అతడి కంపరానికి మరో పరీక్ష అక్కర్లేదన్నట్లయ్యింది కాంతా అతనిముందు నగ్నంగా నిలబడి వుంది వాస్తవంగానే నగ్నంగా వుందామె. ఓ చిన్న తువ్వాలు కప్పుకుంది. అసలది తువ్వాలు కప్పుకోవటం కూడా కాదు. ఎందుకంటే దాచుకోగలవన్నీ అతని భీతి చెందిన కళ్ళముందే వున్నాయి:

"ఏం ఖుషియా ఇలా వచ్చావు? ఏదైనా ముఖ్యమైన పనా? నేనిప్పుడే స్నానం చేయబోతున్నాను. కూర్చో, కూర్చో, బయటి చాయివాడితో చాయికోసం చెప్పి వచ్చేవాన్ని. ఆ మూహారామ్ ఇక్కడ్నుంచి పారిపోయాడు తెల్సా?"

ఎన్నడూ చూడనిదేదో తన కళ్ళు చూడటంతో ఖుషియా అదిరిపోయాడు. ఏం జవాబివ్వాలో తోచలేదు. హఠాత్తుగా వివస్త్రని చూసిన చూపులు ఆ దృశ్యాన్ని నింపుకుని ఎక్కడైనా దాక్కోవాలని ఆరాటపడుతున్నాయి

"ఊఁ.... నువ్వెళ్ళి స్నానం చేయి" ఆ తొందర్లో ఇలాగే అనగల్గినా, ఆ వెంటనే తేరుకుని, "నీవీ స్థితిలో వుంటే తలుపెందుకు తీశావు? లోనుంచే మాటాడికే నేను తర్వాత కల్సుకునే వాణ్ణిగా! .... సరే .... నీవెళ్ళి స్నానం చేయి."

కాంతా నవ్వింది "నేను ఖుషియాని అని నువ్వంటే మనవాడేకదా ఏం పోయిందిలే రానీ.... అనుకున్నాను."

కాంతా నవ్వు ఇప్పటికీ గుండె మదులో నిండిపోయింది, ఇప్పటికీ కాంతా శరీరం మైనం బొమ్మలా కళ్ళముందు నిల్చిపోయింది. క్రమంగా ద్రవంలా కరుగుతూ అతనిలో ఇమడసాగింది.

ఆమె శరీరం ఎంత అందంగా వుంది! శరీరాన్ని అమ్ముకునే ఆడవాళ్ళుకూడా తమ శరీరాన్ని ఇంత సుందరంగా వుంచుకుంటారనే విషయం ఖుషియాకి మొదటిసారి తెల్సింది. ఈ విషయం కొంత గాభరా కల్గించినా, నగ్నంగా తనముందు ఆ మనిషి నిలబడిందే, ఏమాత్రం సిగ్గు బిడియం లేకుండా !...

"ఏం?" అని తననే అడిగింది పైగా! దీని జవాబు కాంతా ఇచ్చేసింది. "నేను, ఖుషియాని అని నువ్వంటే, మనవాడేకదా, ఏం పోయిందిలే రానీ . అనుకున్నాను!"

కాంతా, ఖుషియా ఒకే వృత్తికి చెందిన వాళ్లు. అతను బేరం కుదిర్చేవాడు (బ్రోకర్) ఆమెకి. ఈ దృష్టితో తాను ఆమె వాడే.... కాని తనముందు అలా అవడానికి ఇది కారణం కాజాలదు! "ఏదైనా ముఖ్యమయిన పనా?" కాంతా ప్రశ్నలో మరో అర్థం వెతకసాగాడు.

దీనర్థం ఒకే సమయంలో ఎంత స్పష్టంగా, ఎంత అస్పష్టంగా వుందంటే ఏ ముఖ్య నిర్ణయమూ దీనిపై తీసుకోలేక పోయాడు. కాంతానగ్న శరీరమే కళ్ళల్లో కదలాడతోంది. అది తబలాపై సగదీసి బిగించిన చర్మంలా బిగువుగా వుంది ఆమె జారిపోయే చూపులలో ఏదీ లెక్క పెట్టనంత నిర్లక్ష్యం. ఆ విచిత్ర స్థితిలోను, తాను కోమలం, సుకుమారమైన కాంతా శరీరంపై గుచ్చుకునే చూపుల్ని పాతాడు. కాని ఆమె ఏమాత్రం చలించలేదు. శిలా సుందరిలా ఏ అనుభూతీ లేకుండా నిల్చుండి పోయింది

### కవితకి కార్టూన్ :




ఒక మగవాడు ఆమె ముందు నిల్చున్నా! మగవాడు మాత్రం దుస్తులు దాటి స్త్రీని చూడ గల్గినా, దేవుడికే ఎరుక అలా ఊహల్లోనే మగవాడు ఎంతవరకు పోగలడో! కాని ... కాని ఆమె ఏమాత్రం స్పందించలేదు. పైగా ఆమె కళ్ళు... అప్పుడే లాండ్రీనుంచి స్నానమాడి వచ్చినట్లు! ఆమెకు కొంతైనా సిగ్గు ఏడిపిం వుండాల్సింది కొంతైనా తత్తరపాటు ఆమె కన్నుల్లో కన్పించాల్సింది! వేశ్య అనే ఒప్పుకున్నా, వేశ్యలంతా వివస్త్రలై నిల్చోరే!

ప్రోపర్ పనిచేస్తూ పదేళ్ళ గడిపాడు ఋషి. ఈ పదేళ్ళలో ఆ వృత్తిలో వుండే ఆడవాళ్ళ సూత్రాలన్నీ తెల్సుకున్నాడు. మచ్చుకి పాయిధుని లోని చివరివాడలోని పిల్ల ఓ యువకుణ్ణి అన్నగా చెప్పుకుని వుంటోంది అందుకనే కాబోలు "అఛుత్‌కన్య" (స్పృశించబడని కన్య)లోని రికార్డ.... *'కాహే కరతా మూరఖ్. ప్యార్ ప్యార్" (ఎందుకురా మూర్ఖుడా ప్రేమ ప్రేమ..) పాటని అరిగిన పాత డొక్కు పెట్టెలోద వాయించేది. ఆ పిల్లకు అశోక్‌కుమార్ మీద విపరీతమయిన ప్రేమ వుండేది. అలాగే దాదర్‌లో వుండే ప్యాంటు షర్టు వేసే అమ్మాయి సంగతి కూడా తెల్సు ఆ అమ్మాయి ప్రేమికుడు ఆవిడ కాళ్ల అందంగా 'మరాకో' ఉరఫ్ 'ఖూనే-తమన్నా'లో వేషంవేసిన ఇంగ్లీష్ తార కాళ్ళలా వున్నాయనటంతో ఆ వేషం వేసేది ఆ సినిమా ఆ అమ్మాయి ఎన్నిసార్లు చూసిందో!

---

* రచయిత ఈ కథని 1940 ప్రాంతంలో రాశాడు అప్పటికి ప్రస్తుతపు అశోక్‌కుమార్ హీరోగా వున్నాడు సినిమాల్లో. అశోక్‌కుమార్ కోసం 'అర్‌దిన్' 'ఆగోష్' మొదలైన సినిమాలకు రాశాడు ఈ రచయిత

మర్లిన్ శ్రీబెచ్ తన అందమైన కాళ్ళని రెండు లక్షలకు భీమాచేసి ప్యాంటు వేస్తుందని ఆవిడ ప్రియుడు చెప్పేవాట

మజగాం(వ్‌లో వుండే దక్షిణాది అమ్మాయి కథ కూడా తనకు తెల్సు. ఓ అందమయిన పిల్లాడ్ని కనాలనే కోరికతో, ఈ అమ్మాయి కాలేజీ కుర్రాళ్ళ వెనకే పడేది తన కోరిక తీరదని ఆవిడకు తెల్సు దానికి్కారణం ఆమెకి పిల్లల్ని కనే యోగ్యతలేదు అలాగే పగడాల లోలకులు వేసుకునే నల్లని మద్రాసీ అమ్మాయి మాత్రం! వచ్చిన రోజునే కొత్త మందుల్ని కొంటూ తాను తెలుపు కాలేనని తెల్సినా డబ్బు దండుగ చేస్తూ వుండేది.

వృత్తిలో వుండే అమ్మాయిల వివరాలు అన్నీ తనకు తెల్సు. కాని ఒకరోజు కాంతా కుమారి అనే అమ్మాయి నగ్నంగా తన ముందు కొస్తుందని మాత్రం ఎప్పుడూ వూహించలేదు. జన్మంతా కష్టపడ్డా జ్ఞాపకం రాని కష్టమైన అసలు పేరేదో గల ఈ పిల్ల తననిలా ఓరోజు ఆశ్చర్యంలో ముంచేస్తుందని ఏం తెల్సు తనకి?

ఆలోచిస్తూంటే— నోట్లో తమలపాకు రసం ఆసాంతం నిండి, అరగదీయబడ్డ పోక చెక్కలు, పళ్ళ కిందికి రాకుండా అటు ఆటు జారిపో నారంభించాయి. మెత్తని సిల్కు గడ్డపై పన్నీటి బిందువులు అద్దినట్టు అతని చిన్న నుదురుపై చెమట చుక్కలు పొంగి వచ్చాయి. 'కాంతా' దృశ్యం తలుచుకుంటు న్నప్పుడల్లా ఓ రకమయిన బెదురు వచ్చేది. తనని అవమానించినట్లు అనిపించేది.

ఇది అవమానం కాక మరేమిటి? ఓ ఆడపిల్ల వివస్త్రై ముందు కొచ్చేసి... "నువ్వు ఖుషి" అనేస్తోంది! ఖుషియా కాదు, తానో దిండు అయిపోయాడు! అనుకున్నాడు ఖుషియా.

ం ం

తనకు జరిగింది అవమానమే కొచ్చాడు ఖుషియా. తాను వుండే మనిషయినా, తనను మగవాడిగానే గుర్తించాలి. తెరాలుగా వస్తున్న అడ్డుని స్త్రీ తనముందు పాటించాలి

ఎప్పటిలాగా ఇల్లు మారేదీ, ఎక్కడికి మారేది తెల్సుకునేందుకే తాను కాంతా దగ్గరికి పోయింది. కేవలం వ్యాపార సంబంధంగానే తాను పోయింది.

తలుపు తట్టినప్పుడు లోపల ఏంచేస్తుందో అనే ఆలోచన కనుక అప్పుడు తనకు వచ్చి వుంటే మహా అయితే ఇలా అనుకునేవాడు:

—తలకు గడ్డమట్టుక పడుకుని ఉండాలి.

—తలలో పెట్టుకున్న బన్‌ని వెంట్రుక ల్లోంచి వేరు చేస్తూండాలి.

—తన ముక్కు భరించలేనంత వాసన వేస్తున్నా చంకలోని రోమాన్ని హేర్ రిమూవర్‌తో శుభ్రం చేస్తుండొచ్చు.

—మంచంపై ఒక్కతీ కూర్చుని, పేక పర్చి పేషంస్ ఆటలో నిమగ్నమై ఉండాలి.

ఇంతకన్నా అతని బుర్రలోకి మరో ఆలోచనే రాదు. ఎందుకంటే కాంతా తనతో ఇల్లు మరొకగ్ని వుంచుకోదని అతనికి తెల్సు కాని ఇలా జరుగుతుదని ఆతను వూహించనే లేదు. ఏదో పనివుండి వెళ్తే కాంతా- దుస్తులేసుకునే కాంతా, ఎప్పుడూ గుడ్డల్లో కన్పించే కాంతా తనముందు వివస్త్రంగా.... సంపూర్ణ వివస్త్రగా!? ఓ చిన్న తువ్వాలు అంతాదాచలేదుగదా! ఇదెలా అన్పించిందంటే తొక్క చేతిలో వున్నా అరటి పండు తన కెదురుగా నేలపై వాలినట్టు. కాదు అతనికి మరోలా అన్పించింది.... తానే స్వయంగా నగ్నంగా అయినట్టు. కథ ఇక్కడితో ఆగితే ఆశ్చర్యపడేవాడు కాదు. పేచీ ఎక్కడంటే ఆ మనిషి "నేను ఖుషియాని అని నువ్వంటే మనవాడేకదా ఏం పోయిందిలే రానీ... అనుకున్నాను" అంది! ఈ మాట అతన్ని తినేయడం మొదలెట్టింది.

పైగా ఆమె నవ్వటం కూడాను ...! తన లాగే తన నవ్వు నగ్నంగా వుండింది. ఆ నవ్వే కాదు, ఎంతవరకు ఆమె శరీరం కన్పించిందంటే ఒళ్ళంతా చిత్రిక పట్టారా అన్పించింది.

చిన్ననాటి అనుభవం ఒకటి గుర్తొచ్చింది ఖుషియాకు పొరుగున వుండే ఓ ఆవిడ "ఖుషియా బాబూ ఈ బకెట్‌నిండా నీళ్లు తీసుకురా" అనేది. తీరా నీళ్లు తెచ్చాక ఓ పలుచని ధోవతి అడ్డు తెరవెనక నుంచి: "లోనికొచ్చి నా ప్రక్కన ఆ బకెట్ వుంచు నా ఒళ్ళుకంతా సబ్బుందిరా అబ్బీ" అనేది లోనకెళ్ళి బకెట్ వుంచేవాడు. సబ్బు నురగల్లో వున్న ఓ వివస్త్ర స్త్రీ అతనికి కనిపించినా, ఏ మనోవికారమూ కలిగేదికాదు ఆ రోజుల్లో.

అయితే తాను ఆ రోజుల్లో చిన్నబాబు. చిన్న పిల్లాడికి, పురుషుడికి తేడా వుంటుంది! పిల్లలతో ఎవరు చాటుగా వుంటారు? కాని ఇప్పుడు తాను మగవాడు. ఇప్పుడు ఇరవై ఎనిమిదేళ్లు తనకు. ఇంత వయసుగల వాడి ముందు మనసు స్త్రీ కూడా అలా చేయదు

తనవేమనుకుంది కాంతా? నవయువకుడిలో వు దేవన్ని తనలో లేవనా? అకస్మాత్తుగా కాంతాని అలా చూసినప్పుడు కొంత కలవరపడిన మాట నిజమైనా, తాను దొంగలా చూడగలిగిన త చూడలేదా? ఆ గాభరాలోనూ పది రూపాయల్లో కాంతా పెద్ద ఖరీదేం కాదని తాను అనుకోలేదా? దసరానాడు, బ్యాంకు బాబు రేటు రెండు రూపాయలు తగ్గలేదని వెళ్ళిపోయి నందుకతను ఓగాడిద అని తాను అనుకోలేదా! తాను పొందే అనుభూతి లోనిఎముకల్ని ఝుళిపిస్తోంది ... అలాంటి తనని ఏం అనుకుని ఆమె గుడూచు యువతి తన సర్వస్వం దర్శన మిచ్చింది!?

కోపం పెరగటంతో నోట నిండన తమలపాకు రసం రోడ్డుపై తుపుక్కున ఉమ్మేశాడు. అక్కడంతా మరకలు విస్తరించాయి ఉమ్మేసి లేచాడు.... ఆ అసహనంలో తన ఇంటికేసి నడిచాడు.

o o o

ఇంట్లో స్నానం అదీ చేసి, కొత్త ధోవతి కట్టాడు. అక్కడే వున్న మంగలి పెట్టుతో తల దువ్వుకొన్నాడు. ఆలోచన తెగకుండానే కుర్చీలో కూర్చుని, క్షురాడిని గడ్డం గీయమన్నాడు. "ఏం భాయి, పొద్దున్నే కదా నేను

కవితకి కార్టూన్ :


నేను వైరం
ప్రపంచాన్నికి
సమిధ దొక్కడి ఉచ్ఛ్వాసం

గడ్డం గీసింది, మర్చిపోయావా!" క్షురా డనడతో గడ్డానికి చేత్తో ఎదురు రాసుకుంటూ గంభీరంగా "అసలు నున్నగా గీయలేదు...." అన్నాడు ఖుషియా.

నున్నగా గడ్డం గీయించి, పౌడర్ అద్దించి మంగలి షాపులోంచి బయటపడ్డాడు ఎదురుగా టాక్సీస్టాండు. బొంబాయి ఆనవాయితీ ప్రకారం "ష్ ... హుష్ ..." పిలుపులతో టాక్సీని పిలిచి లోనికి చేరాడు "ఎక్కడికి వెళ్లాలి సార్?" 'సార్' అనే మాట ఖుషియాని మరింత ఉత్సాహ పర్చింది. స్నేహ పూర్వకంగా "ముందు లేమింగ్టన్ రోడ్డుమీదుగా ఒపేరా హవుస్‌కి పోనీ" అన్నాడు. లేమింగ్టన్ రోడ్డు చివరకు చేరగానే "ఎడంవేపు పోనీ" ఆర్డరిచ్చాడు.

టాక్సీ ఎడంవైపు తిరిగింది డ్రైవర్ ఇంకా గేరుమార్చే ప్రయత్నంలో వుండగానే "ఆ ఎదురుగా కన్పిస్తున్న స్తంభం దగ్గర ఆపేయి" అన్నాడు ఖుషియా. టాక్సీ స్తంభం చేరి ఆగటంతో, ఖుషియా అక్కడి కిళ్ళీకొట్టుకెళ్ళి, కిళ్ళీ తీసుకుని, ప్రక్కనేవున్న వ్యక్తితో మాట్లాడి అతన్ని టాక్సీలోకి తెచ్చాడు. వెంటనే మళ్ళీ టాక్సీ కదిలింది. అలా టాక్సీ ఎన్నో మలుపులు, వీధులు తిరిగి చివరికి

# ఐక్యం!

వారుపాదాలక్రింద
నలిగే హృదయాల్ని-
మొలకెత్తినప్పటినుంచీ
కుక్కర్‌లో కేకేసేదాకా
పెద్దగింజల జీవితాల్ని
అక్షరాలలో నిక్షిప్తం చేసుకుంటూ
ఈతరం చరిత్ర వ్రాయడానికి-
అడవిలో చెట్టుకు వేలాడుతున్న
శరీరాల్ని-
వీధిలో నరకబడ్డ దృశ్యాల్ని-
తెగిన తలల్లో దాక్కున్న ఊపిరిని
తిగెనోటపై భద్రపర్చుకుంటూ
ఈనాటి జాతీయ గీతం రావడానికి-
నన్ను వడపోత కళ్ళ కన్నీళ్ళు
కాలరుద్రుణ్ణి చేస్తున్నాయ్-
రోడ్లచుట్టూ
గోడలమీద జ్వలిస్తున్న బీజాక్షరాలు
గుండెగుండెకు ఆయుధాలు
పంచుతున్నాయ్-
ఇక నాకు నేనే కంపించి
స్తంభాలమధ్య వేలాడుతున్న
వైరుముక్కలో ఐక్యమైపోతా
నా కనుగుడ్డు బల్బుతో
ఈ అనంత నిశీధ ప్రపంచాన్ని
వెలిగించుకోడానికి.

-నాగేశ్వరం శంకరం

ఖుషియా కోరిక ప్రకారం ఆగింది. అక్కడ ఫుట్‌పాత్‌మీద కొందరు పడుకుని వున్నారు.

"ఊఁ నువ్వెళ్ళి, త్వరగా రా. నేనిక్కడ ఎదురు చూస్తూంటాను" వెంటవచ్చిన వ్యక్తికి చెప్పాడు ఖుషియా. తోచక బీడీ వెలిగించి కాసేపు పుండి బయటికి విసిరేశాడు. కలవరం చెంది వున్న ఖుషియాకి టాక్సీ ఇంజన్ ఆపనట్లనిపించింది, గుండెలోని దడ అలజడి వల్ల. బిల్లు పెంచేందుకే ఇంజన్ని డ్రైవర్ ఆపలేదనిపించిందతనికి. "ఇంజన్ ఆపుచేసి ఎంత ఎక్కువ సంపాద్దామని?!" డ్రైవర్‌ని ఉద్దేశించి అన్నాడు.

"సేర్! ఇంజన్ ఎప్పుడో ఆపేశాం"—

తప్పు గ్రహించడంతో లోని అలజడి మరింత పెరిగింది. అ వెంటనే నిగ్రహించుకుని డ్రైవర్ భుజంపై చెయ్యివేసి, "చూడు, ఇప్పుడో అమ్మాయి వస్తుంది. ఎక్కిన వెంటనే టాక్సీని రయ్యిన పోనివ్వాలి.... భయపడొద్దే!"

ఇంతలో ఎదురుగా వున్న ఇంట్లోంచి ఇద్దరు వ్యక్తులొచ్చారు. అందులో ముందున్నది ఖుషియా వెంటవచ్చిన అతను. రెండవది కాంతా. కాంతా నలుపురంగు చీర కట్టుకుంది.

○ ○ ○

ఖుషియా, టాక్సీలో ఓ మూలకు ఒదిగటం, కాంతా లోనికి రావటం జరిగింది. వ్యక్తి కారు తలుపు మూయటం క్షణంలో జరిగిపోయింది.

"ఖుషియా!.... నువ్వా?..." అన్న కాంతా కేకలాంటి అరుపు వినిపించింది.

"ఆఁ!... నేనే"

"కానీ నీకు నా డబ్బు ముట్టింది!!"

ఖుషియా దృఢస్వరంతో డ్రైవర్‌ని ఆదేశించాడు. "చూడు, టాక్సీని జూహూ బీచ్‌కి పోనీ"

డ్రైవర్ టాక్సీ స్టార్ట్ చేశాడు. ఆ గొడవలో కాంతా మాటలు వినిపించలేదు.

ఖుషియా స్నేహితుణ్ణి అక్కడే వదిలి, ఒక్క కుదుపుతో టాక్సీ ముందుకు బయల్దేరింది.

మోటారు డ్రైవర్లూ గట్రా ఉంచే ఇది రకటి అరుగుమీద ఖుషియాను ఎవ్వరూ ఆపైన చూడలేదు.

తెలుగు

సినీ ఉద్యానవనంలో

వెలసిన తులసి

అనన్య ప్రచారం గలిగిన సినీ వారపత్రిక



# మూడు దృశ్యాలు

— ఎమ్. దేవాంగ మోహనరావు

ఆ వేళ ప్రొద్దుటే జనరల్ మేనేజరుగారు తన స్వంత అంబాసిడర్ కారులో వస్తూ 'ఫరమ్' ఆవరణలో మూడు విచిత్రమయిన దృశ్యాలు చూశారు. ఆయనకు ఏమీ అర్థం కాలేదు. మతి పోయినంత పనయ్యింది. తన ఆరోగ్యం సరిగా ఉన్నదా అని ఆయనకు కొంచెం సందేహం కలిగింది. అందువలన ఆయన చాలా కంగారు పడ్డారు.

○ ○ ○

అది ఓ పేరున్న ఫర్మ్ అందులో లేదంటే ఓ వంద ఉద్యోగాలకు ఖాళీలువచ్చాయి. ఆ ఖాళీలు నింపడంకోసం సరియైన అభ్యర్థుల్ని ఎంపికచేసే బాధ్యత మన జనరల్ మేనేజరు గారిపై పడింది ఆయన చాలా నిజాయితీ కల వారని, ధర్మాత్ముడని, కష్టసుఖాలు తెలిసున్న మనిషని, అభ్యర్థి స్థితిగతులను పరిశీలించి అవసరం ఉన్నవారికే ఉద్యోగాలు ఇస్తారని మిక్కిలి ప్రసిద్ధికెక్కారు.

○ ○ ○

ఆ మూడు దృశ్యాలు పాపం ఆయన్ను చాలా కలవరపరిచాయి. అందుమూలంగా ఆయనకు కొంచెం జ్వరంకూడా వచ్చింది. ఆలోచిస్తున్నకొద్దీ అదేదో బ్రహ్మరహస్యంలా అనిపించసాగింది.

ఆ మూడు దృశ్యాలు ఇంకా ఆయనకళ్లకు కట్టినట్లే ఉన్నాయి.

కారులో 'ఫరమ్' ఆవరణలోనికి ప్రవేశిస్తూండగా ఆయనకు గేటుదగ్గర ఒకడు కనిపించాడు వాడు ఎదురుగా గుడ్డలమూటలు విప్పుకూర్చున్నాడు, అందరికీ చిరిగిన చొక్కాలు, పంట్లాములు విప్పి చూపిస్తున్నాడు!

లోపలికి వస్తూండగా గోడవాటున చక్కని బట్టలు వేసుకున్న ఓ యువకుడు 'పత్రుని' తన చొక్కా చింపేసుకుంటున్నాడు!

తన ప్రయివేటు రూమ్‌వైపుకు వెళ్తూండగా జనరల్ మేనేజరుగారు చూసిన మూడవ దృశ్యం తెల్లటి బట్టలు వేసుకున్న ఇంకో యువకుడు అటూఇటూ చూసి, ఎవరూ లేరని నిర్ధారించుకొని హఠాత్తుగా, పిచ్చిపట్టిన వాడిలా క్రిందపడి మట్టిలో దొర్లడం!

ఫరమ్ ఆవరణంతా ఇంటర్వ్యూకి వచ్చిన వాళ్ళతో నిండి ఉంది ఆయనకు అంతా విడ్డూరంగా కనిపించసాగింది. పరిస్థితి అంతా అస్తవ్యస్తంగా ఉండి ఆయనకు కొంచెం కంపరం కలిగించింది. తనచుట్టూ వాతావరణం అంతా విషాదభరితంగా ఉన్నట్లు ఆయనకు అనిపించసాగింది. ఆయనకు చాలా కోపం వచ్చింది. అసలే ఆయన్ది మకీఫేసు అది కాస్తా ఎర్రబడిపోయింది.

తోకమాత్రం తక్కువగా, నిప్పుతొక్కిన కోతిలా ఉన్న ఆయన పరిస్థితిని చూసిన ఆఫీసు ప్యూను ఎందుకయినా మంచిదని ఆయన చేతికి అందనంత దూరంగా పోయి నిలబడ్డాడు.

○ ○ ○

ఇంటర్వ్యూ మొదలయింది.

అభ్యర్థి మాసిపోయి, చిరిగిన దుస్తులు ధరించి లోపలికి విషాదంగా ప్రవేశించాడు.

అంటే గడ్డం బాగా పెరిగి ఉంది. కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకున్నట్లుగా ఉన్నారు. ఈ ఉద్యోగం రాకపోతే స సరి పోయినయ్యో, గొయ్యో చూసుకునేలా కూడా ఉన్నాడు.

జనరల్ మేనేజరుగారు 'రివాల్వింగ్' కుర్చీలో మతిపోయినట్లుగా కూర్చున్నారు. అభ్యర్థిని ఏం అడగాలో ఆయనకు అర్థం కాలేదు. కాసేపు బట్టతల గోక్కున్నారు. ఇంకాసేపు కళ్ళద్దాల చిళ్ళజోడు తుడుచుకున్నారు. కొంచెం సేపు పైకప్పును నిశితంగా పరీక్ష చేశారు. తరువాత ముక్కు గోక్కున్నారు. ఆ తరువాత ఏం చెయ్యాలో తోచక మళ్ళీ అభ్యర్థికేసి చూశారు. ఆయనకు కొంచెం భయం వేసింది. ఉద్యోగం ఇవ్వకుంటే తనమీద పడి రక్కేసి, కొరికేస్తాడేమోనని ఇకుమంత కలవరపడ్డారు.

చివరకు ఆయనకు మెరుపులాంటి ఆలోచన వచ్చింది. వెంటనే దాన్ని అమలులో పెట్టారు.

"నేను మూడంటే మూడే ప్రశ్నలు అడుగుతాను. సమాధానాలు చెప్పగలిగితే ఉద్యోగం నీకు ఖాయం" అన్నారు.

పాపం ఆ నిరుద్యోగి నవ్వుమొహం వేసుకుని తలూపాడు.

ఆయన చెప్పడం మొదలుపెట్టారు.

"ఇది నా మొదటి ప్రశ్న: నేను కారులో వస్తూ దగా గేటుదగ్గర చిరిగిన గుడ్డల పాటులతో ఒకడు కనిపించాడు. వాడు ఆ చిరిగిన గుడ్డలను అందరికీ చూపిస్తున్నాడు. ఎవడు వాడు?

రెండవ ప్రశ్న: నేను లోపలికి వస్తూండగా గోడవాటున ఒకడు తను తొడుక్కున్న చొక్కాను చింపేసుకుంటున్నాడు. ఎందుకలా చేస్తున్నాడు?

ఇక మూడవ ప్రశ్న: నా ప్రయివేటు రూమ్‌వైపుకు వెళ్తూండగా ఓ మూల తెల్లటి బట్టలు వేసుకున్న ఓ యువకుడు హఠాత్తుగా పిచ్చిపట్టినవాడిలా క్రిందపడి మట్టిలో పొర్లాడాడు. కారణం?"

అభ్యర్థి కిక్కురుమనలేదు. తేలుకుట్టిన దొంగలా అయిపోయాడు. సమాధానాలు తెలిసుండీ చెప్పలేక అతడు చాలా తికమక పడ్డాడు.

"నెక్స్ట్!"

తేలుకుట్టిన దొంగలు చాలామందే ఉన్నారు. అందరి ముఖాలు విషాదంగా కన్పిస్తున్నాయి.

జనరల్ మేనేజరుగారికి నిజంగా పిచ్చెత్తేలా ఉంది. బుర్ర తీరిక్కా గోక్కోవడం మొదలుపెట్టారు. శవమెత్తిపోతోంది. పైల్సు కంప్లయింటు ఉన్నవాడిలా ఉగ్రుడయిపోవడం మొదలుపెట్టారు. ఎవరికీ ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలియవా? ఏమిటీ విచిత్రం! ఈ ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవడానికి అడవులకు పోయి బ్రహ్మగురించి తపస్సు చెయ్యాలా? అడవులెక్కడ ఉన్నాయి ....ఆయన మనస్సు పరిపరివిధాల పోయింది

చిట్టచివరికి ఓ అభ్యర్థి లోపలకు ప్రవేశించాడు

అతను వేసుకున్న బట్టలు ఖరీదయినవి కాకపోయినా శుభ్రంగా ఉన్నాయి. అతను గదిలోకి ప్రవేశిస్తుంటే వెన్నెల ప్రవేశించినట్లుగా ఉంది. అతడు ప్రశాంతంగా ఉన్నాడు. తన ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి స్వయంగా బ్రహ్మదేవుడే దిగివచ్చినట్లుగా అనిపించింది జనరల్ మేనేజరుగారికి. ప్రశ్నలకు సమాధానాలు తెలుసుకోవడానికి ఆ అభ్యర్థి ముందు మోకరిల్లి వినమ్రుడై, భక్తితో చేతులు జోడించాలని జనరల్ మేనేజరుగారికి ఓ క్షణం అనిపించిన మాట వాస్తవం. పాపం ఆయన తన్ను తాను సంబాళించుకోవలసి వచ్చింది.

ప్రశ్నలు అభ్యర్థి ముందు ఉంచబడ్డాయి

ఆ అభ్యర్థి సర్వాంతర్యామిలా చిరునవ్వు నవ్వాడు. గంభీరంగా తల పంకించాడు.

కొంచెం సేపు మౌనం వహించాడు.

అతడు ప్రారంభించాడు.

"ఈ దేశంలో ఏ గనే ఉద్యోగాలు దొరకుతాయో తెలియని కొందరు అమాయకులుగా అవలంబిస్తున్న పద్ధతులు సార్ ఇవి. చదువుకు విలువలేదు. ఇతర అర్హతలకు విలువ లేదు. రికమండేషను, డబ్బు ఇవి సార్.. ఇవి కావాలి. ఈ రెండూ ఉన్నవాళ్ళకే ఉద్యోగాలు. ఈ రెండులో కూడా డబ్బుకున్న విలువ రికమండేషనుకు లేదు. అయినా వీళ్ళనెవరు రికమెండ్ చేస్తారు? పోతే డబ్బు. డబ్బే ఉంటే ఇన్నాళ్ళు ఉద్యోగం కోసం ఎదురుచూసేవాళ్ళేం కాదు. ఏదైనా వ్యాపారం చేసుకుంటాము. కష్టపడి చదివి డిగ్రీలయితే సంపాదించుకో గలిగారు ఈ అమాయకులు. వీళ్ళల్లో 'ఐన్‌స్టీన్' అంతటి గొప్పవాళ్ళు కాగలిగినవాళ్ళున్నారు. అయితే నేం— ఉద్యోగాలు సంపాదించడం మాత్రం వీళ్ళకు తెలియడం లేదు ఫూల్స్ సార్.... ఈ దేశంలో బ్రతకడానికి చదువులెంతవరకు పనికొస్తాయో తెల్సుకోలేని 'ఎడ్యుకేటెడ్ ఫూల్స్' సార్ వీళ్ళు....

సరియైన మార్గంలో వెళితే ప్రయోజనం లేకపోవడం వలన ఏ మార్గంలోనైనా సరే ఉద్యోగాలు సంపాదించాలనే నిర్ణయానికి వచ్చేశారు సార్ వీళ్లు. ఈ ప్రభుత్వమూ, సమాజమూ వీళ్ళను బఫూన్లుగా కూడా తీర్చిదిద్దింది సార్.

మీరు చాలా మంచివారని, పేదవాళ్ళంటే మీకు చాలా సానుభూతి అని, వాళ్ళకే ఎక్కువగా ఉద్యోగాలు ఇస్తుంటారని బయట ఒక మాట పొక్కింది సార్. ఈ వార్త తెలిసిన ఒక చిన్న వ్యాపారస్తుడు చిరిగిన గుడ్డల మూటలు తెచ్చి జత రెండు రూపాయలకు అద్దెకు ఇవ్వడం ప్రారంభించాడు సార్. వాణ్ణే మీరు గేటుదగ్గర చూశారు. ఇక చొక్కా

కనిలకి కార్టూన్ :



జమీందారు రోల్సుకారు — మాయింటాళ్ళా, స్వామి మహారాజు మనీపర్సు — ఏమంటావు?

చింపుకున్న యువకుడు—అతను కావాలనే మీకు బీదవాడిలా కనబడాలని చొక్కా చింపుకున్నాడు. మూడవ అతని విరిచి చెప్పక్కర్లేదనుకుంటాను. అతనూ పై కారణంగానే క్రిందపడి మట్టిలో పడి దొర్లాడు...."

అతడు చెప్పడం పూర్తి చేశాడు.

పైన సీలింగ్‌ఫాను రొద చేసుకుంటూ తిరుగుతున్న చప్పుడు తప్పించి కొన్ని క్షణాలు భయంకరమైన నిశ్శబ్దం రాజ్యం చేసింది.

శరీరం ముచ్చెమటలు పోయగా హీన స్వరంతో జనరల్ మేనేజరుగారు చివరిప్రశ్న అడిగారు:

"మరి నువ్వెందుకు చిరిగిన బట్టలు వేసుకోలేదు?"

అభ్యర్థి నవ్వాడు. అతడి మోము వింతగా మనోహరంగా హసించింది.

అతనన్నాడు —

"ఆ రెండు రూపాయలుంటే నేను రెండు పూటలు పొట్ట నింపుకోగలను సార్!" ✻

# రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డులు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు యేటేటా వివిధ సాహితీ ప్రక్రియలలో ఉత్తమ గ్రంథాలకు బహూకరించే అవార్డులు 1980 సంవత్సరానికి ఇటీవల ప్రకటించారు. అవార్డు పొందిన గ్రంథకర్త లకి ఒక్కొక్కరికీ వెయ్యినూట పదహార్ల నగదు బహుమతి లభిస్తుంది.

అవార్డులు· ఉత్తమ నవల: హిమజ్వాల, రచయిత! వడ్డెర చండీదాస్- ఉత్తమ కథా సంపుటి: "కొంపెల్ల విశ్వం కథలు". రచయిత: శ్రీ కొంపెల్ల విశ్వం, ఉత్తమ కావ్యం: "వందేమాతరం", కావ్యకర్త: శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, ఉత్తమ నాటకం: "రఘుపతిరాఘవ రాజారామ్", రచయిత: శ్రీ యండమూరి వీరేంద్రనాథ్, ఉత్తమ విమర్శ: గాథాసప్తతిలో తెలుగు పదాలు, రచయిత: శ్రీ తిరుమల రామచంద్ర మహిళలు రచించిన గ్రంథాలలో ఉత్తమగ్రంథం: "యుగయుగాలలో భారతీయ మహిళ", రచయిత్రి: శ్రీమతి జె. వరలక్ష్మి, ఈ యేటి ఉత్తమ రచయిత్రిగా శ్రీమతి బి. సరస్వతీ దేవిని వెయ్యినూట పదహార్లతో అకాడమీ గౌరవిస్తుంది. కీ. శే. ఎన్. కృష్ణారావు స్మృతిబహుమతి కింద శ్రీమతి నాయని కృష్ణకుమారిని రూ. 216తో అకాడమీ వారు సత్కరిస్తారు.

తనకి ఇటువంటి బహుమతులూ, పతకాలూ సరిపడవని 'సారీ' చెపుతూ 'హిమజ్వాల నవలా రచయిత శ్రీ వడ్డెర చండీదాస్ సాహిత్య అకాడమీ వారి పురస్కృతిని తిరస్కరించారు. ఈ యేడు ఉత్తమ నాటక రచయితగా బహుమతి పొందిన శ్రీ యండమూరి వీరేంద్రనాథ్ (32) ఉత్తమ కథా రచయితగా బహుమతి పొందిన శ్రీ కొంపెల్ల విశ్వం (30) యింతవరకూ ఈ బహుమతులు పొందిన వారిలో వయసులో చిన్న వారుగా భావించబడుతున్నారు.

అంతర్జాతీయ మేధావుల ఆలోచనా మథనం!



# చేతవెన్నముద్ద

— 'వాకాటి'

**రచన-సృజన!**

అంతకుముందు ఏమీ లేనిచోట, మామూలు దృష్టికి ఏమీ కనపడనిచోట ఒక అద్భుతమైన చిత్రం, ఎద కదిలించే కవిత, మరపురానికథ- ఎలా పుట్టుకొస్తాయి?

రవి గాంచనిచో కవి ఎలా 'గాంచు'తున్నాడు? ఈ తెరవెనుక భాగవతం, సృజనా బృందావనిలో మనస్సనే కృష్ణుడు ఆలోచనల గోపికలతో ఆడే రాసలీలలను గమనించితే తరచి చూస్తే అతి రసవత్తరంగా వుంటుంది

**అబ్బే ఏముందీ?**

"అయ్యా! మీరు రచనలు ఎలా చేస్తారు?" అని విఖ్యాత తాత్వికుడు, నవలాకారుడు అయిన ఆల్డస్ హక్స్లీని అడిగితే ఆయన అన్నాడట:

"అబ్బే దానిదేముందండీ? బజారుకెళ్ళి ఒక దస్తా తెల్లకాగితాలు కొనుక్కొస్తాను. నాదగ్గర ఎటూ కలం వుంటుందిగదా... అంతే, మేజాదగ్గర కూచుని రాయటం మొదలెడతాను, రాసేస్తాను"

-మరి హక్స్లీ హాస్యమాడాడా అంటే పూర్తిగా కాదనే చెప్పాలి.

మిమ్మల్ని ఎవరయినా "సైకిలు ఎలా తొక్కుతున్నారండీ?" అని అడిగితే- "ఇడుగో, ఈ హేండల్ బార్‌ని రెండు చేతులతోనూ పట్టుకుంటాను, కుడికాలిని అటువైపుకు వేసి పెడల్‌ని అందుకుంటాను. ఎడమ పాదంతో నేల నొక్కి తాపు తంతాను. సైకిల్ కదులుతుంది - అంతే, ముందుకు తొక్కుకుంటూ వెళ్ళిపోతాను" అని వివరిస్తారు. అప్పుడు మీరు వేళాకోళం ఆడలేదు, కానీ సైకిల్ తొక్కడం రానివాడికి మీరు వేళాకోళం చేస్తున్నట్లే అనిపిస్తుంది. కనుక నిజం ఎప్పటిలాగే పదాలకు అందీ అందనట్లుండిపోతుంది

---

"కవికి లక్ష్యశుద్ధి వుండితీరాలి. తన్ను తాను కోల్పోకుండా ఆ లక్ష్యసాధనలో నిమగ్నం కావాలి"

— స్టీఫెన్ స్పెండర్

# క్రిస్మస్

చూస్తూ చూస్తూ క్రిస్మస్ పండగ రానే వచ్చింది. ఎక్కడ చూచినా క్రిస్మస్ విందులు, వేడుకలు, బహుమానాలు, సొంపైన సందేశాలు, ఇంపైన సంగీతం వినిపిస్తుంది. ఈ ఆట్టహాసం, ఆడంబరం, ఉద్రేకంలో పడి ఎంతోమంది క్రిస్మస్‌యొక్క అసలు అర్థాన్నే విస్మరిస్తున్నారు!

ఒక భక్తుడు "క్రైస్ట్ ఈజ్ ది ఫర్‌గాటెన్ మేన్ ఆఫ్ క్రిస్టమస్" అని పలికియున్నాడు.

ఈ రక్షకుడు డిసెంబర్ 25వ తేదీన పుట్టాడ ఎవరూ ఖచ్చితంగా చెప్పలేరు. అయితే నశించినదానిని వెదకి తెచ్చుటకు మనుష్యకుమారుడు ఈ లోకానికి వచ్చిన మాట సత్యం. అది ఏ మాసం అయినా యేసుక్రీస్తు ఈ లోకానికి వచ్చినమాట సత్యం. ఆయన మానవకోటికొరకు తన విలువైన రక్తాన్ని చిందించిన మాట కూడా నిజం. తన కిష్టులైన మనుష్యులకు భూమిమీద సమాధానం కలుగజేస్తూ ఆయన జన్మించాడు. ఈ సమాధానం, క్షమాగుణం యేసుక్రీస్తునందు విశ్వసించినవారికి అపూర్వమైన స్వాస్థ్యం. అయితే నీతి సూర్యుని కిరణకాంతిని ప్రక్కకు నెట్టి క్రొవ్వొత్తుల వెలుగులో పండుగను ఆచరించేవారికి ఈ రెండుకూడా కరువయ్యాయి. పాపములో నశించుచున్న మానవాళికి దేవుడనుగ్రహించిన విలువైన కానుక యేసుక్రీస్తు. క్రీస్తుని నిజముగా చూచినవారు నడిచేది క్రొత్తమార్గం. అది పరిశుద్ధమార్గం. అది అపవిత్రులు పోకూడని మార్గం. ఎందుకనగా క్రీస్తుని చూచినవారిది నూతన సృష్టి పాతవన్నీ నశించును. సమస్తము క్రొత్తదగును. ఈ పండుగ సమయంలో క్రీస్తును పొందియున్నారా! లేక క్రీస్తుని త్రోసివేసి వట్టి వేడుకలతో పండుగను జరుపుకొనుచున్నారా!

—చదలవాడ చంద్రమతీదేవి

సు ప్రసిద్ధ ఆంగ్లకవి, సాహితీ పత్రిక 'ఎన్‌కౌంటర్' వ్యవస్థాపకుడూ అయిన స్టీఫెన్ స్పెండర్ ఏమంటాడో చూద్దాం

"కవికి స్పష్టమైన ఆలోచన, ఏకాగ్రత ఒకానొక లక్ష్యజ్ఞానం అన్నవి వర ప్రసాదం లాగ అబ్బవచ్చు లేదా అతగాడు చాల గజిబిజిగా, నిదానంగా సృజించేవాడయి వుండవచ్చు. ఇందులో ఏ రకం వాడయినా ఫరవా లేదుగాని, లక్ష్యశుద్ధి వుండితీరాలి. తన్ను తాను కోల్పోకుండా ఆ లక్ష్యసాధనలో నిమగ్నుడవగలగాలి" అన్న స్పెండర్ నిర్వచనాన్ని అర్థం చేసుకుంటే బహుశ ఒకానొక లక్ష్యం వుండికూడా సమకాలీన కవులలో కొందరు తమ్ముతాము కోల్పోవటాన్ని మనం గమనించవచ్చు

"కవికి జ్ఞాపకశక్తి అవసరం కాని కవిత జ్ఞాపకశక్తిని, అనుభవాన్ని దాటి వెళ్లగలగాలి కొంతమంది ఉత్తరధృవం వెళ్ళడం గురించి, దారిలోపడిన బాధలతో సహా రాయగలరు. కాని నేను రాయలేను" అంటూ స్పెండర్——

"కవి విశ్వాసం అన్నది తెరమరుగున దాగిన సత్యం లాటిది అతడు ఒకవిధమైన దిగంబరత్వాన్ని సాధించి, అసలైన తాను, తన ఆలోచనలు, ఊహలు ఏవో వాటితో ఒకటవాలి: చేతనయినంత సామర్థ్యాన్ని సంపాదించాలి; ఆ తర్వాత 'కాలం' యొక్క న్యాయపీఠం ముందు నిలబడాలి. అంతే, అంతకన్న కవి చేయగల్గిందేమీ లేదు" అంటాడు

కవిగా తన నమ్మకాలను, నిర్వచనాలను స్పెండర్ ఈ క్రింది వచన పద్యంలో ఇలా చెప్పాడు.

"నాకు శాంతినీ, శక్తినీ, భరోసానీ ఇవ్వు- ఎక్కడయితే ఆ దోళన నన్ను నమిలితినదో- ఆ వెలుగునిండిన దినం, ఆ ఎత్తయిన కుర్చీ, ఆ నిరాడంబరమైన ఆధారం- నాదిగా చేయి. ఆ విధంగా జరగకపోతే, నక్కలూ తోడేళ్లు నామీద కురుకుతాయి అనుభవం నుంచి అనుభవానికి, ఒకచోటినుండి ఇంకొక చోటికి కాలు నిలవకుండా తిరిగే జంతువు నవుతాను నేను!

"నా సృజించేదాని వలన కలిగే గంభీరమైన సంపూర్ణమైన సంతృప్తితో ఒంటరిగా కాపురం చేయగల విచక్షణను, వినయాన్ని నాకు ప్రసాదించు- ఎవరన్నా దూషించినా, విమర్శించినా- అల్లల్లాడిపోని స్థిరత్వాన్ని నాకివ్వు

చివరగా——

"నువ్వు రాసింది, నువ్వు సృష్టించింది బాగుందా, లేదా అన్న మీమాంసతో బాధపడకు, అది నిండుగా, పరిపూర్ణంగా వుందా, నువ్వు ప్రేమించే సువిశాల లోకానికి అది అద్దంపట్టిందా- అన్నది కూడా——"

——ఈ అనుభవం, ఆలోచించి రాసేవారందరికీ ఎరుకలోనిదే అయినా ఇంత చక్కగా చెప్పలేమేమో ననిపిస్తుంది

తన మనస్సును లగ్నం చేయడానికి స్పెండర్ సిగరెట్టు విపరీతంగా కాలుస్తాడు. షిల్లర్ తన మేజా సొరుగులో కుళ్ళిన ఆపిల్ పండ్లు నుంచుకునేవాడట. ఆ కంపు ముక్కుకు తగులుతుంటేగానీ రచనమీద అతడి మనసు నిలిచేదికాదు. వాల్టర్ డిలామేర్ కూడా సిగరెట్లు కాల్చేవాడు. ఆడెన్ (మన కృష్ణమీనన్‌లా) లెక్కలేనన్ని 'టీ' లు తాగతాడట. ఈ అలవాటు ఎందుకయ్యా అంటే ఒకవైపు మనస్సును పూర్తిగా లగ్నం చేస్తున్నప్పుడు, దానిని భగ్నం చేసేటువంటి చప్పుళ్లు, శక్తులు అనేకం వుంటాయి. వాటన్నిటికి ప్రతినిధిగా ఒకే ఒక అలవాటు (కుళ్ళిన ఆపిల్స్ వాసనో, సిగరెట్టు పొగో) వుంటే ఇతరత్రా కవి ఏకాగ్రతకే భంగమూ రాదు- అని స్పెండర్ వివరిస్తాడు, అప్సరసల ప్రయత్నాలను వమ్ముచేయడానికి తాపసి పెండ్లాడినట్టన్న మాట! అతేగాని టన్నులకొద్ది 'టీ' గాని 'ఇంకొకటీ' గాని తాగినంతమాత్రాన కలంపట్టిన ప్రతివాడి నుంచీ రచన జాలువారదు.

'ట్రాపిక్ అఫ్ కేన్సర్'తో సుప్రసిద్ధుడయిన నవలాకారుడు హెన్రీమిల్లర్ రచయితగా తన ఎదుగుదల గురించి చెప్పింది వటవృక్షాల నీడను పెరగ యత్నించే చిన్నారి మొక్కలన్నిటికీ చల్లటి హితవులా వుంటుంది.

"నేను మొదట మెచ్చుకున్న థామస్ మాన్, డాస్టోవస్కీ, నియెట్జ్, హేంసన్ మొదలయినవారి శైలినసూగ్రంగాను గాని నా దంటూ ఒక శైలి ఏర్పడకపోయేసరికి నిరాశతో, అపజయంతో కుంగిపోయాను. నేనెందుకూ కొరగానన్న అగాధంలోకి పడిపోయాను. అక్కడినించే నా పునర్జన్మ మొదలయింది. నాకు తెలిసిన వాటిని, నేను మెచ్చినవారిని దూరంగా విసిరేపారేశాను. "అ ఆ"ల దగ్గరనుంచీ మొదలుపెట్టాను. వంకరలుండవచ్చును గాక, వణుకులూ వక్రస్వరాలూ వుండవచ్చునుగాక, అది నా స్వంత గొంతు! నా స్వంత గొంతు పలుకు విని ఆనందంతో ఎగిరి గంతేశాను. నేను నేనయ్యాను." అంటాడు మిల్లర్. రచనా వ్యాసంగంలో అడుగిడే వారందరికీ ఇది పెద్ద నీతి

జీవితం— రచయితల సంబంధం ఎలా ఉండాలో వివరిస్తూ హెన్రీమిల్లర్- "పైపైన అధికారం పేరిట, ఆస్తి పేరిట ఘోర యుద్ధాలు జరుగుతుంటాయి. అసలు ఇసుకవేస్తే రాలనంత క్రిక్కిరిసి వుంటుంది జీవితం. అంచేత కాస్త క్రిందికి, లోతుకు, లోపలికి, పునాదుల వైపుకు జారితే తప్ప ఏదీ అర్థంకాదు. పోటీలకు పోట్లాటలకూ దూరం అయి వేళ్ళగ్గరకు వెళ్ళినప్పుడే రచయిత రచనా జీవితం, అతగాడి రెండో పుట్టుక మొదలవుతుంది. నేనిప్పుడు, రాసినప్పుడెంత ఆనందంగా వుంటానో, రాయనప్పుడూ అంత ఆనందంగా వుంటాను. మాగిన పండ్లను చెట్టుకు మల్లే, నా రచనా ఫలాలను అందిస్తుంటాను" అన్నాడు. రచనలో పరిపక్వత కిది చక్కటి దృష్టాంతం!

అందుకనే కాబోలు ఇంకొక సందర్భంలో టి. హెచ్. హక్స్లీ— "వాస్తవాన్ని దాటి వెళ్ళలేని వాడు వాస్తవం దగ్గరకు కూడా వెళ్ళలేడు" అంటాడు—!. "సమకాలీన వాస్తవం" "సమాజం", "చైతన్యం" అని వల్లించేవారికి ఈ హెచ్చరిక బాగా వరిసుందేమో!,... ఆధునిక విజ్ఞానశాస్త్రంలో హిమవన్నగమయిన ఐన్‌స్టీన్ అన్నమాట ఇంకా ఆశ్చర్యం కల్గిస్తుంది— "వాస్తవాలు ఒప్పులు కావు!" అన్నాడాయ ! వాస్తవాలనే వాటి పైరూపం చూచి నిర్ణయాలకు రావడం, చొక్కానుబట్టి మనిషిని అంచనా వేయడం లాటిది అని చెప్పడమే ఐన్‌స్టీన్ ధ్యేయం. జీవితపు ఉపరితలాన్ని వీడి, అడుగుకు వెళ్ళాలని మిల్లర్ చెబుతున్నదీ ఇదే, ఇదే!

ఇంక శైలి గురించి హెన్రీ మిల్లర్, "భాషంటే పదాల సముదాయం కాదు. పదాలన్నిటికన్నా ఎక్కువ భావం అందించగలదే భాష. అంచేత భావమీదే నమ్మకం, పదాల మీద కాదు. పదాలనేవి మృతప్రాయాలు, పండితులు, శబ్దోత్పత్తి శాస్త్రజ్ఞులు, భాషావేత్తలూ లాంటి వారి మనసుల్లో తప్ప పదాలు విడిగా ఎక్కడా వుండవు. ప్రతీ రచయితా అతడి శైలి ద్వారా కనబడకాడు. అతడి హృదయం స్పందించవలె వుంటే అతనికి అర్థం కానిది ఏమీ వుండదు. అటువంటి వాడికి ఒకానొక రహస్యం, ఒక మార్మికత పరిచయం అవుతుంది. అది నిజంగా అర్థంకాని రహస్యం కాదు. అది క్రమబద్ధమైనది; సహజమైనది; శిరోధార్యమైనది. రచయిత దానిని ఛేదించడంలో కాక దానితోబాటు 'ప్రవహించడం' నేర్చుకోవాలి... కళ జీవితపు ప్రాముఖ్యాన్ని తెలుపుతుంది. గొప్ప రచన ఏదయినా అర్థమయీ, కానట్లుంటుంది. నేను 'విప్లవవాదిని' అన్నారు. కాని నిజానికి నేను రెండువైపులకూ అతీతంగా వుండి, నా రచనలో వాటి సమతూకాన్ని చూపుతాను— తెగించనిదే జీవితపు లోతులు రచయితకు దొరకవు. తెగించి అగాధంలోకి దూకితే తనకు తానై తేలడం నేర్చుకుంటాడు. అదే అతడి శైలి, రచన, జీవితం! ఆలాటి సాహసాల సంపుటమే మానవ జీవిత పురోగతి చరిత్ర!"— అన్న మిల్లర్ 'మన'వారిలో ఒకడుగా అనిపిస్తాడు.

—ఇవన్నీ చూడగా చూడగా 'సత్యం ఒక్కటే! కాని జ్ఞానులు దానిని అనేకవిధాల వర్ణిస్తారు' అన్న సూక్తి గుర్తుకొస్తుంది.

# ప్రేమసింహాసనం

## యద్దనపూడి సులోచనారాణి



స్వప్నకి నెలలు నిండుతున్నాయి. ఒంటరిగా కూర్చుని వున్నప్పుడు, స్వప్నని ఆలోచనలు భూతాల్లా పీక్కుతినేవి. "నేను యీ ప్రసవం సరిగ్గా జరిగి, మళ్ళీ సవ్యంగా కళ్ళు తెరుస్తానా!" అనుకునేది. నాగమ్మ, పిల్లలు స్వప్నని ఎంత అభిమానంగా చూసినా, స్వప్న మనసు నిండా ఒంటరితనం. మహా భయంకరమైన ఒంటరితనంగా వుండేది స్వప్న పొట్టమీద చేయివేసి ఆత్మీయంగా తడుముతూ అనుకునేది. నేను మరణిస్తే యీ శిశువు సంగతేమిటి? ఎవరు చూస్తారు అనాథగా బ్రతుకుతుందా? "స్వప్నకి చెప్పలేనంత దుఃఖం వచ్చేది అన్నం తిన్న తర్వాత మధ్యాహ్నంవేళ మంచంమీద కూర్చుని ఏ చిరిగిన గౌనో కుడుతున్న నాగమ్మతో అనేది. "అక్కా! నిన్ను నేను ఒక వాగ్దానం అడగనా."

"ఏమిటి బుజ్జీ! ఆ పుస్తకాల భాష నాతో మాట్లాడవద్దని ఎన్నిసార్లు చెప్పాను నేను మోటువాన్ని. నాకు నా భాషలో చెపితేనే అర్థం అవుతుంది. ఇంతకీ ఏమిటది?"

"ఒకవేళ-ఒకవేళ-ప్రసవించలేక నేను మరణిస్తే ఆదే-చచ్చిపోతే-యీ బిడ్డని నువ్వు వదిలేయవుగా?! అనాథని చెయ్యవుగా!?"

నాగమ్మ చేస్తున్న పని ఆపి తలెత్తి చూసింది. ఆ వెంటనే ఫక్కున నవ్వింది-విరగబడి మరీ నవ్వింది. నాగమ్మనవ్వు చూసేసరికి స్వప్న ముఖం చిన్నబోయింది. కష్టంగాచూసి తల దించుకుంది. నాగమ్మ యింకా నవ్వుతూనే అంది. "ఏమిటి చచ్చిపోతావా! పిల్లని కనలేకా! ఎవరు చెప్పారు! ఒక్క కానుపుకే చచ్చిపోతారా ఏమిటి? నువ్వు వూరికే భయపడ్తున్నావు. ఇప్పటికి లక్షసార్లు చెప్పాను. నీకేం కాదు పండంటి పాపాయిని ఎత్తుకుంటావు. ఆ బిడ్డ నా యింట్లో ఆవుదూడలా గంతులేస్తూ తిరగతుంది."

నాగమ్మ లేచివచ్చి స్వప్న తలని దగ్గరికి తీసుకుంది. "పిచ్చిమాలోకమా! నీ భయం నాకు తెలియదనుకుంటున్నావా! కట్టుకున్నవాడు గోతిలో తోసాడు."

"అలా అనకు అక్కా" స్వప్న అంది.

"ఛట్ నోరు ముయ్. ఇంత అన్యాయం చేసినా యింకా నీకు ఆడిమీద ప్రేమే. పెద్ద భక్తిగల పతివ్రత దొరికింది ఎవ్వరూ లేరే అని భయపడుతున్నాను. అందుకే అన్నారు. ఇట్లాంటి సమయంలో ఆడపిల్లకి కన్నతల్లి నీడ కావాలని. ఏం చేస్తాం. అందరికీ ఆ భాగ్యం దొరుకుతుందా? నాక్కూడా అంతే మా అమ్మ లేదు. నా చిన్నప్పుడే చచ్చిపోయిందని చెప్పాగా. మొదటిసారి నెల తప్పినప్పుడు, యిట్టాగే హడిలి చచ్చాను. మళ్ళీ యీ ప్రపంచం తెలుసుకుంటూ చూస్తానా అని దిగులుపడ్డాను. మా పెద్దది పుట్టగానే, ఆ ప్రసవవేదన అంటే భయం పోయింది ఆ కాసేపు కడుపునొప్పి భరించాల అంతే! అని తెలిసిపోయింది. చకచకా కనేసాను. నువ్వే చూస్తావుగా. నీక్కూడా తెలిసివస్తుంది. ఇదేమాట అంటావు."

నాగమ్మ స్వభావమే అంత! ప్రతి విషయాన్ని అవలీలగా కొట్టి పారేస్తుంది. ఈ ప్రపంచంలో దేనికీ భయపడాల్సిన పనిలేదు అంటుంది.

నాగమ్మ అన్నట్టే అయింది వారం రోజుల తర్వాత స్వప్నకి సుఖప్రసవమే అయింది నొప్పులు ప్రారంభం కాగానే, నాగమ్మ మంత్రసానిని పిలుచుకు వచ్చింది స్వప్న నొప్పులు పడుతుంటే, వాళ్ళు పక్కవారం మునసబుగారింట్లో పెళ్ళికి చేయాల్సిన లడ్డూల గురించి మాట్లాడుకుంటూ కబుర్లు చెప్పుకుంటున్నారు స్వప్నకి వాళ్ళ సంభాషణ వింటుంటే, ఒళ్ళు మండిపోయింది ఓ మనిషి బాధపడుతూ ప్రాణం గుప్పిట్లో వుంటే, వాళ్ళు పట్టించుకోవడం లేదని ఆగ్రహం కలిగింది.

"అక్కా!" నొప్పి భరించలేక కేక పెట్టింది

"ఏమిటి?" నాగమ్మ పలికింది.

"నేను చచ్చిపోతున్నాను!"

"ఛట్! మళ్ళీ అదేమాట. నోరు మూసుకో ఇంకోసారి అట్లా అన్నావా, ఈ క్షణాన నిన్ను వదలేసి నేను పోతాను జాగ్రత్త!" నాగమ్మ బెదిరించింది.

"అదికాదక్కా. చాలా నొప్పిగా వుంది. భరించలేకపోతున్నాను" దీనంగా అంది.

"అబ్బ! నా తల్లే! ఏ నొప్పీ లేకు డానే కొడుకు ఆకాశంలో నుంచి ఒడిలో వూడి పడ్డాడు." నాగమ్మ వెక్కిరిస్తూ అంది, స్వప్న నుదుటనపట్టిన చెమటలు కొంగుతో తుడుస్తూ. "ఇంత కష్టపడితేగానీ ఆ పిల్లలు మనకి దక్కరు. మన అమ్మలు కూడా మనకోసం ఇట్లానే కష్టపడ్డారు అందుకే ఆడవానికి పిల్లలు అంటే అంత తీపి. కాస్త ఓర్చుకో" అంటూ వెళ్ళి పోయింది. నాగమ్మ వెళ్ళి వేడివేడి కాఫీ తెచ్చి యిచ్చింది. స్వప్న చేత బలవంతంగా రెండు గుక్కలు తాగించింది. "తిండేమో నాజూకు. రెండు మెతుకులు కూడా మింగలేవు. ఇప్పుడు తెలుస్తోంది ఆడదానికి ఓపిక ఎంత కావాలో" అంది.

పదినిముషాల తర్వాత, స్వప్న భూమి బద్దలవుతున్నట్లుగా, ప్రాణం చీల్చుకు వస్తున్నట్టుగా, పెద్దగా కేక పెట్టింది. వెంటనే స్పృహ కోల్పోయింది.

పావుగంట తర్వాత స్వప్నకి మెలకువ వచ్చింది గదిలో ఎక్కడినుంచో, కేర్ కేర్ మని ఏడుపు విన్పిస్తోంది. ఆ ఏడుపు శబ్దం స్వప్న ఇంతవరకూ వినని అందమైన ధ్వనిగా విన్పించింది! శరీరం ఎక్కడో లంగరు పట్టు వదిలి పడిపోయినంత భారంగా, అలసటగా వుంది. లేవటానికి అణువంత శక్తి కూడా లేదు.

నాగమ్మ దూరంగా విన్పిస్తున్న ఆ ఏడుపుని దగ్గరగా తీసుకువచ్చింది. "బుజ్జీ! మెలకువ వచ్చిందా! ఇదిగో నీ కొడుకు" అంది.

స్వప్న లేవబోతుంటే నాగమ్మ వారించింది. తనే వంగి చూసింది. "బొద్దుగా వున్నాడు. ఒరేయ్ నాగమ్మ చేతిసాయంతో నువ్వు యీ ప్రపంచంలో పడ్డావురా వెధవా.




జాగ్రత్త! నేను యీవూరుని గడగడలాడించినట్టు నువ్వులోకాన్నంతా గడగడ లాడించాలి" అంటూ స్వప్న పక్కన పడుకోపెట్టింది. స్వప్న చేయి పసికందు చుట్టూ వేసింది "అక్కా! బాబుని సరిగ్గా చూసావా? కాళ్ళూ, చేతులు, ముక్కూ, ముఖం సరిగ్గా వున్నాయా? ఏవీ వంకరలు లేవుగా." నాగమ్మ "పిచ్చి బుజ్జమ్మా పిల్లాడు లక్షణంగా వున్నాడు. నువ్వు హాయిగా నిద్రపో." అంది

నాగమ్మ వెళ్ళిపోయింది. స్వప్న పడుకుంది.

స్వప్నకి నూతనజన్మ ఎత్తినట్టుగా వుంది. స్వప్నకి మంచంమీదనుండి లేవాలని అనిపిస్తోంది బాబుని ఎత్తుకోవాలని, గుండెలకి అదుముకోవాలి అని ఎంతగానో అనిపిస్తోంది. తనిప్పుడు ఓ టరిమనిషి కాదా. కాదు! స్వప్న ఆ చిన్నారి పసికందు తనమీద చేయివేసి దాని ఆ స్పర్శ సుఖం అనిర్వచనీయమైన ఆనందం యిచ్చింది. చిట్టికన్నతండ్రీ! నీ కోసమే, నీ కోసమే నేను మృత్యువు ఒడిలోకి వెళ్ళకుండా బతికాను.

స్వప్నమీదకి ఎవరో వంగినట్టుగా అనిపించింది.

"స్వప్నా! బాబు ఏడీ? నన్ను చూడనీ" పరిచితమైన కంఠం వినిపించింది. సందేహం లేదు. అది సుధీర్ కంఠస్వరమే! స్వప్న ఆశగా కళ్ళు తెరిచింది కళ్ళెదుట ఎవ్వరూ లేరు ఎప్పటిలా తన మనస్సే తనకి ఆ భ్రమని కలిగించింది! స్వప్న కళ్ళనుంచి నీళ్ళు జారసాగినాయి! ఈ క్షణంలో యిక్కడ అతను వుంటే! స్వప్నకి దుఃఖం వచ్చింది! తనే చేసింది. అతను అతని జీవితాన్ని ప్రేమ కానుకగా తెచ్చి సమర్పిస్తే, బాధల బాకు అతనికి బహూకరించింది! సుధీర్ ఎలా వున్నాడు తనని మర్చిపోయాడా! విమలని పెళ్ళి చేసుకున్నాడా! విమల సరిగ్గా యిప్పుడు ప్రసవించలేదు కదా! సుధీర్ విమలమీదకి వంగి ఏమీ! బాబు ఎంత బాగున్నాడు అని అనటంలేదు కదా! ఏమో! ఏమో! తనేం చేస్తోంది! అతని జ్ఞాపకాల్లో బ్రతుకుతోంది! ఒక్క క్షణంకూడా అతన్ని గురించి మర్చిపోలేదు. అన్నం తింటుంటే అతనితో కలిసి తిన్న దృశ్యం గుర్తుకు వస్తుంది పడుకుంటే, అతనికి దగ్గరగా పడుకున్నట్టే వుంటుంది. ఒక్కమాటలో

చెప్పాలంటే, అతను తన సమక్షంలో అతి సన్నిహితంగా వున్నట్టే అనిపిస్తుంది స్వప్న కన్నీళ్ళు తుడుచుకుంది. ఛీ! తను దుఃఖించరాదు. అతనికోసమేగా తను అతన్ని వదిలివేసి వచ్చింది?! తను సరైన పనిచేసింది. అది గుర్తుచేసుకుని ఆనందంగా వుండాలి కానీ ఆ గట్టితనం ఐదు నిముషాలుకూడా వుండదు, స్వప్నకి తన మనసేమిటో తనకే అర్థం గావటంలేదు.

# 37

సుధీర్ కోర్టుకి వెళ్ళడానికి సిద్ధమౌతున్నాడు. అహల్యమ్మగారు అక్కడికి వచ్చింది. "సుధీ! వంట అయిందిరా. భోజనంచేసి వెళ్ళవూ" అంది. "ఆకలి లేదమ్మా" అన్నాడతను.

"క్షీరాన్నం చేశాను. కొద్దిగా తినకూడదురా!" ఆవిడ కంఠం ప్రాధేయపడుతున్నట్టుగా వుంది.

"ఆకలి వుంటే కొద్దిగా ఏమిటమ్మా, కడుపునిండానే తిని వెళ్ళేవాడిని. వద్దులేమ్మా" అతని కంఠం ఎప్పటిలాగానే నమ్రతగా వుంది. కానీ, ఆ నమ్రతలో ఇదివరకు వుండే గారాం లేదు. తల్లికి దగ్గరగా వుండే భావంలేదు. అహల్యమ్మగారు చూస్తుండగానే, అతను వెళ్ళిపోయాడు

కొడుకు వెళ్ళిపోయిన తర్వాత ఆవిడ అక్కడున్న కుర్చీలో కూలబడింది. ఆవిడ మనసు భారంగా వుంది.

సుధీర్ దాదాపు ఏడాది క్రితం, యాక్సిడెంట్ జరిగి దెబ్బలు తగిలినప్పుడు, తల్లితో రాజీపడిపోయాడు ఇద్దరూ బాగానే మాట్లాడుకున్నారు. ఆ సమయంలోనే స్వప్న వెళ్ళిపోయింది సుధీర్ని అహల్యమ్మగారు ఇంటికి తీసుకువచ్చింది. మేనమామ, సుధీర్ తీసుకున్న ఇల్లు ఖాళీ చేయించేసాడు. సుధీర్ స్వప్నకోసం చాలా వెతికాడు. పేపరులో వేయించాడు. కానీ ఎక్కడనుంచీ ఎలాటి ఆచూకీ రాలేదు. సుధీర్ గాయాలనుంచి కోలుకున్నా, మనసుకి తగిలిన ఈ గాయాలనుంచి కోలుకోలేదు. అతని లోలోపల అయిన ఈ గాయం ఇంకా పచ్చిగానే వుంది స్వప్నని అతను మర్చిపోలేదు. మర్చిపోలేపోవటమే కాదు. క్షమించను కూడా క్షమించలేకపోతున్నాడు నన్ను స్వప్న అర్థం చేసుకోలేదు. అందుకే ఇలా దూరం అయింది అనే వ్యథ అతన్ని దహించివేస్తోంది. ఒక్కోసారి అతనికి అనిపించేది. "మా ఇద్దరి అనుబంధంగా ఒక పాపగాని, బాబుగాని వుంటే స్వప్న ఇంత తేలికగా మా బంధం ఛేదించుకుని వెళ్ళగలిగేదా" అనిపించేది ఆ వూహ రాగానే అతను నిట్టూర్చేవాడు.

అహల్యమ్మగారికి కొడుకు మనసేమిటో బొత్తిగా అంతుపట్టకుండా వుంది. సుధీర్ స్వప్నమాట ఎత్తనే ఎత్తటంలేదు అయినాసరే, అతను మామూలు సుధీర్ కావటం లేదు. స్వప్నని అతను మర్చిపోలేకపోతున్నాడు. అది అందరికీ తెలుస్తూనే వుంది. "కమలని ఇచ్చి పెళ్ళిచేసేద్దాం" అన్నాడు అన్నగారు అహల్యమ్మగారిక్కూడా అదే మంచిమార్గం అనిపించింది ఈ సంగతి అతని దగ్గర ఎత్తింది, ఏడ్చి, మొత్తుకుని అయినాసరే అతన్ని ఒప్పించాలని ఆవిడ తాపత్రయం. కానీ సుధీర్ ఆ మాట మాట్లాడే తావే ఇవ్వటంలేదు. తల్లీకొడుకులు రాజీ పడినట్లుగా లోకానికి కన్పిస్తున్నా, ఇద్దరిమధ్యా ఎవరూ ఛేదించలేని గోడ అడ్డు వున్నట్టుగా వుంది. ఆ చనువు, సంతోషం, సుధీర్ బొత్తిగా పక్కకు నెట్టేశాడు తల్లికోసం అతను అన్నీ చేస్తాడు. ఎప్పటిలాగానే, ఇంట్లో వుంటున్నాడు. ఆవిడ పూజలు చేస్తే బాబాలని సత్కరిస్తాడు. ఆవిడని పాట కచేరీకి తీసుకు వెళ్తాడు. ఐతే చూసిన బంధువులంతా అహల్యమ్మగారు ఒంటరిగా వున్నప్పుడు, స్వప్న ప్రసంగం ఎత్తి 'ఆ పీడ యింత త్వరగా వదులుతుందని మేమెవ్వరం అనుకోలేదు సుమండీ" అనేవాళ్ళు.

# ఆరోగ్యం, మజా, జోరూ
# తోడు జోడుగా!

బోర్న్‌విటా తీసుకోండి...మనస్సులో వుల్లాసం మరియు ముఖములో సంతోషపు వెలుగులు నింపుకోండి. మీ కుటుంబానికి రుచికరమైన బోర్న్‌విటా యివ్వండి. బోర్న్ విటాలో కోకో, మాల్ట్, పాలు, పంచదార లాంటి పదార్థాలు సమృద్ధిగా వున్నాయి. దీన్ని తయారు చేసింది 100 సంవత్స రాలకు పైగా ఆరోగ్య పానీయాలు తయారు చేయడంలో ప్రత్యేకత గణించిన క్యాడ్‌బరీ వారు.




## క్యాడ్‌బరిస్
# బోర్న్‌విటా

**దీన్లోని మంచి లక్షణాలన్నీ మీకోసం**

తక్కువ ధరగల రీఫిల్ ప్యాక్‌లలోకూడా దొరుకుతుంది

OBM/6532 T

ఇప్పుడు సుధీర్ కీ అంతగా ఎక్కడికి వెళ్ళేట్టు తెలిపేవాడు కాదు నచ్చిన రాత్రికిగా ఆ ఇంట్లో నేనిక్కడ గడుపుతోందని సుధీర్‌కి తనకి మధ్య ఇష్టంగా వుండేవేవుంది అతను వేళకి భోజనానికి రాడు ఎక్కడో. ఏ హోటల్లోనో తినేస్తాడు. ఒక్కోసారి అసలు తిననే తినడు తల్లి బలవంతం చేసే ఆకలి లేదంటాడు. కేవలం తల్లి కోసం తప్ప, తనకి తానుగా, సినిమాలు, షికార్లు అన్నీ మానేసాడు. అతను నవ్వుతూ, తుళ్ళుతూ ఎప్పటిలా వుండటానికి ప్రయత్నిస్తూ లోకాన్ని బాగానే మభ్యపెట్టగలుగుతున్నాడు కానీ కన్నతల్లి కంటిని మాత్రం మోసం చేయలేకపోతున్నాడు. ఆవిడకి, తన కొడుక్కి మధ్య పెద్ద అఘాతం ఏర్పడినట్లుగా వుంది. ఒక్కోసారి ఆవిడకి ఏడుపు వచ్చేస్తుంది నేనేం చేసాను అని అన్పిస్తుంది.

ఆ రోజంతా ఆవిడ కాలుగాలిన పిల్లిలా తిరుగుతూనే వుంది. ఉదయం కొడుకు కోసం క్షీరాన్నం చేసింది. అతనికి ఎంతో ఇష్టం కానీ సుధీర్ దానివైపు కూడా చూడలేదు. ఆవిడకిది చాలా కష్టంగా వుంది.

సాయంత్రం అయింది సుధీర్ కోర్టునుంచి వచ్చాడు. ఆవిడ వేడిగా కాఫీ కలిపి తెచ్చి అందించింది.

"కోర్టునుంచి వచ్చేటప్పుడు దోవలో హోటల్‌కి వెళ్ళాం. టిఫిన్ తిని కాఫీ తాగి వచ్చానమ్మా" మేజోళ్ళు విప్పుతూ అన్నాడు.

ఆవిడ కాఫీ కప్పుని తదేకంగా చూసింది. కొడుకువైపు చూస్తూ అంది. "సుధీ! ఒక్క మాట అడుగుతాను లాయరుగా నిష్పక్షపాతంగా నిజం చెపుతావా?"

"ఏమిటది?"

"నేను చేసిన తప్పేమిటి?"

"అదేమిటమ్మా!"

"నీ యీ ప్రవర్తన అంతటికీ నేనేగా బాధ్యురాలిని నేను చేసిన తప్పేమిటి అని అడుగుతున్నాను! స్వప్న నా మూలంగా దూరం అయిందనేగా?"

"నేనెప్పుడూ అనుకోలేదు."

"నిజం చెప్పరా నావైపు చూసి, నామీద ఒట్టువేసి నిజం చెప్పు నా మీద నీకు కోపం లేదా!"

సుధీర్ మాట్లాడలేదు తల వంచుకుని మేజోళ్ళు సరిచేయసాగాడు.

ఆ అమ్మాయి మామూలు అమ్మాయి అయితే, నేను గుండెల్లో దాచుకుని నీకంటే ఎక్కువగా అభిమానించేదాన్నిరా. కానీ, ఆ అమ్మాయి ఒక హంతకురాలు! జైలుకి వెళ్ళివచ్చిన వ్యక్తి. హంతకురాలిని నా కోడలుగా గౌరవించలేకపోవటం నా తప్పటరా!

"అమ్మా! ఎందుకు పదిసార్లు ఆ మాట అంటావు"

"అంటానురా! పదిసార్లు లేదా వందసార్లు, వేయిసార్లు, లక్షసార్లు అంటాను. నువ్వు నా మనసు ఎందుకు అర్థం చేసుకోవు అని అడుగుతున్నాను". ఆవిడ ఆవేశంగా అంది. "అసలు ఇదంతా నా తప్పు అంటాను నీకు కాబోయే భార్యగా ఎలాంటి వ్యక్తి యీ యింటికి రావాలో నేను పెట్టుకున్న ఆశలు నీకు తెలుసు అయినా సరే. ఇంటిమీద స్పృహే లేని వాడిలా ఆ అమ్మాయి వలలో పడిపోయావు అమ్మ అనే సంగతి మర్చిపోయినట్లు ప్రవర్తించావు నువ్వు నాతో చెప్పకుండా పెళ్ళి చేసుకున్నందుకు కాదురా నేను ఏడ్చింది! ఒక హంతకురాలి వలలో చిక్కుకుని, వంశగౌరవాన్ని మర్చిపోయినందుకు. అలాంటివాళ్ళ నీడ పడినా, ఆ వంటి గాలికూడా మైన సోకుతుంది పాపిష్టిది" అని అరిచింది.

"అమ్మా! అతను కూడా అరిచాడు "ఎందుకమ్మా! కళ్ళెదుట లేని ఆ నిర్భాగ్యురాలిని ఎందుకలా అంటావు? నీకు దూరంగా వెళ్ళిపోయిందిగా! ఇంకా ఎందుకు ఆ సంగతి మాట్లా



ఆరిపోవునే దీపమూ
వెలుగ కో నిమిష నిలుపవే ... ను.
ఆరిపోవునే దీపమూ,
—నండూరి

డ్తావు నువ్వు. హంతకురాలు! హంతకురాలు! స్వప్న మోహన్ని కావాలని హత్య చేయ లేదమ్మా. అది ఒక ప్రమాదంగా జరిగిపోయింది. ఈ మాట లక్ష సార్లు చెప్పాను. అయినా నువ్వు వినవు. హంతకురాలు, హంతకులు అనే మాటే వస్తే, హంతకుల గాలికూడా నీకు సోకనీయకపోతే నువ్వు హంతకులతో కలిసి కూర్చుంటున్నావు, భోజనం చేస్తున్నావు?"

అహల్యమ్మగారు నివ్వెరపోయింది.

"ఏమిట్రా! ఏమిటి నువ్వనేది? నేను హంతకులచేతి నీరు తాగటం ఏమిటి?"

"ఏమిటా? ఇలా రా"! సుధీర్ తల్లిని రెక్కపుచ్చుకుని అల్మైరా దగ్గరకి లాక్కెళ్ళాడు. తాళం తీసి లోపల రహస్యపు లాకర్లోంచి, ఒక ఫైల్ తీసి అందులో నుంచి ఒక ఉత్తరం తీసి, తల్లి చేతిలో పెట్టాడు.

"ఏమిటి ?"

"చదువు నీకే తెలుస్తుంది. అన్నయ్య అన్నయ్య అని నువ్వు మురిసిపోతున్నావే, అన్నయ్య కూతురుని కట్టబెట్టి ఈ వంశగౌరవం నిలబెట్టాలని తాపత్రయపడుతున్నావే ఆ అన్నయ్య పరమ కిరాతకుడు. నాన్నగారినే హత్యచేయడానికి ఒడిగట్టిన పాపాత్ముడు."

అహల్యమ్మగారు ఆ వుత్తరం చదివింది. అది ఎవరో వ్యక్తి, యాక్సిడెంటులో ఒక అతన్ని చంపాలనుకున్న పథకం నెరవేరింది నీ, తనకి రావాల్సిన మిగతా సగం డబ్బు ఇవ్వమనీ కోరుతూ వ్రాసాడు

సుధీర్ చెప్పసాగాడు. "అమ్మా! ఆస్తికోసం నాన్నగారిని, యాక్సిడెంటులో మామయ్య చంపించాలని చూసాడు. యాక్సిడెంట్ జరిగింది కానీ, అదృష్టవశాత్తూ నాన్న ఆ కారులో లేరు నాన్నతో పేకాట ఆడటానికి వచ్చి ఇంటికి వెళ్తున్న మరో వ్యక్తి చచ్చిపోయాడు ఆ వ్యక్తి ఎవరో కాదమ్మా స్వప్న తండ్రి! మామయ్య తనమీద పన్నిన కుట్ర నాన్నగారికి అర్థమైంది కానీ ఋజువు చేయలేకపోయారు. ఆయన ఎదుటపడి అడిగే ధైర్యం అసలే లేక పోయింది. స్వప్న కుటుంబాన్ని ఆ కోణంలో నే చూసారు. ఆయనకి ఈ ఊరు విడిచి వెళ్ళిపోవాలని ఎంతగానో చూసారు కానీ, నువ్వు రాలేవు. మామయ్యని, ఈ వ్యాపారాన్ని విడిచిపెట్టి రావటం నీ కిష్టం లేదు అన్నింటికంటే ముఖ్యంగా మామయ్య అండదండలతో అయితే, నా భవిష్యత్తు

ారబాటు అవుతుందని నీ ఆశ! నాన్నగారు నిద్రమాత్రలకి అలవాటుపడ్డారు. ఒకసారి
 చెప్పారు. స్వప్న ఫోటో చూపించి, నువ్వు పెద్ద అయితే, ఈ అమ్మాయిని చేసుకోవాలి
న్నారు. నేను స్వప్నని తప్ప ఇంకెవ్వరినీ చేసుకోనన్నట్టుగా నా చేత ఒట్టు వేయించుకున్నారు.
మయ్య మంచి వాడు కాదని చెప్పారే కాని, అప్పుడు ఇదంతా నాకు తెలియలేదు. నాన్న
 వ్రాసారు. స్వప్న చదువుకి, పెళ్ళికి కూడా అందులో డబ్బు ఇవ్వాలని వ్రాసారు కానీ,
మయ్య ఆ విల్లు చింపేసాడు అసలు విల్లు కొన్ని ముఖ్యమైన కాగితాలు మన లాయరుగారు
గ్గర దాచారని ఆయనకి తెలియదు
నాన్నగారు పోయిన తర్వాత మనం మామయ్య ఇంట్లో వుండటంతో, నాకు ఇల్లు
లా అయింది స్వప్న ఎవ్వరో ఎక్కడ వుంటుందో నాకు తెలియదు. నాన్నగారు తీసుకు
నని అన్నారే గాని అన్న వారం రోజులకే పోవటం సాధ్యం కాలేదు నువ్వు విమలతో
 పెళ్ళి అంటుంటే నాకు నాన్నగారికిచ్చిన వాగ్దానం గుర్తుకు వచ్చేది కానీ ఆ అమ్మాయి
రో, ఎక్కడ వుంటుందో నాకు తెలియదు
తర్వాత అనుకోకుండా, నిరంజనం మాస్టారిద్వారా స్వప్న నా జీవితంలోకి వచ్చింది
ఎలా! ఒక హంతకురాలిగా! జైలులో కటకటాల మధ్య నుండి మొదట మొదట స్వప్న
రో నాకు తెలియదు. నిరంజనం మేస్టారికోసం ఆ కేసు ఒప్పుకున్నాను. ఆ కేసు చేపట్టిన
ర్వాత స్వప్న ఎవరో నాకు తెలిసింది వాళ్ళ సదేహ నివృత్తికోసం, మన ఇంటి డాక్టరుగారి
కి వెళ్ళాను ఆ కాగితాలు అన్నీ తెచ్చి నా దగ్గర పడేసారు. అవి నాకు పాతిక సంవత్సరాలు
న తర్వాత ఇవ్వమని నాన్నగారు చెప్పారుట ఆయన వాటిని చూడలేదు. ఆ కాగితాలమధ్య
 ఉత్తరాలు చదివి నిర్ఘాంతపోయాను. స్వప్నమీద నాన్నకి ఎందుకంత శ్రద్ధో అర్థం
ంది. తన వాలంగా స్వప్న తండ్రి చచ్చిపోయాడు. ఆ కుటుంబం అనాథగా అయింది.
అన్యాయాన్ని నన్ను స్వప్నని పెళ్ళిచేసుకుని సరిచేయమని నాన్న కోరారన్నమాట.
కోపం స్వప్న వూరు వెళ్ళింది. తిరిగి వచ్చింది. బలవంతపు పెళ్ళినుంచి పారిపోయి
ంది. నేను స్వప్నకి ఆశ్రయమిచ్చాను. పెళ్ళి చేసుకున్నాను ఇదంతా నీకు చెప్పాలని
ప్రయత్నపడ్డాను కానీ నువ్వు నాకు అవకాశమే ఇవ్వలేదు మామయ్య దగ్గరే వుండిపోయావు
మ్మా! నీకు ఇది అంతా వింటే చాలా బాధగా వుందేమో. కానీ ఈ రహస్యం నన్ను
నలంలా దహిస్తోంది నీకు చెప్పేసాను. సగం భారం తగ్గినట్టు అయింది."
అహల్యమ్మగారు నిశ్చేష్టురాలు అయినట్టుగా చూడసాగింది ఆ ఉత్తరాలు ఆవిడని
మంటలా చుట్టుముట్టుతున్నాయి
"సుధీ!" ఆవిడ నిలబడలేనట్టుగా కుర్చీలో కూలబడింది.
"నీకు తెలిసి ఇన్నాళ్ళు ఎందుకు ఊరుకున్నావురా! మామయ్యని ఎందుకు
యలేదు?" సుధీర్ పెదవులమీద ప్రతీకారం నిండిన చిరునవ్వు కసిగా మెదిలింది, "మొదట
 ఇలాగే అనుకున్నానమ్మా. కానీ దానివల్ల, నా ప్రాణానికి ముప్పు తప్ప ఇంకే
యోజనమూ లేదు. మామయ్య నాన్నకి తెలియకుండా ఎలాచేసారో. నేనూ అదే చేసాను.
మయ్య తనకితానే, తన జీవితం అంతంచేసుకునే పరిస్థితులు తెస్తాను. ఆయన వ్యాపారం
 చింది ఒక కేసులో ఇరుక్కున్నాడు. అదే బైటికి తెలిస్తే, ఆయన పరువు పోతుంది.
న గొంతు ఆయన పిసుక్కుని వూపిరి తీసుకోవాల్సిందే! అన్యాయం వేగంగా పరుగెడితే,
యం దాన్ని ఎన్నంటి పోలేకపోయినా, ఎప్పటికైనా జయించి తీరుతుందమ్మా!"
"మరి స్వప్న?"
"భగవంతుడికే తెలియాలి, స్వప్న బ్రతికి వుంటే ఇన్నాళ్ళూ నా నుంచి దూరంగా
మ్మా వుండదు. వుండలేదు." అంటుండగానే అతని కంఠం గాద్గదికం అయింది. తల

దించుకున్నాడు.

అహల్యమ్మగారు లేచి తడబడుతున్న అడుగులతో కొడుకు దగ్గరకి వచ్చింది. అతని తల మీద చెయ్యివేస్తూ "సుధీ! స్వప్న ఎక్కడుందో తెలిస్తే ఎంత బాగుండు. నా తప్పుకి ప్రాయశ్చిత్తం చేసుకున్నట్లుగా, ఈ ఇంటికి నేనే తీసుకు వస్తాను ఆ క్షణం నా జీవితంలో వస్తుందంటరా. ఎవ్వరికీ అపకారమే చేయనినాకు అహం! నా కోడలికే అన్యాయం చేసానురా! నిన్ను ఎంత క్షోభ పెట్టాను...

"అమ్మా!" సుధీర్ ఆవిడ పొట్టలో తలదాచుకున్నాడు

ఆవిడ కళ్ళనుంచి నీళ్ళు జల జల రాలసాగినాయి

తల్లీ కొడుకుల మధ్య అడ్డుగోడ కూలినట్టే అనిపించింది

## 38

కాలచక్రం గిర్రున తిరిగింది!

మరో మూడు సంవత్సరాలు ఇట్టే గడిచినాయి

సుధీర్ ఈ మూడు సంవత్సరాలలో, ఇంకా పేరు ప్రఖ్యాతులు సంపాయిచాడు. అతని సంపాదనలో మూడు వంతులు దీనజన సేవకే అంకితం అవుతూంది. ఎన్నెన్నో అసోసియేషన్స్‌తో అతనికి అనుబంధం ఏర్పడింది-క్షణం తీరుబడి వుండదు.

సుధీర్ మేనమామ కంపెనీ దివాలా తీసింది ఆయన తనని తాను షూట్ చేసుకుని చచ్చిపోయాడు. అదొక పెద్ద సంచలనవార్త అయిపోయింది డబ్బులేదు తండ్రి పోయాడు విమలకి ఇంకా పెళ్ళికాలేదు. సుధీర్‌ని పట్టుకుని మేనత్త ఏడ్చేసింది

"నువ్వేం దిగులు పడకు అత్తయ్యా. విమలకి మంచి సంబంధం చూసి నేను పెళ్ళి చేస్తాను" అన్నాడు. అన్నట్టుగానే తనతోటి లాయరుతో వారం రోజులు తిరగకుండానే పెళ్ళి ఘనంగా జరిపించాడు. విమల అత్తవారింటికి వెళుతుంటే అతనికి ఆనందంగా తృప్తిగా అనిపించింది! విమల గారాబంతో మొండిగా ప్రవర్తించినా, హఠంచేసినా వసుతః సరళ స్వభావురాలు. ఆ రోజు సుధీర్ డాక్టరుగారి యింటికి వచ్చాడు ఆయన ఒడిలో షుమారు నాలుగు సంవత్సరాల వయసుగల ముద్దులు మూటగట్టే బాబు వున్నాడు. సుధీర్‌కి చిన్నపిల్లల్ని చూసినప్పుడల్లా మనసులో వ్యధలాంటిది బైలుదేరుతుంది. తను పొందలేనిదేమిటో ఆ చిన్నారి నవ్వులతో చాటి చెబుతున్నట్టుగా వుంటుంది.

"ఎవరీ బాబు?" అని అడిగాడు.

"నాకు తెలిసినవాళ్ళ అబ్బాయి" నేను పెంచుకుంటున్నాను.

"మీరా! ఈ వయసులోనా! అదేమిటి? ఈ బాబుకి తల్లీ తండ్రీ లేరా?"

"ఉన్నారు. కారణం తెలియదుగానీ తండ్రికి దూరం అయాడు తల్లి పల్లెటూరులో ఎక్కడో టీచరుగా చేస్తోంది. నా దగ్గర వదిలేయమన్నాను,నాకు తోడు, కాలక్షేపం. పిల్లలంతా ఫారిన్‌లో వున్నారు. ఒక్కడికి తోచడంలేదు."

సుధీర్ లాయరు కళ్ళు ఆయనని బాబుని, కుతూహలంగా, నిశితంగా పరిశీలించాయి. ఈ వయసులో ఆయన యింత పెద్ద బాధ్యత తీసుకున్నారంటే, ఆ పిల్లాడికి యీయనకీ, ఏదో అనుబంధం వుండి వుంటుంది-ఈ వయసులో ఆయన ఏమో! కోర్కెలకి, బంధాలకి వయసు అడ్డం రాదుగా! సుధీర్ జేబులో చేయి పెట్టి పెన్ను లాక్కున్నాడు "ఓర్నీ! నామీదకే దండయాత్ర మొదలుపెట్టావే". సుధీర్ నవ్వాడు. బాబు మాత్రం బొద్దుగా, చూడముచ్చటగా వున్నాడు

సుధీర్ తరచుగా డాక్టర్‌గారి యింటికి వచ్చేవాడు. బాబు క్రమంగా అతనికి బాగా

చనువు అయ్యాక. అతను వస్తూ వాడికి ఏదో ఒకటి తెస్తూ వుండేవాడు.

సుధీర్ దగ్గరికి ఒక కేసు వచ్చింది. పల్లెటూరు నుంచి వచ్చాడావ్యక్తి! పేరు కుటుంబ రావు. అతని ఖాళీ జాగాలో, వూరి కుర్రాళ్ళు స్కూలు కడుతున్నారు. ఖాళీ చేయమంటే చేయడం లేదట! వాళ్ళకి వత్తాసు ఒక పంతులమ్మ. పంతులమ్మ వయసులో వుంది. వూరిలో కుర్రాళ్ళం దరినీ కొంగుకి ముడివేసుకున్నది. ఆడింది-ఆట, పాడింది-పాట. కుర్రకారంతా ఆమె పక్షం అవడంతో పెద్దవాళ్ళు ఏం చేయలేకపోతున్నారు. ఎవరైనా ఏదయినా అంటే, ఆ యింటి మీద రాత్రికి రాళ్ళ వర్షం కురుస్తుంది. కుటుంబరావు పోలీసు రిపోర్టు ఇచ్చాడు. కేసు కూడా పెట్టాడు. కేసు హైకోర్టుకు వచ్చింది. వచ్చినాయన అహల్యమ్మగారి స్నేహితురాలి మరిది! సుధీర్ కాదనలేక కేసు ఒప్పుకున్నాడు.

ఆ టీచమ్మ కోర్టుకి రాలేదు! ఆవిడ తరఫు న్యాయవాది అంతగా పస వున్నవాడు కాదు. సుధీర్ సులభంగానే కేసు గెలిచాడు. టీచరమ్మకి, ఆమెకి మద్దతు ఇచ్చిన నలుగురి కుర్రాళ్ళకి జైలుశిక్ష పడింది. ఈ కేసు తెచ్చిన కుటుంబరావు, కేసు గెలగానే, సుధీర్ని గట్టిగా కౌగిలించుకున్నాడు. "నాకు తెలుసు నువ్వు కేసు పట్టుకుంటే గెలుస్తావని" అంటూ అభినందించాడు. ఆయన సుధీర్కి ఫీజు యివ్వబోయాడు. సుధీర్ ఆ యువజన సంఘానికి యివ్వమని కోరాడు

కేసు గెలిచిన ఆనందంతో కుటుంబరావు తన ప్రతిభని నలుగురికీ చాటుకోవటానికి అన్నట్లుగా ఒక పేపరు వాళ్ళని పట్టుకుని, "పంతులమ్మ అరెస్టు" అనే శీర్షిక క్రింద ఫోటో వేయించాడు. పేపరు తిరగేస్తున్న సుధీర్ ఆ ఫోటో చూడగానే నిర్ఘాంత పోయాడు. ఈ పంతులమ్మ స్వప్న! అతని కళ్ళు తిరిగినట్టే అయింది. ఏం చేసాడు తను! స్వప్నని జైలుకి పంపించాడు. స్వప్న కోసం ఎన్నాళ్ళు కలవరించాడో ఆ స్వప్ననే కటకటాల మధ్య బంధించేసాడు.

అతను సరాసరి ఆ వూరు వచ్చాడు. నాగమ్మ అతన్ని ఛడామడా తిట్టింది "ఏం లాయరువయ్యా నువ్వు నీకు అసలు తిన్న అన్నం వంటబడుతుందా" అని ఆ కుటుంబరావు ఎంత కోతి వెధవ! మా బుజ్జమ్మ యీ వూరికి చేస్తున్న మేలు చూడలేక కళ్ళలో నిప్పులు పోసుకుని కేసు పెట్టాడు ఆ జాగా ఆయనకి ఎట్లా వచ్చిందో తెలుసా? పితండ్రి పోయిన తర్వాత కాగితాల మీద వేలిముద్ర వేయించుకున్నాడు. ఇదుగో! మా అందరి వుసురూ నీకు తగులుతుంది. నీకే కాదు, నీ భార్యా పిల్లలకి కూడా తగులుతుంది". అంటున్న నోరెత్తనీయకుండా చీవాట్లు పెట్టింది

సుధీర్ కుటుంబరావుగారి దగ్గర ఎంక్వయిరీ చేసాడు. స్వప్న ఆ వూరిలో నాలుగు సంవత్సరాలనుంచీ వుంటోందట. పెళ్ళి కాకుండానే కొడుకుని కని, హైదరాబాదులో ఎవరిదగ్గిరో వుంచి పెంచుతోందిట. వారం వారం వెళ్ళి కొడుకుని చూసి వస్తుందిట. ఆ నాగమ్మ ఒక బ్రహ్మరాక్షసి. లేకపోతే, స్వప్నని ఎప్పుడో ఎవరో ఒకరు సఫా చేసేవాళ్ళు.

సుధీర్ హైదరాబాద్ తిరిగి వచ్చేసాడు. అతని గుండెలు బరువెక్కినట్లుగా వున్నాయి. స్వప్నని ఆ వూరిలో కుటుంబరావులాటి ఒకరిద్దరు తప్ప, వూరి జనం అంతా దేవతలా చూస్తున్నారు. స్వప్న అంటే ఎంత గౌరవం! స్వప్నని జైలుకి పంపించిన లాయరు అని తెలిసేసరికి మరి పిల్లలు కారు మీద రాళ్ళవర్షం కురిపించేసారు. అతనికి భుజం మీద గాయం అయింది. అతను సరాసరి డాక్టరుగారి దగ్గరకు వచ్చాడు. డాక్టరుగారు లేరు. నర్సు అతని గాయానికి కట్టుకట్టింది. నర్సు డాక్టరుగారు జైలుకి వెళ్ళారని చెప్పింది.

"జైలుకా!" అతను ఆశ్చర్యపోయాడు.

నర్సు తల వూపింది. మీరు అరెస్టు చేయించారే, ఆ పంతులమ్మ కొడుకే డాక్టరుగారు

పెంచుకున్నారు బాబు"

సుధీర్ సడన్‌గా లేచి కూర్చున్నాడు "నిజంగానా!"

"నిజంగా, అమ్మోయ్యారామా ఆడది ఇంత గ్రంథసాంగురాలని నాకు తెలియదు. మా డాక్టరుగారికి ఆవిడమీద ఎందుకి తప్రేమో తెలియదు. అదంతా ఆవిడగారి మహత్యమే అయి వుంటుంది తెలుసా. కుర్రాడు ... చేసుకోగానే ... సుధీర్‌కి తర్వాత గాలి కొట్టాలనిపించింది కానీ అతనికి అంతులేని ఆనందంగా కూడా అనిపించింది. బాబు! ఇక్కడికి రాగానే తనమీదపడే బాబు! తన బాబు! బాబుకోసం డాక్టరుగారు తనచేత చిన్నచిన్న పనులు చేయించేవారు.

అతను మెరుపులా బైటికి వచ్చాడు. కారు తీసుకుని పిట్టలా, జైలుకి దూసుకు వెళ్లాడు. అతను వెళ్ళేసరికి, డాక్టరుగారు అక్కడే వున్నారు. స్వప్న బాబుని ముద్దుపెట్టుకుని, డాక్టరుగారికి అందిస్తోంది. దూరంనుంచి స్వప్నని చూశాడు. స్వప్న ఏం మారలేదు. కానీ ఇదివరకు లేని హుందాతనం వచ్చింది. అతను కళ్ళారా స్వప్నని చూసుకున్నాడు.

డాక్టరుగారు బైటికి రాగానే సుధీర్‌ని చూసి తెల్లబోయారు. సుధీర్ వేరే పనిమీద వచ్చానని చెప్పాడు. ఆయన చేతిలో బాబుని అందుకున్నాడు. సుధీర్‌ని చూడగానే బాబు అతనిమీదకి వురికాడు. సుధీర్ తన కారు తాళాలు వాడికిచ్చేసాడు.

"జైలుకి ఎవరిని చూడడానికి వచ్చారు?" అమాయకంగా అడిగాడు. డాక్టరుగారు తడబడ్డారే తప్ప సరైన సమాధానం చెప్పలేకపోయారు.

ఇంటికి వచ్చారు. సుధీర్ బాబుని కారులోనుంచి దిగనీయలేదు. తన ఇంటికి తీసుకు వెళ్తానని అన్నాడు. బాబు అతనికి అలవాటే! బెంగపడడు.

సుధీర్ ఇంటికి వచ్చాడు.

ఆ రాత్రంతా నిద్రపోలేదు. బాబుని గుండెలమీద పడుకోబెట్టుకున్నాడు. అతనికి స్వప్న కనిపించిందుకు ఆనందంగానూ వుంది. చెప్పకోలేనంత దుఃఖంగానూ వుంది. బాబుని ఇలా అనాథగా వుంచినందుకు కోపంగా వుంది. ఊరిలో అంత మంచి పేరు తెచ్చుకున్నందుకు ఆనందంగా వుంది. స్వప్నని తనే జైలుకి పంపించినందుకు తీరని దుఃఖంగా వుంది.

(సశేషం)

# TRIVENI

**BETEL NUT POWDER**

**PRIDE OF INDIA**

**CHOICE OF MILLIONS**



TRADE MARK
REGD. 9609








**TRIVENI NUT POWDER MFG. CO.,**

Proprietor DESU VENKATA SUBBA RAO

PORT ROAD MACHILIPATNAM-521 001. A.P

PHONES 458 & 270

# వేదికెక్కని వేదన

పచ్చిపులుసు వేంకటేశ్వర్లు

అర్ధరాత్రి ఆకాశం నడిరోడ్డుమీద శృంగార పురుషుడిలా షికారు చేస్తున్నాడు రాకా సుధాకరుడు

బజారంతా నిదరోయింది

[illegible],

[illegible]

[illegible]

[illegible]

బారుల నుండీ, మెరక వీధులనుండీ గలగలలూ కిలకిలకిలలూ వినిపిస్తున్నాయి.

పట్టపగలు లాగుండే ఫ్లోరసెంటు లైట్ల కాంతిలో ఇద్దరు కానిస్టేబుల్సు ఒక యువతిని వెంటతీసుకుని వస్తున్నారు.

ఆ యువతి విలాసంగా నడుస్తున్నది.

పోలీసుల వెంటపోతున్నందుకు భయంగానీ, ఏమి జరుగుతుందోనన్న ఆందోళనగానీ లేదామె ముఖంలో.

అనుభవాలు నేర్పిన పాఠాలలో, గడితేరి కించిద్విలాసంగా నడుస్తూంది.

పోలీసు స్టేషన్లోకి ప్రవేశించారు ముగ్గురూ

ఎస్. ఐ ఆరవ ఫైలు అవతల పెట్టి, ఏడవ ఫైలులో తలదూర్చి ఆవలించాడు.

పోలీసులు సెల్యూట్ చేసి, ఆ యువతిని ఇన్‌స్పెక్టరు ముందు ఉంచి మళ్ళీ తమ డ్యూటీ మీద వెళ్ళారు.

ఇన్‌స్పెక్టరు తల ఎత్తకుండానే, ఫైల్లో వ్రాసుకుంటూ ఆమెను ప్రశ్నించాడు.

"నీ పేరు?"

"నా పేరు వసుంధర"

"నీ భర్త పేరు?"

ఒక పేలవమైన నవ్వు నవ్వింది.

"మెడలో తాళికట్టినవాడే భర్త అంటే నా భర్త పేరు రామనాథం. అనుభవించిన వాళ్ళు అంటే అటువంటివాళ్ళు ఎందరో. వారి పేర్లు తెలువు లేదు. మనసిచ్చిన వాడే మగడంటే నా మగడు ఎస్ ఐ రమేష్ కుమార్."

ఆ మాట అంటూ కుర్చీ లాక్కొని కూర్చున్నది.

ఎస్ ఐ అదిరిపడ్డాడు దిగ్భ్రాంతి చెందాడు. ఫైలు విసిరివేసి ఆమెవైపు కోపంగా చూశాడు.

ఆమె ముఖంలో అతనికి సంబంధించిన ఏవో జ్ఞాపకాలు దోబూచులాడాయి

క్రమంగా కోపం కరిగి, ఆశ్చర్యంలోకి, ఆశ్చర్యంనుండి ఆనంద లోకి, ఆనందంనుండి ఆందోళనలోకి జారిపోయింది మనసు.

వసుంధర!

అవును వసుంధర... తనచిన్ననాటి నేస్తం

వికసించని మొగ్గగా, వయ్యారాలు కురిపించి, వలపు లూరించిన జవరాలు.

ప్రేమంటే తెలియని వయసులో, ప్రేమాంకురం వేసిన చిలిపి వసుంధర.

కుర్చీనుండి లేచాడు. పచార్లు చేస్తున్నాడు.



ఋట్లు టకటకలాడించుకుంటూ వెలుపలికి వచ్చాడు. మళ్ళీ లోపలికి పోయాడు.

మనసు ప్రస్తుతం నుండి గతంలోకి, గతం నుండి ప్రస్తుతంలోకి పోతూ వస్తూ ఉంది.

పచార్లు ఆపాడు.

వసుంధరనే తదేకంగా చూస్తున్నాడు

ఆమె శరీరంలో వయసుతెచ్చిన వంపులున్నాయి. అనుభవాలిచ్చిన గీతలున్నాయి.

కాలం కొట్టే కొరడా దెబ్బలకు లొంగని వ్యక్తిత్వం, తీవి తొణికిసలాడుతున్నాయి. ఆమె కూర్చున్న తీరులో.

"నీవు వసూవా! అర్థరాత్రి స్టేషనుకు ఎందుకు తీసుకు వచ్చారు నిన్ను."

"పోలీసులు అర్థరాత్రి స్త్రీలను ఎందుకు పట్టుకుంటారు? చీకటి నేరం మోపి లాక్కు-వచ్చారు."

"వ్యభిచారం చేసే నీచస్థితికి ఎలా దిగజారావు? నమ్మలేకుండా ఉన్నాను వసూ!"

"బలహీనతలు ప్రతివారికీ సహజమే మొద్దూ! నువ్వేమీ అనుకోకు. చిన్నప్పుడు నిన్ను మొద్దూ అని ముద్దుగా పిలిచేదాన్ని. ఇప్పుడూ అలాగే పిలవాలని అనిపిస్తూంది.

ఆఫీసరుగా పెంచుకున్న అహం ఆ పిలుపును నిరాకరిస్తుంది. చిన్ననాటినుండి పెంచుకున్న అనురాగం ఆ పిలుపుకు పరవశిస్తుంది.

వసుంధర చెబుతూ ఉంది.

"ఇక మీలాంటి వారి చరిత్రలన్నీ ఒకటే. మాలోని బలహీనతలను పురుషులు రెచ్చగొడతారు. మరీచికలవెంట పరుగులు తీసి పతనమౌతాము. గతిలేక, ఇంటికి తిరిగిపోలేక,

పొట్టకూటికోసం పడుపు వృత్తిని స్వీకరిస్తాము. ఈ పవిత్ర భారతదేశంలో పతితల కథలన్నీ ఒకటే, కొన్ని మార్పులు తప్పితే పగలు పెద్దమనుషులుగా తిరిగే వారంతా మా దగ్గరే దాహం తీర్చుకుంటారు. వారు పావనులు, మేము పతితలం."

"సారీ వసూ! వెరివెరి సారీ! పద మా క్వార్టర్సుకు వెళదాం."

హెడ్‌కు చార్జి అప్పగించి, స్కూటరు స్టార్టు చేశాడు. స్కూటరు వెనుక వసుంధర కూర్చుని చేతులు వేసింది రమేష్‌కుమార్ భుజాలపైన

ఆ స్పర్శ ఏదో వింత అనుభూతిని, ఆనందాన్ని ఇస్తూంది. తాను యవ్వనంలో అడుగు పెట్టే వయసులో ఎవరి ఆకర్షణలో పడి, స్పర్శ కోసం అలమటించాడో ఆ స్పర్శ ఇన్ని సంవత్సరాల తర్వాత యిలాగా

గతంలోకి పోతూంది మనసు.

వీధి లైట్ల కాంతులను చీల్చుకుంటూ స్కూటరు పోతూంది.

ఒక్క పర్యాయం గతం కళ్ళముంగు నిలబడింది.

o o o

కలవారి బిడ్డ అబ్బాయి రమేష్‌కుమార్. బొద్దుగా బండరు లడ్డులా ఉండేవాడు. తని క్లాసులో మొద్దు.

సైన్సుమాస్టారు మధుసూదన గారి దగ్గర ట్యూషన్‌కి చేరాడు. స్కూలులో వసుంధ ను చూస్తున్నాడు కాని, ఆ అమ్మాయితో పరిచయం కావటం మాస్టారుగారి ఇంటివద్దే

ఆ అమ్మాయి మాస్టారుగారి బంధువు. వారి ఇంట్లో ఉండి చదువుకుంటున్నది.

చిలిపిగా చూస్తూ, అల్లరి పనులు చేస్తూ మగపిల్లలను అల్లరి పెట్టేది. పదమూడేళ్ళ వయసులో విరిసీ విరియని మొగ్గ ఆ పిల్ల.

ఆ అమ్మాయికి బొద్దుగా, ముద్దుగా వున్న రమేష్ దొరికాడు. అతణ్ణి ఒకటే ఆడించేది. పరాచికాలాడేది.

మొదట్లో ఏడుపు ముఖం పెట్టాడు కాని, పోనుపోను చనువుగా, లెక్కచేయకుండా ఉండటం నేర్చుకున్నాడు.

కాలం గడిచేసరికి ఆ అమ్మాయి తన దగ్గరకు రాకపోతే, తనను 'మొద్దూ' అని పిలవకపోతే బాధపడేవాడు

పరీక్షలు దగ్గరపడుతున్నాయి.

మాస్టారి ఇంటి వద్దనే చదువుకుని, పడుకుంటున్నాడు రమేష్. ఒక అర్ధరాత్రి పూట వసుంధరను నిద్రలేపి మంచినీళ్ళు కావాలన్నాడు.

"ఈ మొద్దబ్బాయికి అర్ధరాత్రి దాహం వేసిందా?"

"దాహానికి పగలు, రాత్రి అని తేడా ఏముంది ఎప్పుడైనా వేయవచ్చు."

"అర్ధరాత్రి దాహానికి అర్థం వేరే ఉంటుందని ఈ మొద్దుకు ఎప్పుడు తెలుస్తుందో"

"ఆ అర్థాలూ, అపార్థాలూ నాకు అక్కర లేదు వసూ! నన్ను మొద్దూ, మొద్దు అని మరీ ముద్దుచేస్తున్నావు మరి కావాలంటే ఇస్తావా?"

"..బ్బో... అబ్బాయిగారికి సరసంకూడా తెలుసే. నీకు ముద్దు కావాలా? మాస్టారికి చెప్పమంటావా?"

"వసూ.... వసూ! నీకు పుణ్యముంటుంది. మాస్టారికి చెప్పద్దు" అని చేతులు పట్టుకున్నాడు.

"ఛీ పెద్ద మగాడు దిగొచ్చాడు ఇంత హడలిపోయేవాడు ముద్దు పెట్టుకోగలడా?" అని ఒక నవ్వు నవ్వి బుగ్గమీద ఒక ముద్దు పెట్టుకున్నది.

తెలిసీ తెలియని వయసు, విరిసీ విరియని మనసు

ఆ మధురస్మృతి ఇప్పటికీ చెరగిపోలేదు.

దాన్ని తలచుకుంటూ, భుజాలపై వేసిన చేతులు జ్ఞప్తికి వచ్చేసరికి ఒక్క పర్యాయం ఒళ్ళు గగుర్పొడిచింది.

ఆ చిలిపి చిన్నారేనా ఈ వయసు వయ్యారి!

ఇద్దరూ ఇళ్ళలో సాకులు చెప్పి సినిమాకు వెళ్ళారు. ప్రక్క ప్రక్క సీట్లలో కూర్చుని, ప్రతి సన్నివేశానికి నవ్వుకుంటూ, విమర్శించుకుంటూ మూడు గంటలను మూడు క్షణాలుగా






గడిపారు.

ఒకరోజు పెన్న ఒడ్డుకు వెళ్లారు. గలగల పారే పెన్ననది ప్రక్కన ఇసుకలో కూర్చుని కాసేపు అమాయకకగా ఆడుకున్నారు, నవ్వుకున్నారు.

"ఏయ్ మొద్దూ! వయసొచ్చే అమ్మాయితో ఇలా బలాదూరుగా తిరిగితే లోకం ఏమనుకుంటుంది?"

"ఏమనుకుంటుంది? నీకింకా వయసు రాలేదు. నాకింకా బాల్యం పోలేదు. స్వేచ్ఛగా ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడూ తిరుగుతాం పరువంలో నువ్వు నన్ను చూచి సిగ్గుల కుప్ప వవుతావు కాని, ఇలా హాయిగా తిరుగుతావా? మాట్లాడుతావా?

"ఆఁ... అలాగా! నీకు చాలా తెలుసునే. ఒట్టి మొద్దువనుకున్నాను. అదిసరే.... నిన్ను చూచి నేనెందుకు సిగ్గుపడాలి?"

"నేను మగవాణ్ణి కాబట్టి."

"పెద్ద మగాడు దిగొచ్చాడమ్మా! అయ్యా! మగమహారాజా! అయితే మన స్నేహం ఈ కొద్దిరోజులే నంటావు. ఈ స్నేహం స్థిరంగా చేసుకునే అవకాశం లేదా?"

"ఎందుకు లేదు ఈ వసూను నా వసూ చేసుకుంటే శాశ్వతంగా స్నేహంగా ఉండవచ్చు."

"అయ్యా మొద్దు మహారాజుగారూ! ఈ వసూ నీ వసూ అయే అవకాశం ఉందా!"

"అదే ఆలోచిస్తున్నాను."

"పెద్ద - మనిషిలా ఆలోచిస్తున్నాడట, ఆలోచిస్తున్నాడు. మీ ఆలోచన తెగేలోపల నేను పెద్దదాన్ని కావడం, పెళ్ళి కావడం కూడా జరిగిపోతూంది.

"లేదు వసూ! వయసు రానీయ్. అంతవరకు మన తీయని స్నేహాన్ని కమ్మగ పెంచుకుందాం!

"మీ మగవాళ్ళంతా యింతే. ఇలాగే తీయగా చెబుతారు."

"ఎందరు మగవాళ్ళను చూసేవేమిటి?"

"ఛీ పాడు నోటి దురుసు ఎక్కువౌతూందే" అంటూ చేతితో తొడమీద ఒకటి చరిచింది.

అలా సాగాయి ఆ రోజులు.

ఉన్నట్టుండి హఠాత్తుగా మాష్టారికి ట్రాన్స్ఫర్ రావడం, వసుంధరతోచి బయలు దేరడం జరిగాయి.

వసుంధర వెళ్ళేప్పుడు చూచిన చూపులు మరచిపోలేనివి.

రమేష్‌కుమార్ చూపులతోనే ఆ అమ్మా

యికి ధైర్యం చెప్పారు శ్రీకృష్ణునిలా వచ్చి, రుక్మిణిని యెత్తుకు వెళ్ళినట్లు తీసుకెళతానని ధైర్యం చెప్పారు.

ఇవి తీయని అనుభూతులు

"లౌ ఇన్ టీన్స్" కథ ఇది.

జీవితంలో పరిస్థితుల ఒత్తిడులకు లొంగి సుశీలను వివాహం చేసుకున్నాడు

తనకు ఎస్.ఐ. సెలక్షన్ రావడం. సుశీలతో ఊళ్లు తిరగడం—ఇలా ఆనందం గానే గడిచింది జీవితం.

కాని ఒక సంవత్సరం క్రితమే సుశీల ఒక యాక్సిడెంటులో మరణించింది ఆ రోజు నుండి జీవితం మోతయింది.

తనకు మిగిలింది డ్యూటీ.

ఇంటికి వెళితే స్కాచ్‌గాని విస్కీగాని దించి మత్తులోకి జారిపోవడం—జీవితం నిస్సారంగా గడుపుతున్నాడు.

o o o o

ఎడారిలో పూవు పూచింది.

వడగాడ్పులలో నవ్వవసంతం వచ్చింది.

ఇద్దరూ క్వార్టర్సుకు వచ్చి, స్కూటరు దిగారు. ఇంటి తాళంతీసి లోపలికి ప్రవేశించారు.

ఇల్లంతా అస్తవ్యస్తంగా ఉంది

"ఏయ్ మొద్దూ! నీ భార్యలేదా?"

"ఉండేది "

"అంటే"

"సంవత్సరం క్రితం చనిపోయింది "

"వెరి సారీ!" హాయిగా ఉంది మనమేం సాధించాం. పోయినవాళ్లే మంచివాళ్లు ఈ బాధ కు దూర గా హాయిగా వెళ్ళిపోతారు"

"పోయినవాళ్ళు మిగిల్చిపోయిన జ్ఞాపకాలతో బ్రతికున్న మనం బాధ దారి."

"ఓ ఐసీ! ఆమెను గాఢంగా ప్రేమించావా?"

"లేదు సుశీలే ప్రేమించింది. ఆ ప్రేమ చేష్టలే మధురస్మృతులయ్యాయి.

"నీవు ప్రేమించకుండా, ఆమెకోసం పరితపించడంలో అర్థం లేదు."

"బ్రతికుండగా విలువ తెలియలేదు ఇప్పుడు విలువ తెలిసి విలపిస్తున్నాను."

"చేతులు కాలాక ఆకులు పట్టుకు లాభమేమిటి? సరే నాకు చాలా ఆకలిగా ఉంది."

"ఇప్పుడే తెస్తాను."

లోపలికి వెళ్లాడు రమేష్. అంతా వెతికాడు. ఏమీ దొరకలేదు.

"వసూ! ఇంటిలో ఏమీలేదు బజారుకు వెళ్ళి తీసుకవస్తాను. ఇక్కడే ఉండు "

"ఏయ్ మొద్దూ! ఎక్కడికి వెళ్ళవద్దు. నువ్విలా కూర్చో."

చేతులు పట్టుకుని తీసుకవచ్చి కూర్చోబెట్టింది. విస్కీ తెరిచింది విస్కీబాటిల్ తీసింది. రెండుగ్లాసులలో పోసింది ఐసు ముక్కలు వేసింది రమేష్‌కు అందించింది.

"నా మురిపాలమొద్దూ! ఇది తీసుకో గొంతులోకి దిగితే గుండెమంట చల్లారుతుంది. మన సొదలు వ్యథలు తీర్చే ఏకైక ఔషధం ఇదే."

గ్లాసు తీసుకుని వసుంధ నే చూస్తూ తాగుతున్నాడు.

"నా పిచ్చి డార్లింగ్! ఏమిటి అలా చూస్తావ్" అతని తలలోకి వ్రేళ్ళుపోనిచ్చి, గుండెలకు తలను హత్తుకుంది.

అత కళ్లలో తృ, మోహం

"వసూ! నిన్ను పెళ్ళి చేసుకుంటాను. జ్యోతికో కోరిక ఈనాటికన్నా నెరవేర్చుకుందాం"

"పెళ్ళి గనుక అందామా? ఇప్పుడు పెళ్ళి మాటలేమీ ఎత్తకు నీ ఎదురుగా నేనున్నాను నా ఎదురుగా నీవున్నావు. ఇదే సత్యం ఈ సమయాన్ని ఈ కాలాన్ని వృధా చేయకు "

రమేష్ అప్రయత్నంగా వసుంధరను కౌగిలిలోకి తీసుకున్నాడు ముద్దులతో ముంచెత్తుతున్నా

o o o o




ఏమీ తెలియని సూరీడు అమాయకంగా ఒళ్ళు విరుచుకొని నిద్రలేచాడు.

రాత్రంతా స్వైర విహారం చేసిన తారలు తెరమరుగయాయి.

రమేష్ పడకమీద నుండి లేచాడు. ప్రక్కన చూచాడు. రాత్రి స్వర్గం [illegible] సు దరి కనిపించలేదు. ఇల్లంతా వెతికాడు. కనిపించలేదు.

గొంతెత్తి పిలిచాడు.

రాలేదు.

నిరాశ చెందాడు.

టేబిల్ ఫాన్ ఆపేందుకు ఫాన్‌పై చేయి పెట్టాడు ఫాన్ క్రింద ఏదో కాగితం.

ఆతృతతో కాగితం తీశాడు.

"నా ప్రియాతి ప్రియమైన మొద్దూ!

ఎన్నాళ్ళకు కలుసుకోగలిగాను నిన్ను. నిన్ను కలుసుకునే లోగా నీ జీవితం, నా జీవితం ఏమైపోయాయి! ఆ బాల్యం ఎంత హాయిగా గడిచింది! మళ్ళీ రాదు రమ్మన్నా.

నన్ను వివాహమాడతానన్నావు ఆ మాట చాలు. నేను పూజకు నికిరాని పుష్పాన్ని.

నీ వద్దకు నగరంలోని పెద్ద లనేకులు [illegible]

[illegible]

ఈ [illegible] లో స్వర్గం చూశాను ఈ జన్మకిది చాలు. నా కోసం వెతకవద్దు. మరో జన్మంటూ వుంటే, ఆ జన్మకి నీ చనిపోయిన భార్య నీ జన్మజన్మల భార్యనంటూ రాకుంటే అప్పుడు కలుసుకుంటాం.

నీది కాలేని నీదాన్ని,
వసు.

ఉత్తరం చదివి నిశ్చేష్టుడయ్యాడు ఒక కన్నీటిబొట్టు కాగితం పైబడి 'వసు' అన్న అక్షరాల్ని చెరిపింది.

*



# కామధేను సిల్క్స్ (ప్ర.సి)

బీసెంట్ రోడ్
విజయవాడ-2
ఫోన్: 62420



సరసమైన ధరలలో_కంచి, ఆరణి, ధర్మవరం
పట్టుచీరలకు ప్రసిద్ధి!




డా॥ జయా నాగరాజ్

# భర్తని అదుపు చేయడం యిలాగేనా ?

**అ**తనికి ముప్ఫయ్యేళ్ళుంటాయి . ఎంతో మంది ఆడపిల్లలను చూశాక బి. ఏ., చదివిన ఒక అమ్మాయితో వివాహం జరిగింది. పెళ్ళి తతంగాలు పూర్తి చేసుకొని ఇల్లు చేరారు దంపతులు.... ఆ రాత్రి.... మొదటి రాత్రి భార్యకు రతి గురించి తెలుపుతూ, భర్త ఆనందంకోసం భార్య త్యాగం చెయ్యాలని ఆమెకి నచ్చ చెప్పాడు. ఆ మేరకు వాగ్దానం చేయించుకున్నాడు. ఆమె అతనికి అనుకూలంగా వుండి ఆతని ఆనందానికి దోహదం చేస్తానన్నది....! ఆ తరువాత తెలిసింది భర్త కామోద్రేకం తప్పుదారి పట్టిందని!...

చిన్నప్పటి నుంచి ఆ అన్నదమ్ములు ఒక గదిలోనే పడుకునేవారు. ఒకరోజు అన్నయ్య చెప్పాడు హస్తప్రయోగం, స్వజాతి సంభోగం. (హోమో సెక్స్యువాలిటీ) గురించి. ఈ దురల వాట్లకి లొంగిపోయిన రామం మొట్టమొదట స్త్రీతో వివాహం, అటుపై లైంగిక జీవనం అంటేనే బెంబేలు పడేవాడు. (హెట్రో సెక్సువల్ పానిక్) తరువాత అన్నకి వివాహమైంది, రామం భగ్న హృదయంతో కొన్నాళ్ళపాటు దేశాలు పట్టిపోయాడు (లాస్ ఆఫ్ సెక్సువల్ పార్ట్‌నర్ అండ్ డిప్రెషన్) రామాన్ని అన్నయ్య వెతికి తెచ్చి బలవంతాన వివాహానికి ఒప్పించాడు. వివాహం జరిగింది గాని మగవారితో శృంగారానికి అలవాటుపడ్డ రామం మామూలు పద్ధతిలో భార్యతో దాంపత్య జీవితాన్ని గడపలేకపోయాడు. తనకు అలవాటైన పద్ధతిని భార్యకు అలవరచాలనీ, అసహజ విధానంలో భార్యను అనుభవించాలని, (కన్నిలిన్‌గస్) ఉబలాట పడేసరికి ఆ అమ్మాయి రతిమీద విసుగుతో, భయంతో భర్తను విడిచి

తన్నబాధిల్లు చేరింది. బాలు ముద్దు ముదిగా ప్రేమించిన వ్యక్తి (తన [illegible]) తనను తని వెళ్ళి పెళ్ళి చేసుకుంది, భార్య కూడా తన [illegible] [illegible] [illegible] [illegible] కోవడం రామాన్ని పిచ్చివాణ్ణి చేశాయి ఆత్మహత్య చేసుకోవాలనే ప్రయత్నంలో వున్నప్పుడు సిరోధి చి మానసిక శాస్త్రవేత్త దగ్గరికి తీసుకువచ్చారు రామాన్ని అతని తలి దండ్రులు ! ఆ తవరకూ కొడుకు చేస్తున్న పనులు వారికి తెలియవు

చిన్నప్పటినుంచీ లైంగిక విషయాలను గురించిన మిడిమిడి జ్ఞానం ఇలాంటి రుగ్మ లకు దారి తీస్తుంది రతిని గురించి ... సంభోగం గురించి, మగవారు మగవారితో సంభోగించ డంలోని అసహజత్వాన్ని, హైన్యాన్ని గురించీ వివరంగా ఆ భార్యా భర్తలకు వివరించిన తరు వాత రాముం దంపతులిప్పుడు సహజమైన దాంపత్య [illegible] గడుపుతున్నారు!

## 2

సుబ్బయ్యశెట్టి ముచ్చటపడి మేనమామ కూతుర్ని పెళ్ళి చేసుకొని కట్టెల అడితీ, బొగ్గుల వ్యాపారం నడుపుతూ గట్టిగా బ్రతుకుతుండేవాడు .. అప్పుడప్పుడు వ్యాపార రీత్యా అతను పైవూళ్ళకు వెళ్ళవలసి వచ్చేది ఆ సమయాలలో సీత తానే వ్యాపారాన్ని చక్కగా నడిపేది బొగ్గుల కోసం నిత్యం ఓ పదహారేండ్ల పడుచు ఆ కొట్లోకి వచ్చేది చకచకటి కనుముక్కు తీరు .. నవ్వుతూ వుండేది . "సుబ్బయ్య మామ లేడా "అను కుంటూ వచ్చేది రోజూను! ఆ అమ్మాయి తీరు, ఆమె వచ్చే విధానం నచ్చలేదు. సీతకి భర్తను నిలదేసి అడిగిందొకరోజు.. తానే పాపం ఎరుగనని అందరిలాగే ఆ అమ్మాయి వస్తున్నదని నచ్చచెప్పాడు సుబ్బయ్య... కాని

సీతకు [illegible] ...

వుండి భర్తను కనిపెట్టడం మొదలు పెట్టింది. అటుపైన కట్టెల అడితికి ఏ ఆడది వచ్చినా భర్తతో అక్రమ సంబంధం వున్నదని వారిని [illegible] భర్తను వ్యాపారం చేసుకోనివ్వకుండా యిరవై నాలుగు గంటలూ యింట్లోనే వుండి తనతో రతి జరపమని ఒత్తిడి చేసేది. ఆమె ఒత్తిడినీ, అసహజమైన అధిక లైంగిక వాంఛలను భరించలేకపోయాడు సుబ్బయ్య...! పిల్లలను చూసుకోవడం, యిల్లు వాకిలీ సర్దుకోవడమూ అన్నీ వదిలి భర్తను వెంటాడుతూ తన యింటిని, తన జీవితాన్నికూడా దుర్భరం చేసుకుంది సీత...భర్త తన దగ్గరే పూర్తిగా అలిసిపోతే, తాను అతన్ని పూర్తిగా తృప్తి పరిస్తే యితర స్త్రీలతో పోవడానికి అతనికి ఆస్కారం వుండదని ఆమె నమ్మకం (డ్రైనింగ్ ది మేన్ ఆఫ్ హిజ్ పొటెన్సీ) అతని మగతనాన్ని తనసొత్తు చేసుకుంటే పరస్త్రీ సంభోగం కోరడని ఆమె అనుకున్నది. ఆమెది అనుమాన ప్రకృతి. భర్త తనకు దక్కకుండా పోతాడేమోనని భయం. తానంత అందగత్తె కాదు కనుక తన భర్త యితర స్త్రీల ఆకర్షణలో పడతాడనే భ్రమ ... యివన్నీ కలసి ఆమెలో రుగ్మతగా పరిణమించాయి! ఇతరుల మీద అనుమానం (పారనోయిడ్ ఫీచర్స్) తనకు నష్టం కలుగుతుందని భయం... అందరూ తననీ తన జీవితాన్ని నాశనం చేస్తున్నారనే తలంపు (డెల్యూషన్స్ ఆఫ్ పెర్సిక్యూషన్) ఈ రుగ్మతతో కలుగుతుంది... అధిక లైంగిక వాంఛ (ఎక్సెసివ్ సెక్స్ఆర్జ్) ఆడవారిలోనూ మగవారిలోను కలుగుతుంది. అవధులు దాటిననాడు అది ఒక రుగ్మతగా పరిణమిస్తుంది.

## 3

సుందరికి నలభై ఏళ్లు దాటినా కట్టు బొట్టు తీరులో పదహారేళ్ల పిల్లలకు తీసిపోదు. నవ్వు, హొయలు, పలుకు, నల్లటి జారుతున్న [illegible] యవ్వనపు [illegible] పట్టి ఇస్తున్నాయి. ఆరుగురు పిల్లల తల్లి... అయినా భర్తను విడిచి వుండలేని తత్వం. భర్తతో గడపని రాత్రి ఆమెకు నిద్రరాదు. పైగా ఆయాసం వస్తుంది. వికారం కలుగుతుంది మదన తాపం తట్టుకోలేక భర్త పక్కన లేకపోతే భర్త ఫోటోను గుండెలకు అదిమి పట్టుకుని పడుకొంటుందావిడ. భర్తమీద మోజు కలిగితే, ఆయన పర్యటనలలో వున్నాసరే ఆ వూరు చేరుకుంటుంది సుందరి. పలుమార్లు రతి క్రీడలలో ముంచెత్తమని భర్తను వేధిస్తుంది. భర్త ప్రభుత్వోద్యోగి. ఉద్యోగరీత్యా తిరగవలసి వుంటుంది. ఆయన సన్నగా పొడుగ్గా వుండి ప్రాణమే లేనట్లు కనబడతాడు. ఎక్కడ పడితే అక్కడే పగలు, రాత్రి అని లేదా లేకుండా భర్తను వెంటాడేది సుందరి భర్త మీద పూర్తి విశ్వాసమే... అయినా తనకు మాత్రం సంతృప్తి కలిగేది కాదు. పెద్ద కూతురికి వివాహమయ్యింది. ఆమె పురిటికి వచ్చింది. ఇల్లు బంధుమిత్రులతో నిండి వుంది. అంతా హడావిడిగా వున్నారు. ఈ సందర్భంలోనే సుందరికి భర్త గుర్తుకు వచ్చి నలుగురితో పిచ్చాపాటి మాట్లాడుకుంటున్న ఆ పెద్దమనిషిని సిగ్గుపడుతూనే పిలిచింది. బిక్కచచ్చిపోయాడాయన "కొంపతీసి యిది మానసిక రుగ్మత కాదు గదా" అనే అనుమానం అప్పుడు కలిగిందాయనకి.

భర్త పొందు కోరడం .... ఆయననే వెన్నంటి వుండడం... యుక్త వయస్సులో సాధారణమే కాని ఆ వాంఛ ప్రకృతి విరుద్ధంగా వున్ననాడు, అవధులు దాటిననాడు మానసిక రోగంగా పరిణమిస్తుంది. తమమీద తమకు నమ్మకంలేక, భర్త పర స్త్రీని కోరతాడేమోనన్న భయంతో శారీరకంగా ఈ భయాన్ని తీర్చుకోవడానికి, భర్తను తమ అదుపులో వుంచుకోవడానికే ఈ ప్రయత్నం! అనుమానాలు.... భయాలు అన్నీ ఈ వ్యాధికి దారి తీస్తాయి.



# సీతా ఓ సీతా!



దేవిప్రియ

నవ్యధోరణి నాటిక !

ఇది జరిగిన కథ కాదు, జరగడానికి అవకాశం వున్న కథ కూడా కాదు-జరుగుతున్న కథ ? అవును. ఒక విధంగా జరుగుతున్న కథే యిది విలువలు విడిచి విసిరేసిన వలువల కంటే చులకనైపోతున్న నేటి పరిస్థితుల్లో నలుగుప చేరి దేన్ని నంది అంటే అదే నంది అవుతోంది.

## వార్త

'బెంజీ' ఆంగ్ల చిత్రం చూసిన వారు - ఆ చిత్రంలోని నాయకుడు 'బెంజీ' (కుక్క) 'నటన' మరచిపోవడం చాలా కష్టం.

ఆ కుక్క-చిత్రాలలోను,టి. వి. కార్యక్రమాలలోను 'నటించడం' ద్వారా యింతవరకు 75 మిలియన్ల పౌండ్లు ఆర్జించింది! 'బెంజీ' ఎక్కడకు వెళ్ళాలన్నా, మొదటితరగతిలో ప్రయాణం, ఖరీదైన హోటళ్ళలో బస, ఖరీదైన ఆహారంతప్పనిసరిగా వుండాలట. 'బెంజీ' ఒక్కసారి స్టేజి మీద ప్రేక్షకులకు కనిపించడానికి, ఆ కుక్క యజమాని ఐదువేల పౌండ్లు వసూలు చేసాడట!

అవాస్తవికపు ఆలోచనల చుట్టూ ఈనాడు మనుషులు ఆశల వలలు అల్లుకొంటున్నారు.

ఎవరి ప్రయోజనాల కోసం వాళ్ళు తపిస్తున్నారు.

మేధావులు మెదడు లేనట్టు వ్యవహరిస్తున్నారు.

జనం ప్రచారాల ప్రభంజనంలో పడికొట్టుకు పోతున్నారు ...

నాగరికత పేరిట, వేలం వెర్రిగా కొత్త వింతల వెంటపడడం ఎక్కువై పోయింది.

ఈ తొక్కిసలాటలో తమ జీవిత సత్యాలను తామే తొక్కి చంపుకొంటున్నారు ...

ఇది మనసులో వుంచుకొని ... ఈ ప్రతీకవాద నాటిక చదవండి

☞

## సీతా, ఓ సీతా!

(తెర తీయగానే, చీకటిగా వున్న రంగస్థం క్రమ గా కాంతివంతమవుతుంది. గోడమీద పెద్ద సైజులో సీత బొమ్మ ఒకటి. అందంగా చిత్రించబడి వుంటుంది. గోడగడియారం కొత్త మోడల్‌ది, రంగు రంగుల టెలిఫోన్‌లు నాలుగు, ఫర్నిచర్-టేబుల్-చాలా పెద్దది. కుర్చీలు కొన్ని వుంటాయి. భుజాల మీంచి పట్టీలు వేలాడే ప్యాంటు యిన్‌షర్టు చేసి, చేతిలో పొగలు కక్కుతూన్న పైపుతో

రామ: కవా? కొంపతీసి మన ఓల్డు ఫ్రెండు కాదు గదా. పంపించమ్మా ఫోను పెట్టేస్తాడు మరొక ఫోను మోగుతుంది. రిసీవర్ తీసుకొంటాడు.)

హల్లో— ఆఁ ఆఁ నేనే-సీత స్నానం పూర్తయిందా వెరీగుడ్ టబ్‌లో డెట్టాలూ సెంటూ కలపడం మరిచిపోలేదు కదా — గుడ్- చినబాబుగారు తయారయ్యారా — వెరీగుడ్— రెడీ

### ఇందులో....

| | |
|---|---|
| రామచంద్రుడు | - ఒకప్పుడు నాటకాల కాంట్రాక్టర్ - వయసు 45 పైన. |
| చినబాబు | - 10–12 సంవత్సరాల మధ్య. స్కూలు విద్యార్థి. |
| అమ్మాయి (గెస్ట్) | - 8–10 సంవత్సరాల మధ్య. చినబాబు చెల్లెలు. |
| కవిగారు | - ....... |
| భూపతిరాజు | - నాటకాల కాంట్రాక్టర్లకి పెట్టుబడులు పెట్టే మొరటు ధనికుడు. |
| సెక్రటరీ | - 80 సంవత్సరాలు - రామచంద్రుడి ఆఫీసు సెక్రటరీ |

### కంఠస్వరాలు

రిసెప్షనిస్ట్ (లేడీ) - మిస్టర్స్ పి. ఎన్. - సిప్పీ వగైరా

కాలం: వర్తమానం స్థలం: హైదరాబాదు

కాంట్రాక్టర్ రామచంద్రుడు ప్రవేశిస్తాడు. లోపలినుంచి టెలిఫోన్ బజర్‌కి సమాధానంగా టెలిఫోన్ ఎత్తుతాడు.)

రామ: యేస్- రామచంద్రుడు

రిసెప్షనిస్టు: ఎవరో కవిగారట. మిమ్మల్ని చూడాలంటున్నారు సార్

గున్నారా-దట్సాల్ గుడ్.

(కవిగారు వచ్చారు బయటినుంచి)

(కవిగారిని చూసి ఆశ్చర్యంతో ఆనందంతో ఫోను పెట్టేసి ఆహ్వానించాడు)

కవి: నమస్కారం రామచంద్రుడు గారూ, నేను గుర్తున్నానంటారా!

రామ: నువ్వు మా సీస పద్యాల కవివి కదూ. కొంప ముంచావు గదయ్యా! రా, రా, రా! ఏమయ్యావు, ఇన్నాళ్లు ఎక్కడున్నావు?

కవి మన ఆసవీ కన్యకాపరమేశ్వరీ నాటక సమాజం మూతపడి, మీ దారిన మీరూ, ఆర్టిస్టు దారిని ఆర్టిస్టులూ చెల్లా చెదరై పోయేక నా అగచాట్లు ఏమని చెప్పమంటారు లెండి

[illegible] నా ఒళ్ళు గగుర్పొడుస్తోంది.

కవి: తిరగని వూరులేదు పడని కష్టం లేదు. ఇన్నాళ్ళకి, మీ పేరు పేపర్లలో, రేడియోలో మారుమోగడం చూసి అసలు ఈ రామచంద్రుడు మా ఆ రామచంద్రుడు అవునో కాదో చూసి పోదామని వచ్చా! అంతా బావున్నట్టే కదా!

రామ. మా సీత దయవల్ల అంతా సజావుగానే సాగిపోతోందయ్యా.

కవి రామచంద్రుడుగారూ ఏమిటండీ ఈ చిత్రం - ఈ సీతేమిటి, పాటకి దాని ఆటేమిటి, జనానికి ఈ వేలం వెర్రేమిటి, ఈ కనక వర్షమేమిటి, ఇది కలా, వైష్ణవ మాయా?

రామ. కల కాదు కవిగారూ, ఇది కటిక నిజం నాటకాల కంపెనీ పెట్టి, వున్న నాలుగ రాళ్లూ కురుక్షేత్రమనీ, సతీ సక్కుబాయనీ, రామాంజనేయయుద్ధమనీ అలా పాడు చేసుకున్నాను భార్యా పిల్లల్ని పస్తులు పడుకో పెట్టా. దిక్కు తోచక పిచ్చివాడిలా తిరిగాను. అనాథలా అల్లాడిపోయాను ఒకరోజు... ఒకరోజు- సంటూరులో.... కాళ్ళీడ్చుకుంటూ రోడ్డుమీద పడిపోతూండగా, వేణువు మీద మధుర మధురంగా ఒక పాట (రంగస్థలమంతా చీకటై పోతుంది రంగస్థలం ఫ్రంట్‌లో వెలుగు అక్కడ (ఆర్. ఎఫ్ లో) ఒక బాబు సిగరెట్ పెట్టెతో చేసిన తబ్బామందు మోకాళ్ళమీద కూర్చుని వేణువు వాయిస్తూ వుంటాడు. పక్కన అదే వయసులో వున్న మరొక అమ్మాయి కూడా వుంది. రామచంద్రుడు నెమ్మదిగా అటు నడిచాడు. ఒట్టలు మాసిపోయి, పంచె చిరుగు పడివుంది?

రామ: ఏమిటి నాయనా అది.

(వాడు వేణువు ఆపడు. అమ్మాయి [illegible])

అమ్మా పాట.

రామ ఎవరు నాయనా నువ్వు?

అమ్మా: మా అన్నయ్య.

రామ. నీ పేరేమిటి బాబూ?

అమ్మా: చినబాబు.

రామ: ఎవరు తల్లీ నువ్వు.

అమ్మా: మా అమ్మ కూతుర్ని, అన్నయ్య చెల్లెల్ని, ఇంకా యేమైనా వుందా అడగాల్సింది?

రామ సిగరెట్టు పెట్టెలో పాము పిల్లేమైనా వుందా యేమిటి?

అమ్మా: ఇంకా నయం ఏనుగు గున్నుందన్నారు కాదు - ది మా సీత,

రామ: సీతా! ఏదీ చూడనీ,

అమ్మా లేదండీ! అది పిల్లలకి మాత్రమే. పెద్దవాళ్ళంటే మా సీతకి తగని సిగ్గు. (ఊం. తున్న పాటని—నా స్‌లోని తన్ డోలే మేరె మన్‌డోలే—మధ్యలో ఆపి చినబాబు లేచాడు. అతని చేతిలో భద్రంగా ఆ పెట్టె వుంది)

రామ ఎక్కడ నేర్చుకున్నావు నాయనా యింత పాత పాట!

చి బా మా పాత గ్రామ్‌ఫోను దగ్గిర నేర్చుకున్నానండీ, బాగుందా?

రామ: బాగుండటమేమిటి, అమోఘంగా వుంది. అవునూ, ఆ పెట్టెలో ఏముంది నాయనా?

చి. బా: సీత!

అమ్మా: నేను చెపితే కోస్తున్నా ననుకున్నారా యేమిటి?



రామ: ఒకసారి నేను చూడొచ్చా.
చి. బా: నేను తప్ప ఎవరు ముట్టుకున్నా వూరుకోదండీ.

రామ: ఇంతకీ ఏమిటి నాయనా అది?
చి. బా: చూతండి.

రాము: (పెట్టెలోకి చూసి) ఆశ్చర్యం-పీత! పీతటయ్యా పీతంటే! ఇదేం అలవాటయ్యా ఇంగ్లీషు సినిమాల్లో విలన్ లాగా! పిలెవడంత లేవు.

అమ్మా: ఇది ఆషామాషీ పీత కాదండీ — డ్యాన్సు చేసే పీత. చూడండి, చూడడానికే ఎంత అందంగా వుందో, మా సీత. దీని తెలివితేటల్ని గురించి యేం చెప్పమంటార్లెండి — మా అన్నయ్యి ఫ్లూట్ అలా ఊదాడంటే చాలు, జయమాలిని లాగా ఝామ్మని డాన్సు చేస్తుంది తెలసా?

రామ: పీత డాన్సాడుతుందా? ఇటువంటి విడ్డూరం ఎక్కడైనా వుందా? నేను నమ్మను

చి బా: నమ్మకపోతే నారాయణగూడ వెళ్ళండి. సీత డాన్సు చేసేది నా కోసమే. ఇదేమైనా టిక్కెట్ల నాటకం అనుకున్నారా యేమిటి?

రామ: (తనలో) "ఎంత దెబ్బకొట్టాడు!" (అనుకుని) ఆ మాటలు నాయనా - అద్భుతమైన విషయం గదా—చూసి తద్దామని అడిగాను. ఏది బాబూ, ఒక్కసారి వేణువు వినిపించు మంచి బాబువి కదూ—

(చిన్నబాబు పెట్టె కింద పెట్టి ఫ్లూట్ వాయించాడు మళ్ళీ—అదే ట్యూను)

రామ: ఓసి దీం దుంప తెగ. నిజంగానే ఆడుతున్నదయ్యా, అరె అరె అరెరే. బాబూ, ఫ్లూట్ ఒకసారి ఇలా ఇవ్వు - శభాష్ - (రామచంద్రుడు తనకి వచ్చిన రెండు మూడు పాత ట్యూనులు - ప్రేమకోసమై వలలో పడెనే పాపం పసివాడు. జగమే మాయ వంటివి వాయించాడు. సీత ఆడలేదు) అరే, నేను వాయిస్తే ఆడదే ?

అమ్మా: సాక్షాత్తూ సాలూరి రాజేశ్వరరావుగారే వచ్చి వాయించినా మా సీత కాలు కూడా కదపదు.

అ: నేనే వాయించాలి. అది కూడా స్పానిష్ ట్యూన్నే వాయించాలి.

రామ. చిత్రంగా వుందే (స్వగతంగా) కాలువ గట్ల బొరియల్లో, సముద్రం వొడ్డున ఇసుకతిన్నెల్లో, చాటుగా చల్లగా పడి వుండే పీత సంగీతానికి కదిలి ఆడడమేమిటి ఈ సంగతి ప్రపంచానికి తెలిస్తే ఏమన్నా వుందా, అమ్మో, నా ఇల్లు రజిల్వే బ్యాంకయిపోదూ - వాళ్ళ నాటకాలమీద రోతపుట్టి, చెత్త సినిమాలంటే ముఖం మొత్తి వున్న జనం ఈ కొత్త వింత మీదికి వెర్రిగా ఎగబడతారు. రేడియోలో, పత్రికల్లో, టెలివిజన్‌లో పీలైతే సినిమాల్లో- అమ్మా, కన్యకాపరమేశ్వరీ, చల్లగా చూడు- బాబూ, ఈ పీతని...

అమ్మా: పీతేమిటండీ, సీత అనలేరూ.

రామ: అదే అదే, సీతని నా కిచ్చేయరాదూ, అంతా పోగా అయిదు రూపాయలు మిగిలి వున్నయ్. బోలెడు చాక్లెట్లూ, చూయింగమ్ములూ కొనక్కోవచ్చు.

న.బా: చేపబోలు చెరువుగట్టు కెళ్ళండి, బోలెడు దొరుకుతాయి.

రామ: అన్నీ ఇలా ఆడతాయా! పురుషులలో పుణ్యపురుషులున్నట్టే పీతలలో కూడా పుణ్య పీతలుంటాయని ఇప్పుడే జ్ఞానోదయమైంది బాబూ!

అమ్మా: అయిందిగా, ఇక దయచేయండి, (అమ్మాయి, చినబాబు నిష్క్రమిస్తారు)

రామ ఓయ్ చినబాబూ, అమ్మాయ్, మీ ఇంటి కొచ్చి మీ నాన్నగారితో మాట్లాడతా, సీత భద్రం! సీతా, సీతా, నా సీతా... (పిల్లలు వెళ్ళిన వింగ్ లోకే రామచంద్రుడు కూడా వెళ్ళిపోతాడు. "సీతా, ఓ సీతా!" అని రంగస్థలం పలుసార్లు ప్రతి ధ్వనించింది...... (ఇక్కడే నాటిక పేరు-ఇతర క్రెడిట్స్ చెప్పవచ్చు, కొన్ని క్షణాల తరువాత రంగస్థలమంతా లైటొస్తుంది. రామ

చంద్రుడు తొలి దుస్తుల్లో. యధా
స్థానలో వుంటాడు- కవి కూడా)

కవి : అలా మలుపు తిరిగిందన్న మాట
కాంట్రాక్టర్ రామచంద్రుడి కథ.

రామ : మలుపు కాదు కవీ, అలుపు ఎంత
అలసిపోయానో, ఈ జనం మూర్ఖ
త్వాన్ని సొమ్ము చేసుకోవటంలో ఎంత
శ్రమపడ్డానో నీకు తెలియదు- చిన్నవాణ్ని
తల్లిదండ్రులకి నచ్చచెప్పి, ఆ కుర్రాడి
పరీక్షలయ్యే వరకూ అక్కడేపడి వుండి,
ఈ కంపెనీ తెరవడానికి పెట్టుబడి
కోసం మళ్ళీ భూపతి కాళ్ళే పట్టుకుని...

కవి : (ఉలిక్కిపడి) ఏమిటీ, భూపతిరాజుని
మళ్ళీ దగ్గరికి చేర్చారా? వాడు నిలు
వెల్లా కోరలున్న కొత్తరకం పామన్న
సంగతి మరిచిపో. . ....
(ఫోను మోగుతుంది)

రామ . హలో.

రిసె (ఫిల్టర్) బొంబాయినుంచి జె. కె. బని
యన్స్ వాళ్ళ కాల్ సార్.

రామ . సెక్రటరీ యింకా రాలేదమ్మా.

రిసె : (ఫిల్టర్) ఇప్పటికి మూడుసార్లు ఫోను
చేసారు సార్, వాళ్ళ బనియన్ల మీద
మన సీత బొమ్మ వేసుకొనే విషయమై
అగ్రిమెంటు చేసుకోడానికి మిమ్మల్ని
రమ్మంటున్నారు సార్

రామ : ఈ బిల్డింగులోనే వున్న బొమ్మల
ఫ్యాక్టరీ వాళ్ళ అగ్రిమెంటు మీద
సంతకం చేయడానికే తీరిక లేకపోతే,
బొంబాయి వెళ్ళి సైన్‌చేయడం ఎలా
కుదురుతుంది?

రిసె . (ఫిల్టర్) వాళ్ళకి ఏం చెప్పమంటారు
సార్.

రామ : సార్‌కి టైమ్‌లేదు, సెక్రటరీతో
మాట్లాడి వేరే ఏర్పాటు చేసుకోమని
చెప్పు- (ఫోన్ పెట్టేశాడు.)
చచ్చిపోతున్నాననుకో ఈ అగ్రి
మెంట్లతో-
(సెక్రటరీ ప్రవేశించాడు)

సెక్ర. క్షమించండి సార్, మూడు నిముషాలు
ఆలస్యమైంది-

రామ. ఇరవై నాలుగు గంటలూ ఇక్కడే
పడివుంటావు, నీకు టైమేమిట్లే-కానీ,
ఆ బొంబాయి బనీనాళ్ళ గొడవేమిటో
తొందరగా చూడరాదూ, ఫోనుమీద
ఫోనుచేసి చంపేస్తున్నారు.

సెక్ర. [illegible]
టూరిస్టు బస్సులదాకా, అందరూ మన
సీత బొమ్మకోసం అగ్రిమెంట్లు రాసి
అడిగినంత ఇవ్వడానికి రెడీగా
వున్నారు సార్, కలకత్తా చూయింగ్
గమ్ కంపెనీ వాళ్ళు అగ్రిమెంటు
పొడిగించమని కోరుతూ బ్లాంక్ చెక్
పంపించారు సార్. ఇంకా ...హాలెండ్
నుంచి స్టాండర్డ్ డైరీవాళ్లూ, జపాన్
నుంచి సోనీ కంపెనీవాళ్లూ, మారిషస్
నుంచి సీ ఫుడ్ ప్రొడక్ట్స్ వాళ్లూ....
(కవిని గమనించి) వీరెవరు సార్,
వీరికి కూడా అగ్రిమెంటు కావాలా?

రామ . కాదు లేవయ్యా. ఈయన కవిగారు.
మనకి కావలసినవారు.

కవి . చాలా సందడిగా వుంది. కడు సంతో
షంగా వుంది. కడుపు నిండి పోయింది

రామ . మరిచేపోయాను! సెక్రటరీ!

సెక్ర: సార్.

రామ కవిగారికి వెంటనే వుండడానికి
రూమూ అదీ చూపించి భోజనానికి
ఏర్పాటు చేయి.

సెక్ర: మన గెస్టురూము ఖాళీగానే వుంది
సార్.

రామ : వెళ్లి రావయ్యా కవీ, స్నానం కానిచ్చి,
భోజనం ముగించుకునిరా పో-

సెక్ర: పదండి, పదండి ఎన్ని రోజులయిందో
ఏమో...

కవి : ఏమిటి, స్నానం చేశా, భలేవారండీ!
(ఇద్దరూ లోపలికి వెళ్లారు)

రామ : సీతా ఓసీతా!




(భూపతి రాజు బయటినుంచి వస్తూనే)

భూ : ఏమి' య్యా రామచంద్రుడు గారూ, సీతా సీతా అని పట్టపగలే కలవరిత్త న్నావ్, కొంపదీసి ఆ సీతని లవ్వాడేత్తన్నావా యేంది?

రామ : నువ్వా భూపతీ!

భూ . నేనేనయ్యా మొగుడా– రాక తప్పుద్దా!

రామ ; అందవలసిన పైకం పూర్తిగా అందగానే నేనే వస్తానని చెప్పానుగా–

భూ : అంటే నేనీడికి రాకూడదనా నీ ఉద్దేశం! ఓయ్ రామసెంద్రుడుగోరూ అప్పుడే మరిసిపోయినావంటయ్యా పాతరోజులు. అవ్వవలసిన దాంటో ఆవగింజంత కాలేదు.

రామ : ఇప్పుడవన్నీ ఎందుకు భూపతీ. నీ దగ్గర తీసుకున్న డబ్బు వడ్డీతో సహా యిస్తానంటున్నా గదా.

భూ: వడ్డీ యేందయ్యా వడ్డీ, ఎవుడిగ్గావాల్నయ్యా వడ్డీ! ఈ యాపారానికి పెట్టుబడి పెట్టింది నేను. పేపర్లో, రేడియోల్లో టాం టాం యేయడానికి నీ దగ్గర నయాపైసాకూడా లేనప్పుడు యాభై వేలు ఎనకా ముందూ చూడకుండా నీ చేతుల్లో పెట్టింది నేను.

రామ: నువ్వు సాయం చేయలేదని నేనెన్నటికీ అనను. కానీ, సీతా ఎంటర్ ప్రయిజెస్‌లో సగం వాటాకోసం నువ్వు ఆడుతున్న నాటకాలు మాత్రం సాగ

సీయను.

భూ: మొత్తానికి కాంట్రాక్టు నాటకాల బుద్ధి పోనిచ్చుకున్నావు కాదయ్యా — సెల్లియో సెల్లకో పజ్జేంకి గిరాకీ తగ్గి సిల్లిగవ్వకి కాకుండా పోయి నోడివి - ఈయ్యాల యిలాగ ఉన్న మను కలుగు [illegible] న్నావు - ధనం నాది-దా సీది.

రామ: ఇప్పుడిప్పుడే నాలుగు డబ్బులు చేరుతున్నాయి. అప్పుడే నీ కన్ను పడిందా?

భూ: పైరుమీద పడితే యేం లాభమయ్యా, కన్ను పడితే భూమిమీదే పడాలి కానీ.

రామ: ఏమన్నావ్?

భూ. ఇంకా యేమీ అనందే ఇప్పుడంటున్నా యిను చెప్పేది జాగర్తగా ఇనుకో ఇప్పుడు నీ దెగ్గరున్న సీత మామూలు సీటి పురుసు గాదు. అది సాచ్చాత్తూ మాలచ్చిమి అవతారం. అచ్చిమి మా కులదేవత. అది నా నట్టింట పుంతకమే నేయం. నవ్వు రాసిచ్చిన నోటు నీ కళ్ళముందే ఇప్పుడే ఇక్కడే చించిపారేత్తా (ప్రామిసరీనోటు తీసి చేతితో పట్టుకుంటాడు) అదనంగా, యింకో యాభై యేలు నీ పేర బేంకిలో యేస్తా. అడిగితే, ఆ తుఖర కుంకి కూడా యింకో పదో పదిహేనో పారేత్తా — యిచ్చేయి - సీతని నా కిచ్చేయి రామసెంద్రుడూ, యిచ్చేయి.

రామ: (వెర్రిగా) భూపతిరాజూ - అది నా కలల పంట. నా ఆశల దీపం - ఆర్పేయా లనుకొంటున్నావా దాన్ని - పో బయటికి - నడువు — బయటికి - పోరా.

భూ: పోతా - కానీ - మళ్ళీ వత్తా, సీతకోసం, నా ధనలచ్చిమి కోసం.

(వెళ్ళిపోయాడు)

రామ: సీతా, నా సీతా.. (ఆవేశంతో బిగ్గరగా అరిచాడు. "సీతా ఓ సీతా" కోరస్ ఆడ, మగ గొంతుకలతో ప్రతిధ్వనించింది. రంగస్థలం క్రమంగా చీకటితో నిండిపోయింది,

రంగస్థలం మీద వెలుగు పరుచుకుంది. రామచంద్రుడు విస్కీ సీసా టేబుల్ మీద పెట్టుకుని గ్లాసుతో తాగుతున్నాడు సిగరెట్ కాలుస్తున్నాడు. చిన్నబాబు అందంగా తయారై వచ్చాడు చేతిలో వేణువు, అందమైన చిన్న గాజు పెట్టే వున్నాయి. గాజు బాక్సులో "సీత" వున్నదన్నమాట. చి. బా. వేణువు ఆలపిస్తూ వచ్చాడు. రామచంద్రుడి పరిస్థితి చూసి ఆశ్చర్యపోయాడు).

చి.బా: అంకుల్, ఏమిటిది....

రామ: రిహార్సల్ మాత్రం కాదు. ఏకంగా నాటకమే.

చి.బా. సినిమాల్లో తాగినట్టు ఇలా తాగితే అందరూ యేమనుకుంటారు- ఒళ్ళు స్వాధీనంలో ఉంటుందా?

రామ. సీత కిక్కెక్కి వున్న నాకు ఆఫ్టరాల్ - ఈ విస్కీ ఒక లెఖ్ఖా- (సీసా ఎత్తుకుని గడగడ తాగేస్తాడు)

చి బా, (కంగారుగా) అంకుల్, అంకుల్ -

రామ. ఇష్ష్ష్- ష్ష్ ష్ష్- నువ్వేమీ భయపడమాకు. నాటకాలాడించేరోజుల్లో బకాసురుడు లేటయి మూడో కృష్ణుడు రాక పోతే, నాటు విరిగించి, అరున్నర సుతిలో ఎత్తుకునేవాణ్ణి చూడూ— జెండాపై కపిరాజు- జెం....డాపై కపిరాజు.... చు కావా.... కనక, మనన్ని ఈ కల్తీ సరుకు ఏమీ కదల్చలేదు... ఓరేయ్, భూపతీ, దుష్టదుశ్శాసనా, భ్రష్ట దుర్యోధనా, కుటిల కీచకా, పీపీడ మణచలేక పోయిన నేను భీమ చంద్రుడనే—

(సెక్రటరీ ,కపీ ప్రవేశించారు)

సెక్ర. ఈ రోజు ప్రోగ్రాముల సంగతే మరిచి పోయినట్టున్నారేం సార్. తీరికగా ఏక పాత్రాభినయం చేస్తు




న్నారు.

రామ. నువ్వు చెపితే గదయ్యా కార్యక్రమం-

కవి : కవి సమ్మేళన మేమైనా వుందా ఈరోజు కార్యక్రమంలో—

చి.బా. కొంపదీసి మీరు మైకాసురుడు కాదు గదా!

కవి : మైకాసురుడా, అదేవిటి నాయనా—

చి.బా: పురాణాల్లో కాఠసురుడిలాగా, స్టేజి మీద మైకు పట్టుకుని వదలని వాళ్ళని మైకాసురలంటారు లెండి మా వూళ్ళో.

సెక్ర: చూశారా సార్, వచ్చిన కొత్తల్లో గవర్నమెంటు ఆఫీసులో ఫైల్లాగా పడి వుండే వాడు. ఇప్పుడు తెలుగు సినిమా క్లయిమాక్సులాగా ఎలా పేల్చేస్తున్నాడో—

రామ : అంతా ఆ సీత మహిమ.

చి.బా: ఆ సీతకాదు అంకుల్. నా సీత, నా సీత (పెద్దెని ముద్దెట్టుకుంటాడు) సీత నా ప్రాణం అంకుల్.

రామ : (విననట్టు) ఆఁ సెక్రటరీ, ఇవాళ ఫస్టు ప్రోగ్రామేమిటి?

సెక్ర. పదకొండు గంటలకి సెక్రటేరియట్‌లో కేబినెట్‌తో సీత గ్రూప్ ఫొటో వుంది సార్, దీని కోసం మద్రాసు నుంచి ప్రత్యేకంగా ఫొటోగ్రాఫర్ని పిలిపించారు-

కవి : ఏం, హైదరాబాదులో ఫోటోలు తీసే వాళ్ళు దొరకరా—

రామ. ఇది హైదరాబాదు కాదయ్యా బాబూ, హైదరాబాధ పోనీయివాళ కాస్త బాధ పడదాంలే అనుకున్నా, సమయానికి ఆ బాధకూడా దొరకదు. ఆఁ తరవాత..

సెక్ర: ఉగాండా నుంచి సీతని చూడడానికి వచ్చిన సాంస్కృతిక బృందంతో ఇంటర్వ్యూ, పన్నెండింటికి.

కవి : ఉగాండా నుంచా.

రామ: ఎందుకయ్యా అట్లా ఉలిక్కి పడ్డావ్

చి. బా: ఉగాండాని మొన్నటి దాకా యేలిన ఇడీ అమీన్ మనుషుల్ని తినే వాడటలే అంకుల్.

రామ: ఎంత పిరికివాడివయ్యా కవీ సెక్రటరీ నెక్స్ట్ నెక్స్ట్-

సెక్ర: మధ్యాహ్నం రెండింటికి రేడియోలో సీతకి సంబంధించిన శ్రోతల ప్రశ్నలకి మీ సమాధానాలు.

రామ: అంతా రెడీగా వుంది కదా-ఆ తరవాత-

సెక్ర: బిజినెస్ వ్యవహారాలు - సాయంత్రం అయిదు గంటలకి అఖిలభారత జంతు శాస్త్రజ్ఞుల సమావేశంలో, సీత ప్రత్యేక లక్షణాలని గురించి చినబాబు ఉపన్యాసం-

కవి: ఏవిటేవిటి, ఆలిండియా జువలజిస్ట్స్ కాన్ఫరెన్స్ లో ఈ పిల్లవాడి ప్రసంగమా?

రామ: మనకి పిల్లవాడేనయ్యా, దేశానికి మేధావి బురదగుంటల వెంట, సముద్రం గట్ల వెంటా పడి పురుగుల్ని తింటూ పురుగులా బతికే ఒక మామూలు పీతకి నాట్యం నేర్పడానికి నరావతార మెత్తిన నారాయణుడు అని పత్రికల్లో రాసి సీ యెత్తు ఫొటోలు కూడా వేశారు మా యువ రాజువి. తెలుసా?

కవి: ఔరా, కలికాలం.

సెక్ర: కలికాలం కాదు, శీతాకాలం కాదు! ఇది సీత కాలం! సార్ ఇవ్వాళ్టి పోస్టు కూడా మీరూ, చినబాబుగారూ ఇంకా చూళ్ళేదు—

చి బా: మీరు, చూసేయండి అంకుల్. సీతకి ఐన్‌వాటర్ టైమయింది.
(వెళ్ళాడు లోపలికి)

రామ: గుడ్. అలా ఉండాలి ప్రేమంటే! ఏదయ్యా చదువు ఉత్తరాలు- చదివే వుంటావు కదా- పాయింట్సు చెప్పేయి త్వరత్వరగా-

సెక్ర: ఎస్సార్! ముఖ్యమైన విషయాలు చెపుతానుసార్! మద్రాసు చిన్నయ్యా దేవర్ ఫిలింస్ నుంచి లెటరొచ్చింది సార్

రామ: చిన్నయ్యా దేవర్ ఫిలింస్ నుంచా, ఏమన్నారయ్యా వాళ్ళు,ఏం రాశారేం?

సెక్ర: మనం చెప్పిన రేటు కొంచెంఎక్కువగా వుందట సార్. తగ్గించే అవకాశం వుంటే రాయమన్నార్సార్ -

రామ: (నిరుత్సాహంతో) రేటెక్కువగా వుందన్నారా? ఈ కాంట్రాక్ట్ కుదురుతుందని బోలెడు ఆశలు పెట్టుకున్నానయ్యా-

సెక్ర: రెండు లక్షలకంటే ఎక్కువగా ఇవ్వడం కుదరదంటున్నారు సార్. మన సీత కనిపించవలసిన సీన్లు చాలా వుంటాయని కూడా స్పష్టంగా రాశారు సార్-

రామ: నాలుగు లక్షలడిగితే రెండు లక్షలే యిస్తామంటున్నారా....

కవి: ఏమిటి ... రూపాయలే ఇవన్నీ...?

రామ: రూపాయలేం కర్మయ్యా కవీ, నా సీత రత్నాలు కురిపిస్తుందయ్యా- ఇటువంటి అగ్రిమెంటు ఒకటి దొరికితే చాలునయ్యా, దీనికోసమేనయ్యా నేను ఎదురుచూస్తున్నది...

సెక్ర: సార్, ఇంకా చాలా ఉత్తరాలున్నాయి సార్.... ఇటలీ నుంచి "లా స్టాంపా" పత్రికవాళ్ళు, ఫ్రాన్సు నుంచి "లెఫిగారో" పత్రికవాళ్లు, జపాన్ నుంచి "అసహిషింబున్" పత్రిక ఎడిటరూ ఇంకా జర్మనీనుంచి "డీవేల్ట్", స్విట్జర్లాండ్ నుంచి "జేటుంగ్"-ఇలా చాలా పత్రికలవాళ్లు సీత జీవిత కథ ప్రచురించుకోడానికి రైట్స్ కావాలని అడుగుతున్నారు సార్.

రామ: నాలుగు లక్షలు...

సెక్ర: ఒక ఉత్తరం చైనా నుంచి కూడా వచ్చింది సార్.




రామ : నాలుగు లక్షలు, తరువాత నలభై లక్షలు. ఆ తరవాత నాలుగు కోట్లు-సీతా, నా సీతా.

(లోపలికి వెళ్ళాడు నెమ్మదిగా, మరొక లోకంలో అడుగులేస్తూ)

కవి : సీత పెద్ద సినిమా స్టారయ్యేటట్టుందే మండీ సెక్రటరీగారూ

సెక్ర: చెప్పాను గదటండీ, ఇది మామూలు సీతకాదని. మా సీత సినిమా స్టారు తాత!

కవి : పిదప కాలం పిదప బుద్ధులూ- సీత డ్యాన్సడడమేమిటి, ఆ పిల్లవాడికి మచ్చిక కావడమేమిటి, దగ్గిరికిపోతే కొండేలతో పట్టుకు పీకుతుందని భయపడి చస్తామే, ఏమిటండీ ఈ చోద్యం, ఆఁ.

సెక్ర: అది అర్థంకాకనే కదండీ దేశంలోని మేధావులూ, డాక్టర్లూ, సైంటిస్టులూ అంతా బుర్రలు బద్దలు కొట్టుకొంటున్నదీ!

కవి . సినిమాలంటే పడి చచ్చే జనం తారల్ని వదిలి, సీతా సీతా అని ఈ సీత వెంట పడడం, రేడియోలో రోజుకొక్కసారైనా సీత సంగతి వినపడకపోతే శ్రోతల సంఘాలు ఆందోళనచేయడం!

(ముగింపు వచ్చే సంచికలో)

మల్లిక్

మినీ కథ

# కడుపుమంట

అది బస్సు స్టాపు. సిటీ బస్సుల కోసం ఎదురుచూస్తూ అక్కడ చాలా మంది ఉన్నారు. ఓ పక్కగా లత నిలబడి ఉంది. ఆమె వంక ఆకలిగా చూస్తున్నాడు విశ్వనాథం తను ప్రేమిస్తున్న అమ్మాయివంక అలా ఆకలి చూపులు చూస్తున్న విశ్వనాథాన్ని చూసున్న కొద్దీ కడుపు మండిపోతూంది శంకర్రావుకి

సుబ్బారావు కడుపు మండిపోతూంది! సుశీల...తన భార్య సుశీల!....మెడలో తనతో లైసెను బిళ్ళలు కట్టించుకున్న సుశీల.... తన సొత్తు...తను పక్కన ఉంతగానే వేరే వాడివైపు అలా గుడ్లప్పజెప్పి చూస్తుందా?....

"ఆ పక్కగా నిలబడదాం పద" అంటూ సుశీలను అటుపక్కకి తీసుకెళ్ళాడు సుబ్బారావు.

జోగినాథానికి క్రితం రోజు జరిగిన సంఘటన తలుచుకుంటుంటే కడుపు మండిపోతూంది. ఆఫీసులో క్రితంరోజు తన చేత ఆ కాంట్రాక్టరు పని చేయించుకుని అయిదు వేలిస్తానని అన్నవాడు పని అయిన తరువాత మూడు వేలే ఇచ్చి, మిగతాది తరువాత ఇస్తానని అన్నాడు. హు....పని అయిపోయిన తరువాత మళ్ళీ పనిగట్టుకుని తనకు మొహం చూపిస్తాడా ఆ రెండు వేలు ఇవ్వడానికి?... ప్చ్....రెండు వేలు నష్టం!...

"అసలు అందరికంటే సీనియర్‌ని నేనే నండీ....కానీ ఆ వెధవాయ్‌కు ప్రమోషను వచ్చింది!...ఎందుకంటారూ?. .వాడు ఆఫీసరుకు చెంచా అండీ బాబూ.." అంటూ తన కడుపుమంటను సహోద్యోగులకు చెప్పుకున్నాడు చలపతి.

"కైలాసం అంత పెద్ద బిల్డింగ్ కట్టాడంటే డబ్బు చాలా ఉండి ఉండాలి....కారు కూడా కొందామని అనుకుంటున్నాడు...కొనడూ మరి? సీటు మహత్యం"

పొరుగువాడి పచ్చ చూడలేని పిచ్చయ్య కడుపుమంట ఇది.

బస్సు స్టాపులో ఒక పక్కగా ఉన్న మిరపకాయ బజ్జీల బండిదగ్గర గోపాల్రావ్ నిలబడి బజ్జీలు తింటున్నాడు.

"అబ్బ. బజ్జీలు చాలా కారంగా ఉన్నాయి. మిరపకాం ల్లో మసాలా పెట్టలేదా?...కడుపు మండిపోతుంది" అని బండివాడితో అంటూ బజ్జీలు సగం సగం తిని, సగం సగం పారేస్తున్నాడు గోపాలావ్

గోపాల్రావ్ అలా సగం సగం తిని బజ్జీలు చెత్తమీద పారేయడం చూస్తుంటే ఆ పక్కనే పుట్‌పాత్ మీద కూర్చున్న రంగడికి కడుపు మండిపోయింది.

అవునుమరి!...పాపం వాడికి రెండ్రోజుల నుండీ తిండిలేదు. 

# పన్నులు సరిగా చెల్లించండి
# దేశాన్ని శక్తివంతం చేయండి

* పన్ను చెల్లించవలసినంత ఆదాయమున్నవారు స్వచ్ఛందంగా పన్ను రిటర్నులు పంపుకోవటం చట్టరీత్యా తప్పనిసరి.
* అలా పంపకపోతే వడ్డీ, జరిమానా, శిక్ష పడవచ్చు.

## సర్వే జరుగుతోంది

* ఆదాయం పన్ను శాఖవారు సర్వే కార్యక్రమాన్ని పెద్ద పెట్టున జరుపుతూ ఇంటింటికి వెడుతున్నారు. పన్ను చెల్లించవలసినంత ఆదాయం ఉన్నా, రిటర్నులు స్వచ్ఛందంగా పంపుకోని వారు అనవసరంగా యిబ్బంది పడతారు.

## శిక్షకు గురికావద్దు

* ఇతరులు కనిపెట్టక ముందే మీరు స్వచ్ఛందంగా రిటర్నులు పంపి, పన్ను చెల్లించి, జరిపే దర్యాప్తులలో అసెస్‌మెంటు కార్యకలాపాలలో ఆదాయం పన్నుశాఖ వారితో పూర్తిగా సహకరించండి. ఆ తర్వాత కావాలనుకుంటే ఆదాయం పన్ను చట్టం 1961 సెక్షన్ 273 ఎ క్రింద రిటర్ను మాఫీ చేయవలసిందని/వడ్డీ తగ్గించవలసిందని/జరిమానా విధించవద్దని ఇన్‌కంటాక్స్ కమిషనర్‌ను మీరు కోరవచ్చు.
* సంపద పన్ను రిటర్ను స్వచ్ఛందంగా పంపుకున్న తర్వాత అటువంటి సదుపాయాన్నే పొందండి.

ఇంకా వివరాలకు వీరిని సంప్రదించండి:

మీ ఆదాయం పన్ను కమిషనర్/ఆదాయం పన్ను అధికారి/లేదా ప్రజా సంబంధాల అధికారి.



డైరెక్టర్ ఆఫ్ ఇన్స్‌పెక్షన్
(రిసర్చ్, స్టాటిస్టిక్స్ అండ్ పబ్లికేషన్స్)
ఇన్‌కంటాక్స్ డిపార్ట్‌మెంట్
న్యూ ఢిల్లీ.

డి.ఏ.వి.పి. 80/350

# నదీనాం సాగరోగతిః

—బెహరా వెంకట సుబ్బారావు

అదొక చిన్న గ్రామం. ఆ గ్రామానికి మధ్యలో రోడ్డుకి ఆనుకొని రామకోవెల. ఆ కోవెలకు విశాలమైన వరండా. వరండా మధ్యలో భజన చెట్టు. సమయం రెండు గంటలు కావస్తోంది రోహిణికార్తె. ఎంత నిప్పులు చెరుగుతోంది. వరండాలో నలుగురు గ్రామస్థులు కూర్చున్నారు గాలికోసం. ఎండల గురించి మాట్లాడుకొంటున్నారు వడగాల్పులకి ఎక్కడెక్కడ ఎంతమంది చనిపోయారో చెప్పుకొంటున్నారు. రోడ్డు నిర్మానుష్యంగా వుంది. ఒక యువకుడు అంత ఎండలోనూ గబగబా అడుగులు వేసుకొంటూ తమవైపే రావడం గమనించారు. ఎవరో తెలియదు. అపరిచిత వ్యక్తి. ఆ చుట్టు ప్రక్కల గ్రామాలనుంచి బస్ ఎక్కడానికి ఆ గ్రామానికి వస్తూవుంటారు ప్రజలు.

కాళ్ళకి చెప్పులు లేకపోవడం వల్ల పాదాలు అంటుకొంటూ వుండే చిన్నసైజు పరుగు తీసి ఆ వరండా చేరుకొన్నాడు ఒక స్తంభానికి ఆనుకొని కూర్చున్నాడు. అరికాళ్ళను చేతులతో రాసుకున్నాడు. అంతా అతనివైపు పరీక్షగా చూశారు ఆ యువకుడు అలా వారు చూస్తూండగానే పక్కకి వొరిగిపోయాడు. ఆనలుగురూ చివాల్న లేచి ఆతణ్ణి సమీపించారు.

"ఏమైంది బాబూ?" ప్రశ్నించాడు ఒకడు. అతను పలక్కపోవడంతో "మొహం తిరిగింది కాబోలు!" అన్నాడు మరొకడు.

"మంచి నీళ్ళుగావాలా బాబూ?" అడిగాడు మూడో వ్యక్తి. మంచినీరు తేడానికి పరుగెత్తాడు నాలుగోవాడు.

ఆ యువకుడు పైజామా లాల్చీ వేసుకొన్నాడు. నల్లగా బక్కపల్చగా వున్నాడు వయస్సు రమారమి యిరవై వుంటుంది అతనిలో సంస్కారం అంతగా కనబడదు. అచేతనంగా పడివున్నాడు అసిరయ్య చొరవ తీసుకొని అతని చొక్కాగుండీలు విప్పి వదులు చేశాడు. మీదికండువాను తీసి ఆత్రంగా విసరసాగాడు.

"మంచినీళ్ళకెళ్ళిన నూకరాజింకా రాలేదు!" ఆలస్యం భరించలేక వాడు వెళ్ళిన వైపే చూస్తూ అన్నాడు తాతయ్యలు. సత్యంనాయుడు ముక్కు దగ్గర వేలెట్టి చూశాడు.

రామకోవెల్లో ఎవరో వ్యక్తి వడదెబ్బతిని పడిపోయాడన్న వార్త ఆ గ్రామం అంతా పొక్కిపోయింది. జనం బాగా మూగారు.

పరుగెత్తుకొంటూ చెంబుతో నీళ్ళు తెచ్చి అందించాడు కిష్టంనాయుడు. ఆ తర్వాత అతని వెనుకనే మరో చెంబుతో నీళ్ళు తెచ్చాడు నూకరాజు.

క్రిష్టంనాయుడు తెచ్చిన చెంబు అందుకొని "బాబూ!" అని పిలిచాడు సత్యంనాయుడు

అతను పలక లేదు.

పక్కకు ఒత్తిగించాడు అసిరయ్య.

"దూరంగా వుండండేస్! గాలిరాగల్దు!"

చుట్టూ మూగిన జనాన్ని అదలించాడు క్రిష్టంనాయుడు. కానీ ఎవరూ లక్ష్యపెట్టలేదు వింతగా చూస్తున్నారు

అతని మొహం మీద నీళ్ళు చల్లి తన కండువాతో తుడిచాడు సత్యం నాయుడు.



అంతా ఆతృతగా చూడసాగారు, ఆ యువకుడు కొన్నిక్షణాల తర్వాత కళ్ళు తెరిచి అందర్నీ చూశాడు. చేతులుకూడ దీసుకొని అందరికీ నమస్కారం చేశాడు అతని నోట్లో నీరు పోసాడు సత్యంనాయుడు. నాలుగు గుక్కలు మింగి యిక గుటకలు వేయలేక పోయాడు. నోట్లో నీరు బయటకు వచ్చేసింది. అతని తలను తన తొడ మీద పెట్టుకొన్నాడు అసిరయ్య

"నోరు చాపు బాబూ!" అన్నాడు. అతని స్వరం గద్గదమైంది.

"ఎక్కడికి వెళ్ళాలి బాబూ?" కంగారు పడుతూ అడిగాడు అప్పుడే వచ్చిన అప్పన్న దొర.

అతి కష్టం మీద కనురెప్పలుఎత్తాడా అభాగ్యుడు.

"అందరికీ మరోసారి నమస్కారంచేస్తూ వెంకన్న..." అని ఆగిపోయాడు.

"చచ్చిపోనాతంటావా, దద్దా?"

అనుమానంగా అడిగాడు సత్యంనాయుడు.

అసిరయ్య గాభరాపడ్డాడు.

"ఒరే నర్సిగా! అర్జంటుగా పోయి పంతులు డాక్టరుగార్ని పిలు!" పురమాయించాడు అప్పయ్య దొర.

పంతులు డాక్టరుగారంటే ఆ వూరి కరణం గారి అబ్బాయి ఆ గ్రామంలో వున్న హాస్పిటలుకు డాక్టరుగారు

"పంతులు డాక్టరుగారు మందుల కోసం పొద్దుటే పట్నం ఎళ్లారు బాబూ! ఇంకా రానేదు!"

చెప్పాడు కరణంగారి పాలికాపు నర్సిగాడు.

"మరయితే ఆచార్లుగార్ని పిలుచుకురా!"

తొందరచేశాడు అసిరయ్య. పరుగుతీసాడు నర్సి.

క్రిష్ణమాచార్యులుగారు ఆయుర్వేద వైద్యం చేస్తూ వుంటారు ఆ గ్రామంలో. ఆ వూరికి ఆసుపత్రి వచ్చాక ఆయన గిరాకీ తగ్గిపోయింది.

ఇంగ్లీషు వైద్యం మీద నమ్మకం లేనివాళ్లూ ఆయుర్వేద వైద్యంమీద బాగా గురివున్నవాళ్లూ [illegible] వైద్యం [illegible]కొంటూ వుంటారు.

ఎక్కడికి కెళ్లాలి బాబూ అనడిగితే 'వెంకన్న' అని ఆగిపోయాడు. వెంకన్నగూడెం ఎళ్లాలి గాబోలు!

తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసాడు తాతయ్యలు.

"వెంకన్నగూడెం అంటే హరిజనుడై వుంటాడు" అతని తలను పదిలంగా కింద పెడుతూ అన్నాడు అసిరయ్య.

"వెంకన్న గూడెంలోని వాళ్ళంతా హరిజనులే బాబూ! ఈడూ హరిజనుడై వుంటాడు!" అన్నాడు ఒకడు.

వారి మాటలతో అక్కడ గుమిగూడిన జనం కొద్దికొద్దిగా ఎడం కాసాగారు.

చేతిలో చిన్న పెట్టెతో అదరా బాదరా వచ్చారు కృష్ణమాచార్యులుగారు.

"బాబూ! ఈడికేవూరో తెలీదు! ఎండలో వచ్చి మాటా మంతీ లేకుండా పడిపోవాడు! రెండు గుటకలు నీళ్ళు తాగి తల వాల్చేసాడు! సూడండి బాబూ!"

ఆచార్యులుగారు అతని చేతిని ఎత్తి మరు క్షణంలోనే క్రిందికి వదిలేసి

"ప్రాణం పోయింది!" అన్నారు.

"ఈడిదేవూరో తెల్దు బాబూ!" అన్నాడు ఒకడు, అక్కడ మూగినవాళ్ళలో.

"ఏవూరేటిరా? సెప్పినాడు గదా ఎంకన్న గూడెం అని" గదమాయించాడు మరొకడు.

"అరిజనుణ్ణన్నాడు గదరా!" అన్నాడు ఇంకొకడు.

వారి మాటలకి షాక్ తిన్నారు ఆచార్యులు గారు.

"ఆఁ! హరి! హరి! హరిజనుడా! చెప్పారు గాదేమయ్యా? అతణ్ణి తాకి భ్రష్టుణ్నయ్యాను! తీఁ దించండి! రోడ్డుమీద పడేయండి. రామా లయంలో మృతదేహమా? దించండయ్యా! క్రింద పడేయండి! ముకుందా! మురారీ!"

"ఏవిటంటీ మీ గొడవ!" విసుక్కున్నాడు అంతవరకూ ఓపికపట్టి నిలబడి చూస్తూన్న సత్యంనాయుడి మేనలుడు క్రిష్ణంనాయుడు.

"గొడవంటావేమిటయ్యా? హరిజనుడికి దేవా లయ ప్రాంగణాల్లోకి ప్రవేశమే నిషిద్ధమే! పైగా మృతదేహమా? చూస్తారేమయ్యా, క్రిందకి దించండి" కుపితులయ్యారు ఆచార్యులు గారు.

"అణ్ణి ఎలా తాకమంటారు బాబూ? కడ జాతివాడు! పైగా శవం!" తన అసమ్మతిని తెలియజేసాడు అసిరయ్య.

ఇక నిగ్రహించుకోలేరపోయాడు క్రిష్ణం నాయుడు

"అసిరయ్య మావా! మాటలు తిన్నగా రానీ! అతనూ మనలాంటి మానవుడే! అతని కులం ఏవిటో మొహంమీద రాసుందా? ఏ కులం వాడయితే మనకే? కులాలతోనూ, మతాలతోనూ మనకి పనిలేదు! జీవితానికి చిట్ట చివరి ఘట్టం మరణం! బతికున్నంతకాలమూ వాళ్ళని కడజాతివారని వెలివేసి దూరంగా వుంచుతారు! నీచంగా చూస్తారు! మనిషి కన్నుమూశాక ఇక కులాలతో పనేటి మావా? శవానికి కులంతో ముడిపెడితే ఎలా?"

మొదట ఆవేశపడినా తగ్గు స్వరంలో ఆగాడు.

క్రిష్ణంనాయుడి మాటలు ఆచార్యులుగారికి చిర్రెత్తించాయ్.

"ఒరేయ్ కిష్టయ్యా! పట్నంలో చదువు మొదలుపెట్టి ఏడాది కాలేదు! అప్పుడే ఉప న్యాసాలు దంచేస్తున్నావ్! సంఘ సంస్కర్తవి కావాలనుకొంటున్నావా? ఇవన్నీ నీకు తెలి యవుగానీ అలా పోయి నీ పనిజూసుకో!"

మందలించారు.

"ఆచార్లుగారూ! పెద్దవారనే గౌరవభావంతో ఊరుకొన్నా! ఈ మాటలేగానీ మా వాళ్ళెవ రైనా అంటే...."

ఉద్రేకపడ్డాడు. మేనమామ సత్యంనాయుడు కలుగజేసుకోవడంతో ఆగిపోయాడు.

"ఒరేయ్ కిష్టయ్యా! పెద్దోరితో ఏవిటిరా ఆ మాటలు! కుర్రతుంటవి నీకేటి తెల్సురా!




మాలోళ్ళని మాదిగోళ్ళని మన గుమ్మాల్లోకే రానీయం! అలాంటిది ఆళ్ళ శవాల్ని మోస్తారంట్రా! నీకేమయినా మతిగానీ పోయిందా?"

మందలించాడు. మేనమామవైపూ ఆచార్యులుగారి వైపూ కోపంగా చూశాడు క్రిష్ణంనాయుడు.

"అనంతశయనా! అపచారం జరిగిపోయింది! ఇదిగో అసిరయ్యా! తలార్లని పిలిపించి వెంటనే శవాన్ని దింపించి దూరంగా పడేయించండి. ప్రెసిడెంటుగార్కి కబురు పంపిస్తే తతిమ్మా ఏర్పాట్ల విషయం ఆయన చూసుకొంటారు నే పోయి స్నానం చేయాలి! అపరాహ్ణం దాటాక స్నానం! అచ్యుతా! జనార్దనా!"

తాను మైలపడినందుకు బాధపడ్డారు కదలబోతూంటే పిలిచాడు క్రిష్ణంనాయుడు.

"ఇదిగో ఆచార్యులుగారూ! మీ గీతాచార్యులు ఏమన్నారో తెలుసా! ఏ ప్రాణినీ ద్వేషించక మిత్రత్వంతో మెలిగేవాడూ, దుఃఖితులు ఎడల జాలీ, కరుణా గలవాడూ మమకార అహంకారాలు లేనివాడూ మాత్రమే తనకు ప్రియమైన భక్తుడు అన్నాడు. అంతేగానీ సహస్రనామజపం చేస్తే చాలదు. జ్ఞప్తికి తెచ్చుకోండి భక్తియోగం!"

ఆశ్చర్యంగా చూశారు ఆచార్యులుగారు.

"గుడ్డొచ్చి పిల్లని వెక్కిరించినట్టుంది నీ పద్ధతి! ఇదిగో సత్యంనాయుడూ పెద్దలతో ఎలా మాట్లాడాలో తెల్సుకోమను నీ అల్లుణ్ణి భగవద్గీత నాలుగు పేజీలు చదివితే చాలదని కూడా చెప్పు!"

"ఎటువంటివారిని పెద్దలుగా భావించి గౌరవించాలో కూడా అందులోనే చెప్పాడు అని చెప్పు మావా!" అందుకున్నాడు క్రిష్ణంనాయుడు.

"ఏటిరా తగువులు?" కలుగజేసుకొన్నాడు తాతయ్యలు.

"బాబూ ఆచార్లుగారూ! తమరెళ్ళండి! ఈడి సంగతి మేం చూసుకొంటాం!" అంటూ ఆచార్యులుగార్ని కొంత పకడ ప్రయత్నించాడు.

ఒకసారి కళ్ళురిమి కదిలారు ఆచార్యులుగారు.

"మనవూరిలోగా బట్ట సరిపోయింది. మరొక

చోటయితేనా ఇలా ప్రవర్తించినందుకు శ్రీకృష్ణ జన్మస్థానానికిపోయి చక్రధారిని స్మరించుకుంటూ కూర్చుని వుండేవారు!"

కసిగా విసురు విసిరాడు కిష్టంనాయుడు వెళ్తున్న ఆచార్యులు గారిని చూస్తూ.

"తలారి నారాయణ రానంటున్నాడు దద్దా!" వర్తమానం అందించాడు ఒకడు.

"ఏం? ఎందుకని? ఆడుకాకపోతే మరొకడు!"

విసుక్కున్నారు సత్యంనాయుడు.

"మున్సబుగారు చెబితే గానీ రాడేమో!"

సందేహం వ్యక్తం చేసాడు తాతయ్యలు.

"ఆళ్ల ధోరణి సూత్తుంటే మున్సబుగారు సెప్పినా పెసిడెంటుగారు సెప్పినా వచ్చేలా లేరు దద్దా! ఆళ్ళజాతి ఒకటే అయినాకులాలు వేరంట! ఆ చచ్చినాడి కులం ఏమిటో తెలుస్తే గాని రారంట!" వివరంగా చెప్పాడు.

అంతలో ప్రెసిడెంటు వెంకన్న దొరగారు మున్సబుగార్నీ, కరణంగార్నీ వెంటబెట్టుకొని వచ్చారు.

"ఎవర్రా మా యింటికొస్తూ యిక్కడ పడిపోయాట్ట?" వస్తూనే అడిగారు దొరగారు.

అంతా ఆ గ్రామ పెద్దలకి దారిచ్చారు.

"బాబూ! తమరింటికా? వెంకన్న....అని అనేసి ఆగిపోతే వెంకన్న గూడెం హరిజనుడనుకొన్నాం!" నొచ్చుకొన్నాడు అసిరయ్య.

శవాన్ని పరీక్షగా చూశారా పెద్దలు

"పీడ్నెక్కడో చూసినట్టుందే? మా యింటికి ఎందుకొస్తున్నాడబ్బా!" పైకే అనేశారు వెంకన్న దొరగారు

"బాబూ! తమరింటికని తెల్సిందిగాదు. వెంకన్నగూడెం హరిజనుడనుకొని ..." సగంలోనే ఆగిపోయాడు సత్యంనాయుడు తమ ప్రవర్తనకు బిడియపడ్డాడు. ఆ తర్వాత భయపడ్డాడు.

"ఒరేయ్! మీకంతా అంటూంటే నాకెందుకని వూరుకొన్నా గానీ, ఆడు హరిజనుళ్ళా వున్నాడంట్రా? ఆళ్ళకి తెల్లటి బట్టలు గూడానా?"

అందుకొన్నాడు తాతయ్యలు.

"నా కనుమానమేసింది దద్దా! ఆడి ముఖవర్చస్సు సూత్తే దొరలబిడ్డలా లేడూ?"

వత్తాసు పలికాడు నూకరాజు

"నేనంటూనే వున్నానురా! కానీ మీరినిపించుకొంగేనా? ఆడు వెంకన్న దొరగారింటికే ఎల్తున్నానని చెప్పబోయాడు! పూర్తిగా చెప్పలేకపోయాడు."

అన్నాడు మరొకడు

వారి మాటలకి నవ్వుకొన్నాడు కిష్టంనాయుడు.

"దొరగారూ! ఇతని ఊరూ పేరూ మీకు తెల్సేవుండాలి? వాళ్ళవాళ్ళకి కబురు పంపితే వచ్చి అంత్యక్రియలు చేసుకొంటారు."

అన్నాడు మున్సబుగారు.

ఆలోచనలో పడ్డారు వెంకన్న దొరగారు.

"వాళ్ళవాళ్ళకి కబురు పంపడం చాలా అవసరం ప్రెసిడెంటుగారూ! సూర్యాస్తమయం అయితే శవ దహనానికి శాస్త్రం వొప్పుకోదు. తెల్లవార్లూ ఈ శవానికి కాపలా కాయాలి."

అన్న కరణంగారి మాటలకి మండిపడ్డాడు కిష్టంనాయుడు.

"బ్రతికున్నంతకాలమే ఈ మిడిసిపాట్లు! కులం అనీ, జాతీ అని! శవాన్ని అలా వదిలేస్తే కుళ్ళి కంపు కొడుతుంది! అనారోగ్యానికి, అంటురోగాలకి కారణమవుతుంది! అందుకని శవాన్ని కాల్చడమో, పూడ్చడమో తప్పదు. ఒక్కో కులంవారు ఒక్కోలా చేస్తారు. అది ఆచారం అయి కూర్చుంది ఆ శవాన్ని రాబందులు పీక్కుతిన్నా పర్వాలేదు. వాడు చూస్తాడా ఏమన్నానా? శవంయొక్క అవశేషాలు మిగలకుండా వుంటే చాలు! మనకన్నా ఆ రాబందులే నయం! శవం ఏ కులంది అని ఆలోచించకుండా తింటాయి. మనకున్న ఈ కచ్చితపు బుద్ధి వాటికి లేదు!"

ఆ గ్రామ పెద్దలు ముగ్గురూ అతనివైపు ఆశ్చర్యంగా చూశారు. ఆ తర్వాత ఆగ్రహం ప్రవేశించింది వారిలో.

పరిస్థితి గమనించాడు సత్యంనాయుడు.

"వాడి మాటలకి లెక్క చేసుకోకండి




బాబూ ఏటి మాటాడుతున్నాడో ఆడికే తెలీదు! పిచ్చోడు!"

శాంతింప ప్రయత్నించాడు.

"నీ మేనల్లుడు కదూ! పట్నంలో చదువుకొంటున్నాడు కదూ!" కిష్టంనాయుడ్ని నిశితంగా చూస్తూ అడిగారు వెంకన్నదొరగారు.

"అవును బాబూ! నాలుగు ముక్కలు చెప్పించి పిల్లనిచ్చి పెళ్ళి చేయాలను కొంటున్నా!"

వినయంగా అన్నాడు సత్యంనాయుడు.

"ఊఁ బాగానే చదువుకొంటున్నాడన్న మాట!"

కళ్ళజోడు సవరించుకుంటూ కరణంగారన్న మాటల్లో వేళాకోళం ధ్వనించింది.

ఆయన్ను విసిలింపుగా చూసి దృష్టిని మరల్చుకొన్నాడు కిష్టంనాయుడు.

కిష్టయ్య వ్యవహారం అంతటితో ఆపుచేయ ప్రయత్నించాడు అసిరయ్య

"బాబూ! ఈతనిదేవూరో కలపీయండి. మనిషిని పంపిద్దాం!" అసలు విషయంలోకి దింపాడు.

"ఒరే కిష్టయ్యా! ఓసారి కళ్ళాని కెళ్ళు! పశువులొచ్చే యేళయింది! కుడితి పెట్టించి పాలు తీయించు! నాకు ఎల్లాసికి కుదరదు!"

పురమాయించాడు సత్యంనాయుడు అల్లుణ్ణి అక్కడనుంచి ఎలాగైనా పంపేయాలని.

"ఊఁ మానవత్వం లేని మనషుల మధ్య తిరిగేకన్నా నోరులేని ఆ పశువుల మధ్య మసలితేనే మంచిది!" అనేసి విసురుగా పోతున్న కిష్టంనాయుడు వైపు చూస్తూ వుండిపోయారు ఆ ముగ్గురు పెద్దలూ

"అసిరయ్యా! శవాన్ని దించి రోడ్డువారగా వుంచండి!" అన్నారు వెంకన్న దొరగారు.

అసిరయ్యా, సత్యంనాయుడూ, తాతయ్యలూ కల్సి శవాన్ని దగ్గరలో నున్న పశువులపాకలో వేశారు.

మున్సబుగార్ని కరణంగార్ని కొంతదూరంగా తీసుకెళ్ళి నెమ్మదిగా అన్నారు వెంకన్న దొరగారు.

"పంతులుగారూ! వీడెవరో నాకూ తెలీదండి! మంచి చిక్కొచ్చిందే!"

ప్రెసిడెంటు దొరగారి మాటలకి ఆశ్చర్యపోయారు ఆ గ్రామాధికారు లిద్దరూ.

"అయితే కొంపదీసి హరిజనుడే అంటారా!"

అనుమానాన్ని వ్యక్తం చేసారు కరణం గారు.

'అయితే కావచ్చు! గట్టిగా అనకండి!'

గుసగుసలాడారు దొరగారు.

"మరయితే పోలీసు రిపోర్టు యిద్దామా?"

నెమ్మదిగానే అడిగారు మున్సబుగారు

"పోలీసు రిపోర్టెందుకయ్యా? ఇదేమయినా హత్యా? ఆత్మహత్యా? నీ మున్సబు బుద్ధి పోనిచ్చు కున్నావ్ గాదు!"

చొరవగా అన్నారు ప్రెసిడెంటు గారు.

అంతలో పట్నం నుంచి వచ్చి ఆగింది బస్సు. డాక్టరుగారూ అతని తమ్ముడూ బస్ దిగారు. విషయమంతా వివరించారు పెద్దలు. డాక్టర్‌గారు వచ్చారన్న సంగతి తెల్సి తిరిగి వచ్చాడు క్రిష్ణంనాయుడు

పరీక్షించడానికి డాక్టరుగారు శవాన్ని తాక బోతూవుంటే గట్టిగా కేకేసారు కరణం గారు.

"ఒరేయ్ అబ్బాయ్! వాడి ప్రాణంఎప్పుడో పోయిుంది!" శవాన్ని తాక వద్దనే హెచ్చరిక. ధ్వనించింది ఆయన కేకలో.

తండ్రి మాటల్ని లెక్క చేయలేదు డాక్టరు గారు. శవాన్ని పరీక్షించి.

"చనిపోయాడు అభాగ్యుడు!" అన్నారు.

"ఏవూరో ఏమిటో తెలియదు బాబూ!" అన్నారు దొరగారు.

"ఏకులమో తెలీక తికమకపడుతున్నాం!" చెప్పారు కరణంగారు.

"ఏంచేయాలో అర్థంగావడంలేదు బాబూ!" అయోమయంగా అన్నారు మున్సబుగారు.

ఆ మృత దేహాన్ని పరీక్షగా చూసిన మీదట "ఇతన్ని నాకుతెల్సు!" అన్నాడు డాక్టరుగారి తమ్ముడు వేణు

"తెల్సా?" అన్నారంతా.

"ఆ తెల్సు!"

"ఏవూరు?"

"ఏకులం?"

"ఏంచేస్తూ వుంటాడు?"

"ఇక్కడి కెవరింటికి వచ్చాడు?"

అంతా వరసగా ప్రశ్నలవర్షం కురిపించారు.

"ఏ వూరో తెలియాలి, ఒకటి మాత్రం తెల్సు! ఇతని నాకు సిటుకొట్టాగు!"

"సరిగ్గా చెప్పు ఏడవరా!" విసుక్కున్నారు కరణంగారు.

"పోనీ కులం తెల్సా?" అడిగారు దొరగారు.

"ఆ తెల్సు!"

"ఏ కులం?"

"షెడ్యూల్డ్ కాస్ట్!"

"ఆఁ" నోరు వెళ్ళబెట్టారంతా.

"నీకెలా తెల్సురా! సరిగ్గా చెప్పు!"

కొడుకుమీద కసరుకొన్నారు కరణంగారు,

చెప్పడం మొదలుపెట్టాడు వేణు.

"క్రిందటివారం నేను హైదరాబాద్ ఇంటర్వ్యూకి వెళ్లానా?"

"అవును!"

"ఆ యింటర్వ్యూకి యితనుకూడా వచ్చాడు! ఇతనిది క్రిష్ణాజిల్లాలోని ఏదో వూరు చెప్పాడు జ్ఞాపకంలేదు!"

"కులంకూడా చెప్పుకొన్నాడా?"

విసుక్కున్నారు డాక్టరుగారు. అన్నయ్య చికాకును గమనించి నెమ్మదిగా చెప్పడం మొదలుపెట్టాడు. అంతా ఆసక్తిగా వింటు న్నారు.

ఇంటర్వ్యూకి కాండేట్సుమంతా వరసగా కూర్చున్నాం. ఇతను నా పక్కనే కూర్చు న్నాడు అప్పుడు చెప్పాడు. తనది క్రిష్ణా జిల్లాలో ఓ గ్రామమనీ, షెడ్యూల్డు కాస్టువాడి ననీ, తనకు తప్పకుండా ఉద్యోగం వస్తుందనే ఆశతో వున్నానని చెప్పాడు పాపం ఉద్యోగం యింకా రాలేదు కాబోలు!" అని ఆగి జాలిగా శవంపైపు చూసాడు.

"వాడే వీడని గ్యారంటీ ఏమిటి?"

ఆరా తీయబోయారు మున్సబుగారు.

"నిశ్చయంగా అతనే! కావలిస్తే చూడండి! ఇతని కుడిచేతి చిటికెన వేలు తెగి మొండిగా వుంటుంది! వేలు ఎలా తెగిందని అడిగా. అప్పుడు తన కుటుంబ పరిస్థితినంతా చెప్పు కొన్నాడు. అతని తండ్రి బజారులో చెప్పులు కుట్టుకొని రోజుకి రెండూ మూడూ సంపాదిస్తూ వుంటాడుట. మనకి చదువు లెందుకురా కుల




వృత్తి చెప్పులు కుట్టుకొని బదుకుదాం అనే వాడట. తనకి చదవుకోవాలని వుండేదట! తల్లి ప్రోత్సాహంతో ఎస్సెల్సీ వరకూ చదివాడుట బెజవాడలో ఆ తర్వాత ఉద్యోగం కోసం తిరుగుతున్నానని చెప్పాడు. తండ్రి కుటుం బాన్ని బాగా చూసేవాడు కాదుట అతనికి తాగుడు అలవాటు వుందిట. ఓనాడు బాగా తాగి వచ్చి అన్నం పెట్టలేదని పెళ్లాం మీదికి కత్తితో వురికాడుట తల్లిని కాపాడ్డానికి అడ్డుగా వెళ్ళి తండ్రితో తలపడ్డాడుట. అప్పుడే అతని కుడిచేతి చిటికినవేలు తెగిపోయిందన్నాడు! ఇప్పుడు చూడండి. అతని చిటికెనవేలు మొండిగా వుంటుంది

అంతా పరీక్షగా చూశారు. చిటికెనవేలు మొండిగా వుండటం గమనించారు

"అయితే కిడజాతివాడన్నమాట!"

పైకే గట్టిగా అన్నారు వెంకన్నదొరగారు.

"బాబూ! ఎండలో వచ్చారు! ఉదయం నుంచీ భోజనంలేదు యింటికి పదండి!"

పిల్లల్ని యింటికి పంపేయాలని తాపత్రయ పడ్డారు కరణంగారు.

కిష్టంనాయుడు అందరిలోకీ వచ్చాడు. "బాబు తమరెళ్ళి రండి! నేనిక్కడనే వుంటా!" అన్నాడు ధైర్యంగా.

ఒక్కొక్కరూ కదల నారంభించారు.

"మున్సబూ! ఈ గ్రామానికి అధికారివి నీవు! ఈ అనాథ శవానికి సంస్కారం చేయించే బాధ్యత నీదే!" అంటూ కదిలారు ప్రెసిడెంటుగారు.

అందరూ పోగా మున్సబుగారూ, కరణం, తలారి రాముడూ మాత్రం మిగిలారు. క్రిష్టం నాయుడు కొంచెం దూరంలో నిలబడి అంతా గమనిస్తున్నాడు. నిప్పులమీద నిలబడ్డట్లుగా ఫీలయారు కరణంగారు.

"మున్సబుగారూ! నేవస్తా! అబ్బాయి పట్నం నుంచి యిప్పుడే వచ్చాడు!" అంటూ కరణంగారు కూడా కదిలారు.

"ఒరేయ్ రావుడూ! మనకి తప్పదు! మరో నలుగుర్ని పిల్చి పీడ్ని తగలెట్టండి, పెద్దచెరువు

గట్టుమీద ఎండిన తుమ్మచెట్టుంది, దాన్ని కొట్టి తగలేయండి!"

తలారి రావులుకి పురమాయించి మున్సబు గారూ జారుకొన్నారు.

మున్సబుగారు దూరంగా వెళ్ళాక విసుక్కొన్నాడు రావులు.

"ఈయన మనుషుల్ని తీసుకొని రమ్మంటారు! ఎవరూ రానంటారు!" అని ఒక్క నిమిషం ఆలోచించి బయలు దేరాడు.

అందరూ వెళ్ళాక పది మంది యువకులు వచ్చి కృష్ణంనాయుడ్ని కలిసారు. వారిని శవం దగ్గర వుండమని బయలు దేరాడు క్రిష్ణం నాయుడు తిన్నగా కరణం గారింటికి వెళ్ళి వీధి గుమ్మంలో నిలబడ్డాడు

డాక్టరుగారూ, తమ్ముడూ బయటకు వస్తూండగా,

"వూళ్ళో పెద్దలు చూసుకొనే విషయాలు మన కెందుకురా బాబూ! పొద్దుట్నుంచీ భోజనం చేయలేదు!"

వారించింది తల్లి.

తల్లిమాటలు వినిపించుకోకుండా వారు గుమ్మం దాటుతూండగా,

"ఎక్కడికిరా వెళ్తున్నారు?"

నిలదీసాడు తండ్రి,

"శవదహనానికి ఏర్పాట్లు చేయాలిగా! వెళ్తున్నాం!"

ఆయేర్పాట్లన్నీ మున్సబుగారు చేస్తున్నారు! మీకేం సంబంధం లేదు! ముందు స్నానాలు చేయండి! శవాన్ని తాకారు!"

అధికారంతో కేక లేసారు.

"హుం శవాన్ని తాకితే స్నానం చేయాలి! హరిజనులను ముట్టుకుంటే స్నానం చేయాలి. అలా అయితే నా వృత్తిలో నిమిష నిమిషానికీ స్నానంచేయాలి నాన్నగారూ! ఈ అస్పృశ్యత అన్నది నా వృత్తికి సరిపడదు! జాతి మత కులాలతో ప్రమేయం లేకుండా సర్వ మానవాళికి సేవచేస్తానని మెడికల్ కాలేజీలో ప్రమాణంచేసి బయటకు వచ్చా! ఈ విషయంలో నా నిర్ణయం మారదు! నా వృత్తికి ద్రోహం చేయలేను నానగారూ!

"నీ వింత భ్రష్టుడవై పోతావని అనుకోలేదురా!"

కొడుకు మీద గద్దరిమారు

"మేం చదువుకొనే రోజుల్లో ఎన్నో


# జ్యోతి కొత్త చిరునామా

"జ్యోతి" కార్యాలయం ఇప్పుడు హైదరాబాద్‌లో పని చేయటం ప్రారంభించింది, జ్యోతితో అన్ని ఉత్తర ప్రత్యుత్తరాలూ కింది చిరునామాతో జరుపవలసిందిగా కోరుతున్నాము,

—ఎడిటర్

**జ్యోతి**

సచిత్ర మాస పత్రిక

1-8-4/1/1, చిక్కడపల్లి

హైదరాబాదు—500020

ముఖ్య గమనిక : ఏజంట్లు డ్రాఫ్టులు, మనియార్డర్లుకూడా ఈ కొత్త చిరునామాకే పంపాలి.




శవాల్ని కోసి చూశాం! అవి ఏ కులానికి చెందినవో తెలీదు! అది మా కనవసరం. అందరి శరీరాలు ఒక్కలాగే వుంటాయ్. స్నానం చేయమని మీరెప్పుడూ దండించలేదు. స్నానం రెండుపూటలా చేస్తాను. కానీ మీ రన్నట్టు వారినెవరినో తాకినందుకూ మాత్రం కాదు, శవాల్ని ముట్టినందుకూ కాదు! శరీర పరిశుభ్రత కోసం! ఆత్మ శుద్ధిలేని ఆచారం ఎందుకు చెప్పండి?"

"నీవెన్ని చెప్పు! వాడి శవ దహనానికి మీరు హాజరు కావడానికి వీల్లేదు!"

తండ్రిగా శాసించారు.

"హరిజనులనీ, అంటరానివాళ్ళనీ తోటి మానవులను కించబరచటం, నీచంగా చూస్తూ దూరంగా వుంచటవూ మానవత్వం అనిపించు కోదు నాన్నగారూ?"

అన్న రెండో అబ్బాయి మాటలకి మ్రాన్పడి పోయాడు తండ్రి.

"ఏరా? ఈ రోగం నీకూ అబ్బిందా?"

చిన్నకొడుకును గద్దించారు.

"మా ఆశయం మీకు రోగంగా తోస్తే మేం చేయగల్గిందేమీలేదు నాన్నగారు!

అంతలో కృష్ణమాచార్యులుగారు అడుగు పెడుతూ "ఏవిటి రఘుబాబూ! పెద్దగా ఉప న్యాసం దంచేస్తున్నారు!" అడిగారు ఆశ్చర్యపోతూ.

"ఆచార్యులుగారూ! దయచేయండి! దయ చేసి యీ విషయంలో జోక్యం చేసుకోకండి! అన్నయ్య ఏమైనా అంటే ఆ తర్వాత మీరు బాధపడతారు!" హెచ్చరించాడు రెండో అబ్బాయి వేణు.

"చూడండి ఆచార్యులుగారూ! మేం చేయ బోయే ఈ అంత్యక్రియలు ఒక అభాగ్యుని శవానికి కాదు! ఈ సంఘంలో గూడు కట్టు కొని వున్న అంటరానితనానికి.

డాక్టర్ రఘు మాటలుకూడా విన్న ఆచా ర్యులుగారు అవాక్కయిపోయారు. ప్రతిమలా నిలబడి వుండిపోయారు.

అన్నదమ్ములిద్దరూ బయటకు వెళ్తుంటే గుడ్లప్పగించి చూస్తూ వుండిపోయారు కరణం గారు...

"ఇదంతా కిష్టంనాయుడి ప్రోత్సాహంలా వుంది! బయట నిలబడ్డాడు!"

అన్న ఆచార్యులుగారి మాటలు విని ఆలో చనలో పడ్డారు కరణంగారు.

"రండి సార్! దహనానిక్కి ఏర్పాట్లు చేస్తున్నాం!"

ఆ అన్నదమ్ములిద్దర్నీ ఆహ్వానించాడు

కిష్టంనాయుడు.

అంతలో రావులు మరో నలుగుర్ని వెంట బెట్టుకొని వచ్చాడు అక్కడకి

"తమరు తప్పుకోండి బాబూ! మేం తీసు కెళ్ళి దహనంచేస్తాం!" అడ్డుతగిలాడు రావులు.

అడ్డు తొలగలేదు కిష్టంనాయుడు.

రావులూ మీలో మీకే చిన్నచిన్న విభేదాలు వున్నాయ్! మీలో కులాలు వేరు, జాతులు వేరు! ఒకరింటిలో ఒకరు అన్నాలు తినరు! ఒకరికి ఒకరికి సంబంధం లేదంటారు. మీరే ఒకర్ని ఒకరు కించపరచుకొంటారు! అది మీలో వున్న బలహీనత! అదే ఐకమత్యం లేకపోవడం"

కిష్టంనాయుడి మాటకి సిగ్గు పడిపోయాడు రావులు. "చిత్తం! ఇకమీదలా వుండమండి!" అన్నాడు.

"తమరు తప్పుకోండి బాబూ! అర్థించాడు మరొకడు.

కిష్టంనాయుడు ఒప్పుకోలేదు.

"మీ జాతివాడికి మీరు చేసుకోవడంలో ఏముందిరా? అనాథప్రేత సంస్కారం కానే ముక్తి మోక్షమూ వున్నాయ్!"

అడ్డు తగిలాడు మున్సబుగారబ్బాయి పెద బాబు.

"మొదట్లోనే మీరు తచ్చాడకుండా వచ్చి వుండాల్సింది!" అన్నాడు కిష్టంనాయుడు.

యువకులంతా శవాన్ని రల్చడానికి వుపక్రమిస్తూవుంటే ఆఖరి సారిగా బ్రతిమా లాడు రావులు.

"మీరీపని చేశారంటే గ్రామ పెద్దలు మమ్మల్ని బతకనీయరు బాబూ! పొరపాటయింది క్షమించండి బాబూ!"

"మీకేం భయంలేదు! మేంవున్నాంగా!"

భరోసాయిచ్చాడు ప్రెసిడెంటుగారితమ్ముడు రామన్నదొర.

"ఇంతకీ అతని జేబులు తనిఖీచేసిచూశారా? ఏమైనా వివరాలు దొరుకుతాయేమో!" అడి గారు డాక్టరుగారు.

"ఏదిబాబూ! వాణ్ణిముట్టుకుందుకే అందరూ భయపడి పోయారు! నే చెబుదామనుకొన్నా గానీ నామాట పడ నిచ్చేరు గారు!" చెప్పాడు కిష్టంనాయుడు

పెదబాబు చొరవచేసుకొని జేబులు తనిఖీ చేసి కొన్నిచిల్లర డబ్బులు మాత్రం బయటకు తీశాడు!" అతని ఆ చూకీ తెలిపే కాగితాలు ఏమీ దొరకలేదు.

"దురదృష్టవంతుడు," అన్నారు డాక్టరు గారు.

శవాన్ని ఎత్తుకొన్నారు నలుగురు. ముందు డాక్టరుగారూ, వారితమ్ముడు వేణూ నడవగా వెంట అంతా బయలుదేరారు శ్మశాన వాటికకు.

కొంతదూరం వెళ్లాక వెనక్కు తిరిగిచూశాడు కిష్టంనాయుడు. తానూహించనంత జనం తరలివస్తూ వుండటంతో ఆనందోత్సాహాలు వెల్లువిరిసాయ్ అతనిలో.

"మనగ్రామ ప్రజల్లో మానవత్వం లేదు అనుకొనే వాణ్ణి! చూడండి బాబూ! వెనుకఎంత మంది వస్తున్నారో!" ఆశ్చర్యపోతూ డాక్టరు గారితో అన్నాడు

డాక్టరుగారు కూడా ఆ జనాన్ని చూసి ఆశ్చర్యపోయారు

అంతా శ్మశానవాటిక చేరారు

డాక్టరుగారూ, మున్సబుగారబ్బాయి, పెద బాబూ, కిష్టంనాయుడూ స్వయంగా చితి పేర్చారు. చితికి అగ్ని ముట్టించాడు వెంకన్న దొరగారబ్బాయి కొంత సేపటికి దహనకాండ పూర్తయింది

ఆ శ్మశానానికి ఆనుకొని వున్న చెరువులో దిగి అంతా స్నానం చేయసాగారు.

చెరువు గట్టుమీద నిలబడి వున్న తలారి రావులు గట్టిగా కేకేసాడు, ఆనందంలో.

"డాక్టరు బాబూ! అటు చూడండి. ఎవ రెవరు వస్తున్నారో!"

అంతా అటువైపుచూశారు. తమకళ్ళను తామే నమ్మలేపోయారు

ఆచార్యులుగారూ, కరణం గారూ, మున్స బుగారూ, ప్రెసిడెంటుగారూ తదితరగ్రామ పెద్దలూ శ్మశానానికి తరలి వస్తున్నారు. పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ నదీనాం సాగరో గతిః!



# మగబుద్ధి

కె.వి యల్. నరసింహశాస్త్రి

మినీ కథ

వెంట పడి తిరుగుతాడు.

ఎప్పుడన్నా యథాలాపంగా వెనక్కి తిరిగితే, ఎటో చూస్తుంటాడు.

ఎక్కడికి పోయినా వదిలిపెట్టడు.

ఏమిటో గురుడి గొడవ?

తెలుసుకుంటే పోలా?

తెలుసుకుందాం!

ఎలా?

నవ్వాలి!

ఓస్, నవ్వేద్దాం.

కొంచెం చొరవ చేశాడు.

"అలా పార్కుకి వస్తారా" అన్నాడు.

"పదండి" అంది తను.

ఏమిటేమిటో చెప్పటం మొదలుపెట్టాడు.

"శంకరాభరణం" ఇరవయ్యారు సార్లు చూశాట్ట.

హీరో కృష్ణంటే ప్రాణంట.

వాళ్ళ అమ్మమ్మ ఆవకాయ బాగా చేస్తుందట.

అలా రోజూ పార్కులో కలుసుకుని ఏదేదో చెప్పేవాడు తనకి. తను వింటుండేది. ఇవి చెప్పుకునేవాళ్ళు దొరక్కనే తన వెంట తిరిగాడా?

చాలా అన్యాయం.

ఈ బోరు భరించటం తనవల్ల కాదు.

"సినిమాకు వెళదాం రండి" అన్నాడు ఓ రోజున.

"అలాగే" అంది తను.

ఇంటర్వెల్ లో డ్రింకు, పాప్‌కారన్....

వక్కపొడికూడా కొనుక్కోనీ లేదు.

ఎగ్జిబిషన్‌కి—

అందులో జెయింట్ వీల్....

ఒకే సీటులో కూర్చుని పైనుంచి కిందకి, కిందనించి పైకి—

ఓ సాయంకాలం—

పార్కులో అందమైన జంటలు బహు అందంగా, బలవంతంగా చల్లని గాలి అనుభవిస్తున్న కాలం ..

హృదయాన్ని విప్పుతున్నా నన్నాడు.

విప్పాడు.

"నేనింతవరకు చాలామంది ఆడవాళ్ళని చూశాను. పరిశీలించాను. కాని మీలాంటి స్త్రీని నేనెప్పుడూ చూడలేదు మీరు స్త్రీజాతిలో మణిరత్నం. మీకు అందమైన మనసుంది. మిమ్మల్ని మనసారా ప్రేమిస్తున్నాను. నా ప్రేమను అంగీకరించి నన్ను కరుణించండి. జన్మ జన్మలకీ నా ప్రేయసి మీరే, ఈ దాసుడు మీవాడే" అన్నాడు.

నవ్వుతూ చూసింది తను.

"తొందరేం లేదు. మీరూ ఆలోచించుకునే చెప్పండి," అంటూ పోజు పెట్టాడు.

మర్నాడు తను హృదయం విప్పింది.

"నాకు ఇంతవరకు పరిచయమైన మగవారిలో మీలాంటివారి నెప్పుడూ చూడలేదు. మీరు మగజాతిలో మేలిమి బంగారం. మీలాంటి ఉదారహృదయులు అరుదు. మీకు అందమైన హృదయం ఉంది. మీ ప్రేమను మనసారా అంగీకరిస్తున్నాను. ఏడేడు జన్మలకీ నా దైవం మీరే. ఈ పాదదాసికి మీ గుండెలో ఇంత చోటివ్వండి" అంది తను.

ఏదోలా చూశాడు.

వెర్రినవ్వు నవ్వాడు.

"ఇంక పోదామా" అన్నాడు.

మామూలుగా విడిపోయే చోట

రోజూ చెప్పే పురాణం చెప్పలేదు.

కొత్తమాట అన్నాడు.

"గుడ్‌బై"—

ఆ తర్వాత,

వెంటపడి తిరగటం లేదు.

వెనక్కి తిరిగి చూసినా, వాడు పత్తాలేడు.

వాడు చెప్పినదానికి తనేమీ భిన్నంగా చెప్పలేదే? వాడన్నట్లే తనూ అన్నది.

ఏమిటి వాడి బుద్ధి?

ఓ నవ్వు నవ్వుకుని సాగిపోయింది తను. *



మీరా అది అందుకోలేదు- మొహం తిప్పేసుకుంది.

“బాబుకి- అరుణ కూతురికి తీసుకుంటూ చిన్న గొలుసు తీసుకున్నాను- తీసుకో మీరా!”

"అలాంటివి అలవాటు లేదు-అక్కరలేదు" ఇటు తిరక్కుండానే అంది. నెమ్మదిగానే అన్నా చాలా ఖచ్చితంగా అంది.

"ప్రతి దానికీ అలవాటు వుంటేనే చేస్తామా? దీనిని ఇంకోవిధంగా భావించుకోవద్దు-అరుణ కూతురుతో బాటు సర్దాగా కొన్నాను-కాదనవద్దు మీరా! తీసుకో!" ప్రాధేయ పడుతున్నట్టుగా అన్నాడు.

"ఎక్కడ సంపాయించుకొచ్చావు అని మా అమ్మ అడిగితే ఏమని చెప్పమంటారు!-అయినా తిండికోసం వంట పని చేసుకునే వాళ్ళకి నగలూ నాణ్యాలూ ఎందుకు?....మీ ఇంట్లో వంట మనిషిగాజేరినా ఇంకా మీ కక్ష తీరనట్టుంది-మీ నగలకీ-మీకూ వేయి నమస్కారాలు-మమ్మల్నిలాగయినా బ్రతకనీయండి" గబ గబా నాలుగూ అనేసి వడివడిగా ఎవరో తరుముకొస్తున్నంత వడిగా వెళ్ళిపోయింది మీరా.

నిర్విణ్ణుడయినట్టుగా నిలబడి పోయాడు శేఖరం.

'హుం! కక్ష! మీరా అంటే-బాబు అంటే తనకి కక్ష! కక్షతోనేనా తనింత ఆవేదన చెందుతున్నది! ఒక తప్పుకి ఇంత శిక్ష! స్త్రీ కరుణామూర్తి అంటారే-క్షమాహృదయురాలంటారే! - ఓ! ...మీరా! మొదటినించీ నన్నేదో వింతగా బాధిస్తూనే వున్నావు. ఆఖరికి దోషిగా నన్ను నిలబెట్టావు ... ..."

తన పక్కనే స్కూటరు ఆగటంతో ఉలిక్కిపడ్డాడు శేఖరం.

"ఏమిటి! రోడ్డుమీద నిలబడే నిద్రపోతున్నావా?" రెడ్డి నవ్వుతూ ప్రశ్నార్థకంగా శేఖరం కేసి చూస్తూ అన్నాడు.

శేఖరం వెంటనే వెనకాల కూర్చుంటూ "పోనీ" అన్నాడు.

స్కూటరు స్టార్టయింది.

"ఏమిటలా నిలబడ్డావ్" అని అడిగాడు రాఘవరెడ్డి.

"నీ కోసమే!" జీవం లేని నవ్వు నవ్వేడు.

"నేను నమ్మద్దూ!"

"బట్టల కొట్టులోకి వెళ్ళేన్లే! అక్కడ ఆడ మళయాళం చాలా వుంది. సరే తర్వాత వెళ్ళచ్చని అక్కడ నిలబడ్డాను."

"మరి చెప్పవేం?" స్కూటరు ఆపు చేయబోయాడు.

"ఒద్దు పోనీ! రేపు వస్తాను" అన్నాడు శేఖరం.

ఆ రాత్రి శేఖరానికి కంటిమీదకి నిద్రన్న మాట రాలేదు. రాత్రి పదిన్నర వరకూ మూర్తి ఏవో కబుర్లు చెప్తూనే ఉన్నాడు. శేఖరం బలవంతంగా దృష్టి ఇటు మళ్ళించుకుని "ఊం" కొడుతూనే ఉన్నాడు. కాని అతని ధ్యాసంతా మీరా - బాబు మీదే వుంది. "మీరా ఎంత అదృష్టవంతురాలు" అనుకున్నాడు. "ఇంటికెళ్ళగానే తనవల్ల కలిగిన కోపం చిరాకూ మర్చిపోతుంది. బాబునెత్తుకుని హాయిగా ముద్దాడుతుంది. తను తీసుకెళ్ళిన చొక్కా తొడుగుతుంది-గర్వంగా నవ్వుకుంటుంది-

తల్లిని చూసి హాయిగా నవ్వుతాడు బాబు-అప్పుడు మీరా తన బాధనంతటినీ మర్చి పోయి హాయిగా నవ్వుతుంది ..." ఇలా వూహించుకుంటూ తనకి తెలియకుండానే శేఖరం తను కూడా ఆ వూహలోకి వెళ్ళిపోయాడు-"అప్పుడు మీరా మొహం చిట్లించుకోదు-కోపంగా చూడదు-కొన్నాళ్ళు వూరికెళ్ళి వచ్చినట్లు "వచ్చేశారా!" అన్నట్లు కళ్ళతోనే పలకరిస్తుంది. ప్రేమతో దగ్గరగా వచ్చి బాబుని అందిస్తుంది. వాడు ఎగిరి పడ్డట్టు మీదకొచ్చి అల్లరి చేస్తాడు-మీరా వాడిని తీయబోతుంది-వాడు తన దగ్గరనుండి వెళ్ళనని మొరాయిస్తాడు. తను "ఉండనీ" అంటాడు ...

○ ○ ○

మర్నాడు ——

తెల్లవారేటప్పటికి వచ్చేసింది మీరా. ఇంత పొద్దున్నే ఎందుకూ అంటూ గొడవ చేసింది కాంతమ్మ "అరుణ పదింటికే వెళ్ళిపోతుంది" అని చెప్పి వచ్చేసింది.

అప్పటికే కాఫీకి నీళ్లు పెట్టింది శాంతమ్మ గారు. శేఖరం వంట గదిలోనే స్టూలుమీద కూర్చుని తల్లితో మాట్లాడుతున్నాడు.

మీరా గుమ్మం దగ్గిరే ఆగిపోయింది. మీరా వచ్చినట్టు శేఖరం చూడలేదు.

"రా ఫరవాలేదు" తల్లి అనటంతో మెడ తిప్పి చూశాడు.

మీరా తలొంచుకుని స్టౌవ్ దగ్గరకి వెళ్ళింది శేఖరం ఇవతలకి వచ్చేశాడు.

అరుణ లేచాక అడిగింది "నిన్న చెప్పకుండా పారి పోయావేం? ఇంకా వున్నా వనుకున్నాను"

"బాగుంది! మీరు బయటకి నడవండి నేను అరుణ దగ్గర కూర్చుంటాను అని మీవారికి చెప్పిరానా? అంది నవ్వుతూ.

"ఛ! ఎంతసేపు కూర్చుంటారు? నేను అమ్మని అడిగితే ఇప్పుడే వెళ్లా వని చెప్పింది .

"బాగుంది! ఎంతసేపు కూర్చుంటారో నాకేం తెలుసు?"

"నిన్నూ ఇలా ఏడిపించే రోజు రాకపోతుందా! అంటూ మీరా భుజం మీద చేయివేసి, "మీరా! ఎప్పుడు పిలుస్తావు నీ పెళ్ళికి" అంది.

మీరా ముఖం తిప్పుకుంది

"నిన్నే! మాట్లాడవేం?" రెట్టించింది అరుణ.

"అసలు చేసుకోను".

"అంతా ఇలాగే అంటార్లే".

"నే నందర్లాకాదు - అయినా ఇదేమిటి! పొద్దున్నే ఈ గొడవ ఎత్తావు? .... పాప లేవలేదా!"

వెనకా, ముందూ తనకెవరూలేరు-అందుకే మీరా అలా మాట్లాడుతోంది. తనకి పెళ్ళి అవుతుందన్న నమ్మకం మీరాకి లేదేమో! అనుకుంది అరుణ.




అరుణ అక్కడ నించి వెళ్తూ అంది "నీకు పని అయ్యాక ఒక్క పావు గంట నా దగ్గర కూర్చో మీరా - కాస్సేపు మాట్లాడుకుందాం".

"ఇక్కడే కూర్చోరాదూ! ఇంకా ఎక్కువసేపు మాట్లాడుకోవచ్చు."

"అలా కాదులే! అలా ఎంతసేపు మాట్లాడుకున్నా మాట్లాడుకున్నట్టు వుండదు. వస్తావా?"

"అలాగే" అంది మీరా.

మీరా వంట అయేసరికి పదకొండు అయింది.

మూర్తి, శేఖరం ఇప్పుడప్పుడే భోజనాలు చేయమన్నారు.

వాళ్ళు భోజనాలకి వచ్చేవరకూ మీరాకి ఖాళీయే.

మీరా అరుణ గదిలోకి వచ్చింది.

అంతక్రితం రోజే అన్నీ సర్దుకున్నా మళ్ళీ ఏదైనా మర్చిపోయానా అని గుర్తు చేసుకుంటోంది అరుణ.

"పని అయిపోయిందా!" అడిగింది అరుణ.

"అయింది. ఇంకా సర్దుకోవటం అవలా?"

"అయిందిలే! ఏదేనా మర్చిపోయానేమోనని చూసుకుంటున్నాను. కూర్చో మీరా" అని తనూ మంచంమీద కూర్చుంది. పాప నిద్రపోతోంది.

"మీరా! ఉత్తరాలు రాస్తావా? లేకపోతే వాళ్ళేమైనా అనుకుంటారని మానే

స్తావా" మీరా చేయి తన చేతిలోకి తీసుకుంటూ అడిగింది అరుణ.

మీరాకి అక్కడకి ఉత్తరాలు రాయటం ఇష్టం లేదు అలా అంటే అరుణ ఒప్పుకోదు. అందుకే అంది "ఎందుకు రాయను అరుణా!"

"మీరా! అన్నయ్య నీకు ఉద్యోగం చూస్తానన్నాడు-వెనక అన్నయ్య అన్న మాటలు మనసులో పెట్టుకోకు ..."

"ఇప్పుడా సంగతులు ఎందుకు అరుణా! నేనేదేనా ఎప్పుడేనా అన్నానా?" శేఖరం మాట చెప్తేనే మీరాకి ఇబ్బందిగా వుంటుంది

"అది కాదు. ఉద్యోగం వస్తే తప్పకుండా చేరు. అసలు నువ్వు పైపు పరీక్ష పాసయి వుంటే ఈపాటికి ఆ ఉద్యోగం వచ్చేసేది."

"పోనీలే అరుణా!

మీరా తన పక్కన పెట్టిన పొట్లం తీసింది. చిన్న పొట్లం విప్పి ఉంగరం పాప చేతికి తొడుగుతోంటే "ఏమిటి మీరా! ఎందుకూ?" మందలింపుగా అంది

"నా సరదాకి పాపకిచ్చేను - నువ్వేం అభ్యంతరం చెప్పద్దు" అని గౌను లున్న పొట్లం అరుణకిచ్చింది.

"బాగుంది మీరా! అంత ఇబ్బందుల్లో వుండి ఇవన్నీ కొన్నావా! . "

మధ్యలోనే అంది మీరా "ఇప్పుడేమీ కొనలేదు అరుణా! నా చిన్నప్పటిది-బామ్మ నాకు చేయించిందట- గౌన్లు తీసుకున్నానంతే."

అరుణ ఇంకేమీ అనలేదు లేచి పెట్టెదగ్గరకెళ్ళి నురు నిముషానికి తిరిగి వచ్చి, "నువు కళ్ళు మూసుకో!" అంది.

పాప చేతులు సున్నితంగా బుగ్గకి తాకించుకుని పాపనే చూస్తున్న మీరా "ఏమిటి ఎందుకూ?" అంది ఇటు తిరుగుతూ

"ముందు కళ్ళు మూసుకో!" చెయి వెనక్కి పెట్టుకుని అంది అరుణ

"ఏమిటి?" ఏమిటో అర్థంకాక అడిగింది మీరా

"ఉఁహూ! చెప్పను. ముందు కళ్ళు మూసుకో!"

"సరే!" అని కళ్ళు మూసుకుంది మీరా.

"నేను "తెరు" అనేవరకూ తెరవకూడదు "

"ఏమిటో అంత ..." అంటూ కళ్ళు తెరవబోయింది.

"అదిగో! అప్పుడే తెరుస్తున్నావు-మూసుకో!"

"సరే! తొందరగా" అంటూ మళ్ళీ గట్టిగా మూసుకుంది మీరా

అరుణ-మీరా కుడిచేయి తన చేతిలోకి తీసుకుని "నేను చెప్పేవరకూ తెర వద్దు" అంటూ నడుమ వేలికి ముచ్చటగా మూడు ముత్యాలున్న ఉంగరం తొడిగింది.

"ఏమిటిది?" కంగారుగా కళ్ళు తెరిచింది మీరా

"ఇంకా నేను "ఎస్స్" అనకుండానే. "




అదేం వినిపించుకున్నట్టు లేదు మీరా "ఏం పని అరుణా! ఇది...."

"ఇంక నువ్వేం మాట్లాడకు" అని పెట్టి దగ్గర కెళ్ళి పాకెట్టు తీసుకొచ్చింది

"ఇదిగో మీరా! నీకూ నాకూ ఒకే రకం చీర తీసుకున్నాను. తీసుకోకపోతే ఒట్టే!"

"ఇవన్నీ ఏమిటే! అంటే పాపకి ఇచ్చింది బదులు తీర్చేస్తున్నావా?"

"అదేం మాట మీరా! నేను మా అమ్మ ఒచ్చేకా ఈ వూరు వచ్చేటప్పుడు- అప్పుడు నీకు మంచి ప్రజన్ టేషను చేయాలనుకున్నాను - సరే నువు చెప్పా పెట్టకుండా వుడాయించేశావు".

మీరా ముఖం దించుకుంది -

"అప్పుడు నువు నా పుట్టిన రోజుకిస్తే నేను తీసుకోలేదూ! అవే అవమానం చూసుకునేదాన్ని తెలుసా?"

మీరా వేలినున్న వుంగరం తీయబోయింది. అరుణ తీయనీయలేదు. మీరాకి ఆ వుంగరం తీసుకోవటం సుతరామూ ఇష్టంలేదు.

అది అరుణకి ఎవరిచ్చేరో మీరా మర్చిపోలేదు.

"నువు బాధపడకుండా చీర తీసుకుంటాలే అరుణా! ఇది మాత్రం తీసుకోలేను" మళ్లా తీయబోయింది.

అరుణ మీరాని తీయనీయకుండా ఆ చేతిని తన చేతిలోకి తీసుకుంది. "మీరా! ఇచ్చింది మళ్ళా తీసుకుంటారా! ఆయితే పాప కిచ్చిన వుంగరం - నా కిచ్చిన పెన్నూ కూడా తీసేసుకో!"

"అదేమిటి! ... ఇది నీకు పుట్టిన రోజున - ఇచ్చిందని ...."

"అవును! ఆ వుంగరం నాకు మీ బామ్మ ఇచ్చింది - రేపు నీకు పెళ్ళయి పిల్లలు పుడితే వాళ్ళకి పెట్టుకోవచ్చు - ఆ పెన్నుతో మీ శ్రీవారికి ఉత్తరాలు రాసుకోవచ్చుగా!".

"మీరా మాట్లాడలేదు"

మళ్ళా అరుణే అంది "అప్పుడు ఏమన్నావు మీరా! మర్చిపోయావా! నువ్వంటే మీ బామ్మకి చాలా ఇష్టమని - నువు పి. యు. సి. పాసయి నప్పుడు ఆ పెన్ను ఇచ్చేరనీ - నేనంటే నీక్కూడా అంత ఇష్టమనీ - అందుకే ఇది ఇస్తున్నా ననీ కాదనవద్దన్నావు గుర్తుందా!".

".. . ..."

"నేనంటే అన్నయ్యకి ప్రాణం - నువ్వంటే నాకూ - "వుంగరం తొడిగిన చేతిని ముద్దు పెట్టుకుని "అంత ఇష్టం" అంది.

"క్షమించు అరుణా! అసలు పుట్టిన రోజునాడు ఇచ్చింది ఎవరికీ ఇవ్వ కూడదు - నువ్వేమనుకున్నాసరే నేను తీసుకోను".

"అన్నయ్య ఇచ్చిందనా, మీరా!" మీరానే పరీక్షగా చూస్తూ అడిగింది.

"అదేం కాదు".

"మరయితే మాట్లాడకు. నువ్విచ్చేసే పక్షంలో నువ్వు ఇచ్చినవి తీసేసుకో!"

వేలిన వుంగరం అలా చూస్తోంటే చేతికి సర్పం చుట్టుకున్నట్టుగా వుంది మీరాకి, వేలి నుంచి వుంగరం తీయబోయింది. మళ్ళా అరుణ తీయనీయలేదు.

"పర్సులో దాస్తారే అరుణా!"

"పర్సులో దాచుకోవటానికి కాదు ఇచ్చింది. ఎప్పుడూ ఇలా వేలికే వుండి అనుక్షణం నేను గుర్తుండాలి" అంటూ మీరా భుజం మీద గడ్డం ఆన్చుకుంది.

"నువ్వెప్పుడూ గుర్తుంటావు".

"ఆః! అందుకేగా పాపం! కట్టలు కట్టలు ఉత్తరాలు రాశావు!".

"ఎందుకో చెప్పాగా?"

"ఇప్పుడు రాయకపో చెప్తాను .... ... తప్పకుండా రాస్తావు కదూ!"

రాస్తానన్నట్లు తల వూపింది.

"బుర్ర వూపటం కాదు - నోటితో చెప్పు!"

ఇప్పుడు నేను అరిచే నంటే పాపలేస్తుంది".

"అరవమని ఎవరన్నారు? మాటగా చెప్పు".

మీరా ఏదో అనబోయింది. శేఖరం ఆ గదిలోకి రావటంతో వుంగరం వున్న చెయ్యి దాచేసుకుంటూ లేచి నిలబడింది. అలా నిలబడటంలో ఒళ్ళో వున్న చీర పాకెట్టు జారి కింద పడింది.

"ఏవిటా ఖంగారూ! కూర్చో ఫరవాలేదు" అంది అరుణ. శేఖరం వెనకాలే మూర్తి కూడా వున్నాడు. అతను మీరాని చూసి గుమ్మం దగ్గరే ఆగిపోయాడు.

వాళ్లు లోనికి వస్తేగాని మీరా వెళ్ళటానికి లేదు అక్కడే గోడని ఆనుకుని నిలబడింది.

"ఒస్తే లోపలికి రండి" అంది అరుణ. మీరా ఇబ్బందిగా నిలబడటంచూసి.

మూర్తి, శేఖరం లోపలికి రాగానే మీరా బయట కొచ్చేసింది. మీరా పర్సు అరుణ గదిలో వుండి పోవటంతో వుంగరం తీసి మెళ్ళో వున్న ఒంటిపేట సన్నని గొలుసుకి పిన్నీసుతో పెట్టింది. గుండెల దగ్గర ఆ వుంగరం తగులుతోంటే కంప రంగా అన్పించింది మీరాకి.

మీరా ఇచ్చిన వుంగరం, గౌనులూ చూపించి, తను మీరాకి వుంగరం ఇచ్చిన సంగతి కూడా చెప్పింది అరుణ.

చేయి దాచుకున్నది అందుకా" అనుకున్నాడు శేఖరం అరుణ మీరాకి ఆ వుంగరం ఇవ్వటం సంతోషాన్నే కలగజేసింది అతనికి. పాప వేలికి లూజుగా వున్న ఆ వుంగరాన్ని ఇటూ, అటూ తిప్పుతూ చాలా సేపు చూశాడు. ఇది మీరాది అయుండదు - బాబుదే అయుంటుంది ఏం కొనటానికి వీలుకాక ఇది ఇచ్చేసిం దేమో!" అనుకున్నాడు శేఖరం. "చాలా ఒదులుగా వుంది ఆనక జ్ఞాపకం చేయి దగ్గరగా నొక్కించు కొస్తాను. అసలు మనమే చేయచ్చేమో" అన్నాడు శేఖరం.

"దానికి తొందరేముందిలే పోనీ కొన్నాళ్ళు పోయాక పెడ్తాను" అంది.

"అప్పుడు వీధిలోకి వెళుందని - పోతుందని - అసలు పెట్టరు. అయినా మీ అన్నయ్య చేయించి ఇస్తానంటున్నాడుగా, ఇవ్వరాదూ! మళ్ళీ అక్కడ కెళ్ళగానే నన్ను చంపుతావు" అన్నాడు మూర్తి నవ్వుతూ.

పరధ్యానంగా వున్న శేఖరం మాట్లాడలేదు. మీరా వేలిని ఆ వుంగరం చూడాలని కుతూహలంతో వంటగదికేసి వెళ్ళాడు వెళ్తూ మీరా చేతివేళ్ళకేసి చూశాడు ఏ వేలికీ లేదు "హుం! తనంటే పరమ అసహ్యమయ్యే! ఎలా వుంచుకుంటుంది? అరుణ మనసు బాధ పెట్టడం యిష్టంలేక తీసుకుంది.."
వెనక్కి తిరిగి వచ్చేస్తోంటే "భోజనాలకి వచ్చేస్తారేమిట్రా"—శాంతమ్మగారంది

"మూర్తి ఏమంటాడో" అంటూ వెళ్ళి పోయాడు శేఖరం

(సశేషం)

# పరువు కోసం

## —నిష్ఠల వెంకటరావు

ఇంటర్‌కన్న ఎక్కువ చదివితే ఇక్కడ వుండకండి అంటూ జోగారావు, జగ్గారావులని పొమ్మంది వాళ్ళ వూరు. అక్కడ జూనియర్ కాలేజి దాటి లేదు. జోగ్రావు జగ్రావు అ ఆ ఇ ఈ బడినుండి మిత్రులు.

జోగ్ బి.య్యే, జగ్ బి. కామ్ చదవడం కోసం పెద్దపట్నం వచ్చేరు. వచ్చి దరిదాపు ఊరంతా కలియచూసేరు. వాళ్ళ చిన్నపట్నం ఈ వూరుముందు బాడుకావూరను కున్నారు. బాడుక్కి పట్నంలో రూమ్ తీసుకున్నారు. భోజనం అన్నపూర్ణ హోటలు. అల్పాహారాలు అప్సరా కేఫ్.

జగ్గారావుకి పెద్దపట్నం నీరూ గాలీ బాగా సోకేయి. చదువంటే బి.కామ్ గాని ఇతరత్ర బి.ఏక్టివ్ అయేడు. ఏదో తహతహ ఏదో కుతూహలం, ఎందుకోసమో ఆరాటం. కాటన్ పిల్లో దశ దాటి ఫోమ్ రబ్బర్ స్టేజికొస్తున్నాడు. బజార్లు, ఇంపాలా కార్లు మళ్ళే ఇంపార్టెంటు జంక్షన్లు, ఎలైట్ వీధులు దున్నేస్తున్నాడు. కాని—

సెకెండు టర్ము వచ్చినా (హి యిజ్ వెరీ సారీ) ఒక్క బాల్చి అయినా తగల్లేదు, ఉట్టి గేలమే పైకి వస్తూంది. పెద్దపట్నంలో బకెట్లకి కొదువలేదని ప్రతీతి. బట్? వాటర్ వాటర్ ఎవ్విరి వేర్ బట్ నాట్ ఎ బకెట్ టు పిక్!

రానురాను ఇద్దరు మిత్రులు ఒహర్ని ఒహరు రూమ్‌లో ఉన్నపుడే చూసుకోవడం జరుగతూంది.

జోగారావు బుద్ధిగా చదువుకుంటున్నాడు. కాని జగ్గారావు ఎప్పుడు చూసినా దువ్విన తలే దువ్వడం, స్నోలు రాయడం, పౌడర్లు అద్దడం సెంట్లు పులమడం, ఇన్‌షర్ట్, ఎన్నివేషాలు వెయ్యాలో అన్నీ వెయ్యడం అయినా ఎన్ని చేసినా నైట్ ఆఫ్ ది సారోఫుల్ కాన్టినెన్స్ లాగ ఖిన్నవదనం!

ఓరోజు జోగారావు రూమ్‌కి తిరిగొచ్చే సరికి జగ్గారావు మహావిచారంలో వున్నాడు కుర్చీమీద కాదు, కాట్‌మీద కాదు, కటిక నేలమీద కూర్చున్నాడు గోడకి చేరబడ్డాడు రెండు ముణుకులలో బుర్ర పెట్టుకున్నాడు—

"బేడ్ లక్ బేడ్ లక్" అని గొణిగాడు అప్పుడే వచ్చిన జోగారావుని చూసి

"నీకు ఎప్పుడూ వున్నదే కదరా, ఇవాళ కొత్తేమిటి!" అన్నాడు జోగారావు తాపీగా, ఫిలసాఫిగ్గా.

"లేదుగురూ నిజంగా బేడ్‌లక్ అంటే నమ్ము" కొంచెం విచారం కొంచెం ఆవేశం జోడించి అన్నాడు. ఈసారి కొంపే మునిగి పోయినట్టు. ఇదేదో కొత్తరకం లాగవుంది అనుకుని జోగారావు.

"ఏమయింది అయితే?" అడిగేడు కొంచెం ఆశ్చర్యం నటిస్తూ. జగ్గారావు కథనం మొదలెట్టేడు.........

"నీకు తెలుసుకదా ఆ అమ్మాయిని ఓ మారు సెంటర్లో చూపెట్టేను (?) వైట్‌శారీ రెడ్ బ్లౌజు (?) ఇవాళ మధ్యాన్నం లస్ట్



ఆవదు టోరు కొట్టి మెయిన్ బజారులోకి వచ్చేను. అక్కడ కనపడింది—ఈసారి నీలం శారీ బ్లూ జాకెట్టు బంగర్లడ్డు గూడూ.," ప్రస్తుతం విచార సమయం అయినా ఆ మూమెంట్ కేచ్ చేసే సరికి ఆ కుషారే వచ్చింది.

"అయితే?"

"అయితే ఏంటి, నవ్వేను—నవ్వింది. పలకరించేను-పలికింది, తోవలోకి వస్తుందను కున్నాను. ఎండగా వుంది డ్రింక్స్ సిప్ చేద్దాం అన్నాను. అలాగే అంది. నేను లిమ్కా అంటే తనకి థమ్సప్ అంది. వెరీగుడ్ అదిరా రస్తా అనుకున్నాను. బార్‌లోకి వెళ్ళేం ఓ కాళీ టేబిల్‌కి ఎదురుగా కూర్చు న్నాం ఆర్డరిచ్చేం. సిప్ చేస్తున్నాం. మీద నుంచి కళ్ళతోను, అడుగునుంచి కాళ్ళతోను పరిచయం అభివృద్ధి చేసుకుంటున్నాం."

"ఆంతరంగికంగా అరమరికలు లేకుండా మాట్లాడుకుందాం. రూమ్‌కి వస్తారా?" అడి గేను

"రూమ్‌లో మీ రొక్కరేనా వుండేది?"

"నా ఫ్రెండు కూడా వుంటున్నాడు"

"వద్దండి"

హోటల్లో రూం తీసుకుందాం

"............" మౌనం ముప్పావు అంగీ కారం.

పైకొచ్చి గబగబా నడిచేను. తనూపాలో అయింది. ఇహ చూస్కో అన్నిటికి ఒప్పేసు కుంటూంటే తబ్బిబ్బయి పోతున్నాను. లాడ్జి మెట్లు మహా ఉషారుగా ఎక్కేను కౌంటర్ దగ్గిర కుర్రాడికి "టు డేస్"అంటూ ఎడ్వాన్సు రెండు టెన్నర్లు ఇచ్చేను. వాడి పాకెట్‌కి బోనస్ అని ఓ ఫైవ్ పిసిరేను ఆ దెబ్బతో వాడు ఐసయి పోయేడు ఏవో మెలికలు తిరిగి చిన్న మెట్లు ఎక్కి దిగి ఓరూమ్ తీగం తెరిచి ఇచ్చేడు. నేను తీగమ్ రూమ్‌లోకి వెళ్లేం.....

"తను సరదాగా రూమంతా శ్రద్ధగా ఆస క్తిగా చూసింది. ఎందుకైనా మంచిదని తలుపు గడియ పెట్టేను.. తర్వాత అర్థాంగి-కారం.......

"వాళ్ళెవరో పూర్తిగా తెలియకుండా రూమెందుకు ఇచ్చేవురా ఇడియట్? మనం నిజాయితీగా పోయినా రెయిడ్లు తప్పవు... పద ...తలుపు తియ్యమను........" ఉంటూ ప్రొప్రయిటరో మేనేజరో మాకు రూమ్ ఇచ్చిన కుర్రాడిమీద కారాలు మిరియాలు నూరుతున్నాడు!

"మేం.... అదే ఆరంభంలో....తలుపు మీద దబదబ చప్పుళ్లు! నాగుండెలు ఎగిరి పోయేయి, పాపం అమ్మాయీ అలాగే ఆయింది. ఇహలేట్ చేస్తే ఆమెని ఎక్స్‌పోజ్ చేసినట్టు అవుతుందని

"నేను ఇలా పైకి పోతాను. తలుపులేసి నువ్వు ఒక్కర్తివే ఉన్నావని చెప్పి తప్పుకో"

"వెంటనే కిటికీ తెరచి రూమ్‌లోకి మొహం పెట్టి కాళ్ళు మెల్లిగా కిటికీలోంచి వెనక్కి పోనిచ్చి కిందకి జారబోతే పాదాకి ఏమీ తగల్లేదు. కిటికీపై అంచులుపట్టుకుని వేలాడి వున్నాను.

ఇంతట్లో రూమ్‌తలుపు తీసింది. హోటలు వాడు "మగమనిషి ఏడీ?" అని ఆమెని క్వెశ్చన్ చేస్తున్నాడు.

"నన్ను రూంలో ఉంచి వెంటనే ఆయన బజారుకి వెళ్ళారు" అంది సంకోచించి

హోటలు ఓనరు ఆమాటలు నమ్మినట్టు లేదు. రూమ్‌లో మంచం కింద టేబిల్ కింద చూస్తూన్నట్టు ఉన్నాడు. ఏమను కున్నాడో ఏమో వెంటనే పోలీసులకి ఫోన్ చెయ్యమని కుర్రాడికి ఆర్డరు వేసేడు.

"నేను అలావేళ్ళాడున్నాను. కాళ్ళలోకి రక్తం దిగిపోయింది. కీళ్ళలో రక్తం ఖాళీ అయి తిమ్మెరలు.. మరోమూడు నిమిషాలు.. హోటల్లో పోలీసు బూట్లు టకటకలు ..అలాగే వున్నాను.

"పైనకూడా పోలీసులు కాసినట్టు వున్నారు. ఒకడు నన్ను చూసేడు కాబోలు గజదొంగని అనుకున్నాడేమో దూరం నుంచే

"కిందకి జారిపోరా నాన్నా, స్టేషన్‌కి పోదాం, రా" అన్నాడు.

అప్పుడు వాళ్ళమాటలు వస్తూన్నపక్క చూశాను ఇద్దరు పోలీసులు లాఠీలు తిప్పు తున్నారు ఇప్పుడు చెప్పు? నాది బేడ్‌లక్ అవునా కాదా!" రెట్టించేడు జగ్గారావు.

"వెధవ పోలీసులు స్టేషన్‌కి తీసుకెళ్తే వెళ్లేరుగాని అలాటి ఎక్స్‌పీరియన్స్ బేడ్‌లక్ ఏంటి గురూ?"- జోగారావు సర్దుబాటు

"అదికాదురా బాబూ నేననేది. పాదాకి ఏమీ తగలకపోయేసరికి రూమ్‌లో ఏమవు తుందో అని కుతూహలంతో కిందకి చూడనే లేదు. పోలీసులు "జారిపోరా నాన్నా" అన్నాకే కిందకి చూసేనులేరా. చూస్తే నా పాదాలకి భూమికి ఓ అడుగు దూరమే వుంది! ఇప్పుడు చెప్పు బేడ్ లక్కేనా!"

# చేశాం

అద్దం ముందు చేశాం,
వెలుతుర్లో చేశాం,
చీకట్లో చేశాం, నీట్లో చేశాం,
చిక్కటి పచ్చికలో చేశాం.
మనిషి పేరిట చేశాం,

మృగం పేరిట చేశాం,
దేవుడి పేరిట చేశాం
ఐతే,
మన గురించి వాళ్ళడగనే లేదు,
మన లాంటి వాళ్ళు బోలెడు.

బహు భంగుల్లోనూ, రంగుల్లోనూ చేశాం,
రాగి జుత్తూ, నలుపు జుత్తూ,
గజిబిజి కాగా చేశాం
కష్టమైన ఉషారు,
కసరత్తుల్తో చేశాం.
యోగుల్లాగా, చక్రాల్లాగా,
మొగ్గలు వేసి చేశాం,
ఆరు రెక్కల్తోనూ,
ఆరు కాళ్ళతోనూ,
చేశాం

కాని, కింద భూమి లాగే,
పైని ఆకాశం కూడా,
మనయెడల రాయిగా మారింది.

(ఇజ్రాయెలీ కవి యెహోూద అమిచాయ్‌కి ఇస్మాయిల్ తర్జుమా)



28 సీరియల్

తప్పులు అందరూ చేస్తారు.

పశ్చాత్తాపం కొందరికే ఉంటుంది

ఆ కొందరిలో ఆడవాళ్ళ శాతం ఎక్కువేమో.

ఏదో కోపం ఆపుకోలేక పిల్లని ఓ దెబ్బవేసిన తల్లి "ఛీ ఛీ, పాపిష్టిదాన్ని, ఎంత దెబ్బ కొట్టేనో పిచ్చివెధవని. వెధవకోపం ఆపుకోలేకపోయేను. పిల్లలు అల్లరి చెయ్యకపోతే పెద్దవాళ్ళు చేస్తారా?" అంటూ మళ్ళీ మరోటి వచ్చేవరకు ఆలా తనలో తనే మధనపడుతుంది. అదే తండ్రి అయితే "దొంగవెధవని మరోరెండు తగల్నివ్వాల్సింది. నేను మంచివాణ్ణి కాబట్టి




యిక్కడితో ఆగేను" అని మరోరెండు తగల్నివ్వని తన మంచితనాన్ని తనే అభినందించుకొని మరుక్షణం మరిచిపోతాడు.

అలాగే మొగుడితో పొరపాటున దెబ్బలాడిన్నాడు "ఛీ ఛీ, పాపిష్టిదాన్ని, అనవసరంగా రెచ్చగొట్టేను. పగలంతా చచ్చి చచ్చి యింటికొస్తే ఆమాత్రం కోపంకూడా ఓర్చుకోలేక పోయేను. పెట్టి పోషించే మగాడికి ఆమాత్రం తిట్టే హక్కు వుండదా? నాబుద్ధి ఏమైంది?" అని తనని తనే తిట్టుకొని ఆపూట అన్నం మానేసి మొగుడు వస్తే క్షమాపణ చెప్పడంకోసం కాసుక్కూర్చుంటుంది అదే పెళ్ళాంతో దెబ్బలాడినవాడు "ఛ! ఛ! యిది యిల్లుకాదు నరకం. ఇలాంటి యింట్లో మరో మొగాడైతే యీపాటికి పిచ్చెక్కి పిచ్చాసుపత్రికి పోతాడు. లేకపోతే సన్యాసుల్లో కలిసిపోతాడు నేనుకాబట్టి యీ రెండూ చెయ్యకుండా ఎంత విసిగించినా మళ్ళీ కొంపకి చేరుకుంటున్నాను." అని తన ఓర్పుకి తనే సంతోషించి ఏ హోటల్లోనో అన్నం తినేసి అర్ధరాత్రి యింటికి వచ్చి పెళ్ళాం చెప్పిన క్షమాపణల్ని అతి గ్రేస్‌ఫుల్‌గా స్వీకరించి పడుక్కుంటాడు

జానకికూడా ఆపదే కాబట్టి దేనికి అతీతురాలు కాదు. భ్రమరాంబ వచ్చి పిల్లకి ఒంట్లో బావులేదని చెప్పినదగ్గర్నుంచి "ఛీ. ఛీ. అసలు తప్పంతా నాదే. వెధవ యిల్లు యిది బాగుపడ్డం ఏమిటి? జగన్నాధం చిలక్కి చెప్పినట్టు చెప్తూనే ఉన్నాడు ఒద్దూ అని. విన్నాదా? ఎందుకు వింటుందీ? శని నెత్తిమీద తాండవం చేస్తుంటే. ఎంత డబ్బు అయింది? ఎంత శ్రమ? తీరా, ఆ వచ్చే అద్దెలు చేసిన అప్పుకి వడ్డీకైనా వస్తాయో రావో? ఎందుకు చేసినట్టు యింత అప్పు? అన్నట్టు అప్పు అంటే జ్ఞాపకం వచ్చింది యింక తన చేతిలో రూపాయికూడాలేదు. చెప్పుకుంటే సిగ్గుకూడాను. పొద్దున్న అతను ఫోనోగ్రాము యివ్వబట్టి సరిపోయిందిగాని, లేకపోతే టెలిగ్రాం

క్కూడా డబ్బులేదు. అప్పటికే జగన్నాధంతో ఎన్నోసార్లు చెప్పింది, ఎంతో బతిమాలింది. డబ్బు నువ్వేతీసుకో అని. ఊహుఁ వింటే అతను జగన్నాధం ఎందుకు అవుతాడు. అతని కేనా మొహమాటం ఉన్నాది? యిప్పుడు రాజేశ్వరరావుని ఎలా అడగటం? అడక్కపోతే అతనికెలా తెలుస్తుంది? బుద్ధి గడ్డితిని దిగేను యిందులోకి-అని గట్టిగా లెంపలేసుకుంది.

ఆయితే లెంపలేసుకున్నంత మాత్రాన సమస్యలు తీరవు. ఏం చెయ్యాలో తోచలేదు జానక్కి. రాజేశ్వరరావుని ఎదురుగా నిల్చుని అడగటం అసంభవం మరి...కాంపౌండరు చేత కబురుచేస్తే?

తన యింటి విషయాలు వాడికి తెలియడం అనవసరం. మరింక ఎలా?

ఏవుంది, చిన్న చీటీ రాసేసింది.

కాని అతనా చీటీని చూసినప్పుడు తను అక్కడ వుండడం బావుండదు.

"కొంచెం డబ్బు సర్దగలరా?" అన్న చీటీని హాల్లో రేడియో మీద పెట్టి అది ఎగిరి పోకుండా ఓ పుస్తకం పైన పెట్టి తన యింటికి బైల్దేరింది అవసరం లేకపోయినా అతనా చీటి చూడడేమోనన్నభయం ఆక్కర్లేదు.

అతను సాయంత్రం యింటికి వచ్చినప్పుడు కాఫీ తాగుతూ రేడియో వింటాడు

ఔను రాజేశ్వరరావు రాగానే ఆకాయితం చూశేడు.

చూసి నవ్వుకున్నాడు జానకి మొహమాటానికి.

తరవాత బాధపడ్డాడుఆవిడ అడిగే వరకు తను యివ్వనందుకు.

వెంటనే తల్లిచేతికి మూడువేలిచ్చి "అమ్మా జానకిగారొస్తే తీసుకోమను" అని యిచ్చేడు.

అక్కడ, జానకి యింటి దగ్గరకి వెళ్లేసరికి—లోపల్నుంచి పెద్ద పెద్ద కేకలు వినిపిస్తు న్నాయి. ఏవిటా కేకలు?

కొంపదీసి గోడలు పడిపోలేదు కదా?

లేదు. గోడలు బాగానే ఉన్నాయి

ఓ గోడమీద అటోకాలు యిటోకాలూ వేసి నడుం మీద చేతులేసుకొని కూర్చుని వుంది ఓకూలీ "ఏటయ్యో అలా గిద్దై పోతన్నావ్? అదేం కష్టకాలవా? నేకపోతే గంగానవా? పొద్దుటేల్నించి తల తెగినకోడిలా గింజుకుంటున్నావ్? మా అమ్మగార్నిరానీ ఆయమ్మే సెప్తాది" అంటోంది మధ్యలో కాలుస్తున్న చుట్ట నోట్లోంచి తీసి తుప్పున ఉమ్ముతూ.

గోడవతలనిల్చున్న నాయుడు గద యింట్లో మరిచిపోయిన కంసుడిలా ఉన్నాడు. గడబడులు చేతలో చిన్న కర్ర ఉంది.

"ఏం చేస్తుందే మీ అమ్మగారొసే? తల తీసి మొలేస్తుందా? చేసింది తప్పుకాకుండా ఏవిటే ఆ సావంకం? యీయిల్లు నీదా? నీకెందుకు మధ్య రంకెలేస్తున్నావు రంకెలు. రానీ. ఆవిడ్నే అడుగుతాను" అంటూ చిందులు తొక్కుతున్నాడు.

అంతవరకు గోడమీద అటోకాలూ,యిటోకాలు వేసుక్కూర్చున్న ఆకూలీ గబుక్కున లేచి గోడమీద నిల్చుంది నిల్చుని "ఏటయ్యోయ్? పెదనాయుడ్నని పెట్రేగిపోకు. రంకెలు, గింకెలు అన్నావంటే కాలవలోనే కప్పెట్టేగల్ను, ఒసేగిసే అంటున్నావు నావేటి, నీపెళ్ళాన్నా? నేకపోతే నువ్వు రోజూ మాపిటేలకి ఎళ్తావే పంతులిది పారిజాతం




కొంపకి? దాన్ననుకున్నావా? అసలేటి నీ బుకాయింపు? అసలేంటీ అని? మొగోడివని ఒల్ల కుంటున్నాను కాని నేను పోతేనా...." ఆరిపోయిన చుట్టని వెలిగించు కోవడానికి ఆగింది.

ఆఫ్టరాల్ ఒక ఆడది — అందులోనూ కూలిపని చేసుకునేది — తన ముందు కూర్చోవ డానికి అర్హత లేనిది — అంతటి పెద్ద నాయుడ్ని పట్టుకొని అంతమాటంటుందా? నాయుడి లోని మొగాడి కోపం ః చ్చేసింది.

అతను కోపంతో ఊగేడు

అమ్మవారు పూనిన వాడిలా ఊగిపోతున్నాడు.

కోపంవల్ల మాట సరిగ్గా రావటంలేదు.

"ఏంటేటే కూస్తున్నావ్?... నిన్ను . నిన్ను"

"మొగోడివంటే గెంతుతావేంటి? కావాలేంటి కిసుక్కుమంది అక్కడేనిల్చుని యీ చోద్యం చూస్తున్న చిన్నది.

దాని వెక్కిరింపుకి నాయుడిలోని నాయుడితనం దెబ్బతింది. "మిమ్మల్నిద్దర్నీ ... యివేళ... యిక్కడే....అంటూ చేతిలో కర్ర ఎత్తేడు. యీలోగా లాంగ్‌షాట్‌లో జానకిని చూసి ఎత్తిన కర్ర దించేసి అలాగే నిల్చున్నాడు.

గోడమీద నిల్చుని యుద్ధం చేస్తున్న సత్యభామకూడా జానకిని చూసి గబుక్కున గోడ గెంతేసింది.

విషయం తెలీదు కాని యుద్ధం జరుగుతోందని తెలుసు జానక్కి. అంచేత "ఏంటేటే గోల? మిమ్మల్ని నేనిక్కడ డబ్బులిచ్చి పెట్టుకున్నది గోడలు తడపడానికా, గోడలు ఎక్కడానికా? పొండి, పొండి" అని విసుక్కున్నది

"ఏటండి మమ్మల్నసలు తడపనిస్తున్నాడేటి యీ బావు. ఏ మువొద్దయింది ఒకటే గోలండి.మరండి యిదిగో యీ తానాలకొట్లోకి సీప్ల అళ్ళ కుప్లుకాలవలో కలతా వటండి. అలా గెల్లడానికిల్లేదట. అయా కుప్లనీళ్ళే యియ్యా కుప్లనీళ్ళే రొండూకలిసి రొడ్డుమీదికి పోతాయి-మద్దెన నీకేటి బాద అంటే యిరిపించుకోండి మావేటి సేస్తాం?" అంటూ యద్ధకారణం వివరించింది సత్యభామ

"ఔను, మీనీళ్ళు మాకాలువలోకి రావడానికి వీల్లేదు." వాళ్ళు చెప్పింది నిజమేనన్నాడు నాయుడు.

అసలు సంగతి. ....

జానకి కట్టించిన బాత్రూమల్లో నీళ్ళు ఎటు వదిలినా వాకిట్లోకి వచ్చేసి ఇల్లంతా హిందూమహాసముద్రం అయిపోతుంది. నాయుడింటికి, తనింటికి మధ్య హద్దుగోడ నానుకునే వాళ్ళ కాలువ ఉంది ఆ గోడ తనే పెట్టించింది. మా బాత్రూముల్లో నీరుకూడా అందులోకే మళ్ళించేస్తే సరిపోతుంది అనుకుంది జానకి.

అదే-అతని బాధ కూడా అదే.

తనతో చెప్పి తన పర్మిషన్ తీసుకోనందుకు అతని అహం దెబ్బతిన్నది. అందుకే యీ రభస

"చూడండి నాయుడుగారూ మీతో చెప్పకపోవడం పొరపాటే చెప్దామనే అనుకున్నాను కాని మీరు కనిపించలేదు. యివతలపని ఆగిపోతుంది అంచేత తరవాత చెప్పొచ్చులే అనుకున్నాను యింతకీ వాటివల్ల మీకేయిబ్బందీ వుండదు. మీకాలవలో కలిసి రోడ్డు మీదకి పోతాయి అటుమానేసి యిట్నుంచి రోడ్డుమీదికి పంపాలంటే ఓ ఫర్లాంగు సొరంగం తవ్వాలి" అని సంజాయిషీ చెప్పింది జానకి

జానకి సంజాయిషీలో అతనికి నిజం కనిపించినా వెంటనే ఒప్పుకోవడం యిష్టం లేక పోయింది నాయుడికి. అంచేత

"ఎవరి కాలవ హక్కువాళ్ళదేకదా ఒకరి మురుగనీరు యింకోరి యింట్లోకి వస్తే ఎవరూరుకుంటారు?" అన్నాడు మరికొంచెం బిగు మాలించుకోవాలని.

కాని జానకి బతిమాలలేదు. నాయుడి నోరు ఎలామూయించాలో ఆవిడకి తెలుసు. కాక పోతే పెద్దమనిషి తరహాలో పోదామనుకుంది. కాని అతను ఆ పెద్దరికం నిలబెట్టుకోలేదు. మరింక తురుపాసు కొట్టాల్సిందే.

"చూడండి నాయుడుగారూ హక్కులు గురించి మాట్లాడితే చాలా మాట్లాడాలి. సంవత్సరాల తరబడి మా పెరట్లో మీ గేదెల్నికట్టే హక్కు మీకెవరిచ్చేరు? పెరట్లో పొడవునా గజం స్థలం మీరు కలుపుకునే హక్కు మీకెవరిచ్చేరు? ఏదైనా సరిపెట్టుకోవటంలో గొప్పతనం వుంటుంది కాని ప్రతిదానికీ పిలకలు పట్టుకోవడం ఎవరికీ మంచిది కాదు. మీ కిష్టంలేకపోతే ఆ తూములు మూయించేస్తాను ఆ గోడకైన డబ్బుయిచ్చేయండి" అంది కొంచెం గట్టిగానే.

యీ ఎదురుఎటాక్కి నాయుడు సిద్దంగా లేడు. పైగా ఆ గోడకి డబ్బుయివ్వడం అతనికి ఎంత మాత్రం యిష్టంలేదు అంచేత "సర్లేండి అయిందేదో అయింది" అని యింట్లోకి వెళ్ళిపోయేడు.

ఆ తరవాత జానకి కూలీలని పిల్చి "ఏవన్రా ఏదైనా తగాదొస్తే నాతో చెప్పండికాని మీ యిష్టం వచ్చినట్టు మాట్లాడకండి వెధవ కుక్క జెట్టీలూ మీరూను" అని తిట్టి యీపాటికి రాజేశ్వరరావు కాఫీ తాగి వెళ్ళిపోయి వుంటాడని నిర్ధారించుకున్నాక యింటికి బైల్దేరింది.

(సశేషం)




## హిందీ చిత్రరంగంలో తెలుగు దర్శకుల ముందంజ!

తెలుగువారు సినిమాలు బాగా తీస్తారని ప్రతీతి (ఈ "బాగా కి విభిన్నమైన వ్యాఖ్యానాలున్నాయంటే, అది మళ్ళీ వేరే విషయం) మనవాళ్లు తీసిన పౌరాణిక చిత్రాలని ఉత్తర భారతీయులు బాగా మెచ్చుకుంటారు ఏమాటకామాటే చెప్పుకోవాలి మన తెలుగు దర్శకులు పౌరాణిక చిత్రాలను నిజంగానే బాగా తీస్తారు నాకు తెలిసి బి ఏ సుబ్బారావుగారి "చెంచులక్ష్మి" దగ్గిర నుంచి, నిన్నకాక మొన్న బాపూ సృష్టించిన కళాఖండం "సీతాకల్యాణం" వరకు మన పౌరాణిక చిత్రాల నాణ్యత తిరుగులేనిది ఎల్ వి ప్రసాద్ వంటి ఉద్దండులు బొంబాయిలో జెండా పాతి, హిందీ సినిమాలు శరపరంపరగా తీసివిజయం సాధించిన తరువాత మన దర్శకుల ప్రతిభమీద ఉత్తరాది నిర్మాతలకిమరింత నమ్మకం కుదిరినట్టు కనిపిస్తుంది

తాతినేని ప్రకాశరావుగారి పేరు ఈ నాటికీ హిందీలో బాక్సాఫీసు ఒద్దలు కొట్టగల దర్శకుల జాబితాలో వుంది కీ శే చాణక్య దర్శకత్వం వహించి "రామ్ ఔర్ శ్యామ్" రజతోత్సవం జరుపుకుంది ఈమధ్యనే హిందీరంగ లోకి ప్రవేశించిన కె బాపయ్య, సాంబశివరావు, దాసరి నారాయణరావు తాతినేనిరామారావు, కె. రాఘవేంద్రరావు వంటి మన దర్శకులు బొంబాయి స్టూడియోలలోకనిపిస్తేచాలు పెద్దవారు పరిగణించబడుతున్న తారలు నిర్మాతలు కూడా గౌరవసూచకంగా లేచినిలబడుతున్నారని వింటున్నాము ఇదితప్పకుండా తెలుగు చలనచిత్ర పరిశ్రమ ఆనందించ వలసిన విషయమే హిందీ సినీమాల మోజులో తెలుగు సినీమాల మన దర్శకులు అశ్రద్ధ చేయకూడదని మాత్రం కోరుకుందాము

## అంతర్జాతీయ చలన చిత్రోత్సవం

1981 జనవరి 3 నుంచి 17వరకు, రోజులపాటుఢిల్లీలో జరిగే 8వ (భారత) అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి యేర్పాట్లు దాదాపు పూర్తియ్యాయి



"సంధ్య" చిత్రంలో
సుజాత

మొత్తం 61 దేశాలు ఈ చలన చిత్రోత్సవంలో పాల్గొంటున్నాయి. పోటీ విభాగంలో తమ చిత్రాల్ని ప్రదర్శించడానికి 32 దేశాలు ముందుకొచ్చాయి. ఉత్తమ కథాచిత్రం, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ నటుడు, ఉత్తమనటి, ఉత్తమ హాస్య చిత్రం (షార్ట్ ఫిలిమ్) అవార్డులు బహూకరించబడతాయి. దేశ విదేశీ చలనచిత్రవిద్యా పారంగతులతో యేర్పడిన తొమ్మిది మంది సభ్యులుగల న్యాయనిర్ణేతల సంఘం విజేతలను ఎన్నిక చేస్తుంది. మృణాల్ సేన్ చలన చిత్ర రంగ ప్రవేశం చేసి పాతికేళ్ళు నిండిన సందర్భాన్ని పురస్కరించుకుని "సేన్ రిట్రాస్పెక్టివ్" యేర్పాటు చేస్తున్నారు. అమెరికా, రష్యా, జపాన్, ఇంగ్లండు, జర్మనీ, ఇటలీ, ఇరాక్, ఈజిప్ట్ మొదలైన దేశాలు ఢిల్లీలో జరగనున్న, ఈ ప్రతిష్టాత్మకమైన చలన చిత్రోత్సవంలో పాల్గొంటున్నాయి.

## సంక్రాంతికి దేవుడు మామయ్య

చాలారోజులుగా, కారణాంతరాలవలన పదేపదే విడుదల వాయిదా పడుతూ వచ్చిన రాజా ఆర్ట్ ఎంటర్‌ప్రయిజెస్ వారి ఛాయాపర్ణ చిత్రం 'దేవుడుమామయ్య' జనవరి 14 న సంక్రాంతి కానుకగా ఆంధ్ర దేశమంతటా విడుదలవుతుంది. విజయలలిత సమర్పిస్తున్న ఈచిత్రంలో శోభన్‌బాబు, వాణిశ్రీ ప్రధాన పాత్రధారులు. దర్శకుడు కె. వాసు.

## యూఫై అద్దాలతో దాసరి నిర్మించుకున్న మేడ!

దాసరి నారాయణరావుది ఒక విజయ గాథ. ఆయన అనేక ప్రయాసలకోర్చి, పట్టుకుంటే చేయితెగే పటిష్టమైన అద్దాలను ఒక్కొక్కటిగా చేర్చి తన దర్శక జీవితపు అందమైన అద్దాల మేడ కట్టుకున్నారు. ఇక ఇది రాయి వేస్తే పగిలి ముక్కలయ్యే మేడ యెంతమాత్రమూ కాదు. తన అన్‌బ్రేకబుల్ గ్లాస్ హౌస్‌కి యాభయ్యో అద్దంగా నారాయణరావుగారు చేర్చుకుంటున్న చిత్రం "అద్దాల మేడ" షూటింగ్ జనవరిలో జరిగే చివరి షెడ్యూలుతో పూర్తవుతుంది. సినీమావారి కథ కథగా రూపొందుతున్న

ఈ చిత్రంలో దర్శకుడు దర్శకుడుగా తెరమీద కనిపిస్తారు. విజయశ్రీ ఆర్ట్ పిక్చర్స్ పతాకంతో పి. భాస్కరరావు నిర్మిస్తున్న ఈ చిత్రం తొలి షెడ్యూలు డిసెంబర్ 1 న మద్రాసు సమీపంలో ప్రారంభమైంది. మురళీమోహన్, మోహన్‌బాబు, నూతన నటి అంబిక, ప్రభాకరరెడ్డి, రమాప్రభ, గీత మొదలైన వారు నటిస్తున్న 'అద్దాల మేడ'కి రచయిత, దర్శకుడు దాసరి నారాయణ రావు.

## కుర్రవాళ్లకి కొసరాజు పిలుపు!

కవి కొసరాజు నిద్రావస్థలో వున్న యువకులను మేలుకొలిపే సదుద్దేశంతో ఒక చిత్రం నిర్మించబోతున్నారు. "యువకుల్లారా, లేవండి" అనే పేరుతో నిర్మాణం కానున్న ఈ కలర్ సినిమాలో కథానాయకుడు ఎన్. టి. రామారావు. దర్శక, రచయిత దాసరినారాయణ రావు.

## సారువాడి ఎలక్ట్రిక్ రైలు ప్రయాణం!

ఆయన హాస్య నటుడు. అరవ తెలుగు మాట్లాడి నవ్వించడంలో అందె వేసిన చెయ్యే కానీ, ఆయనది అందె వేసిన కాలు కాదు! అందుకే ఉరికి వస్తున్న మృత్యువు నుంచి ఆయనను వడిగా పక్కకితీసుకువెళ్ళడంలో ఆయన కాళ్ళు విఫలమయ్యాయి. సగటు తెలుగు ప్రేక్షకుల 'సారువాడు' కె. వి. చలం ఆ విధంగా తెలుగువారు యెక్కువగా నివసించే కోడంబాక్కం ప్రాంతంలో అరవ రైలుపట్టాలమీద అస్తమించాడు. చలం, పైకి యెంత సెలయేరులా కనిపిస్తాడో లోపల అంతటి సముద్రుడని, దాసరి నారాయణరావు, రాయపరాజు వంటి ఆయన సన్నిహితులు చెబితే తెలుస్తోంది యిప్పుడు. ఆ అయిదో తారీకు నాడు, ఆ ఏడు గంటలప్పుడు ఆయన లైను క్రాసు చేయబోయింది. తన లైఫ్ లైను క్రాసుచేసే ఉద్దేశంతో నేనా?

"శ్రీ లక్ష్మీనిలయం"లో మంజుభార్గవి





"స్వప్న" లో రాంబాబు, స్వప్న

తన బుల్లి కారులో కొన్నాళ్ళూ, తన స్కూటర్ మీద కొన్నాళ్లూ తిరుగుతూ కనిపించిన చలం అకస్మాత్తుగా ఎలక్ట్రిక్ రైలు కింద (మీద కాదు) యింత పెద్ద ప్రయాణం పెట్టుకుంటాడని తెలుగు సినీమా రంగానికి యేమి తెలుసు ఆయన కుటుంబానికి జ్యోతి, తన తరపున తన పాఠకుల తరపున ప్రగాఢమైన సంతాపం తెలియజేస్తోంది.

—దేవీదాసు

## బహుమతి రు. 100

# శ్రీశ్రీ నిర్వహిస్తున్న పదబంధ ప్రహేళిక



**ఆధారాలు** — జనవరి 1981

అడ్డం

1 తల కెత్తుకొనేది

3 ముక్కున వుంటుంది

5. తనలో

6 కోటి జనాభా

8. ఒక పేక ముక్క

9. తల్లి

11. ఒక లేడీ డాక్టరు?

13 గిరీశం సాక్షి

5. "పాతాళ భైరవి" లో పాత్ర

.6 రండి (లేదా పోండి)

17. భూమికి సరిహద్దు

## ప్రహేళికా ప్రియులు గమనించండి :

డిసెంబర్ 1980 సంచిక పాఠకులకి అందడంలో జరిగిన అనివార్యమైన ఆలస్యం వలన బహుకొద్దిమంది మాత్రమే, జనవరి 1981 సంచిక ముద్రణ ముగిసేనాటికి తమ ఎంట్రీలు పంపించగలిగారు ఈ కారణం చేత డిసెంబరు ప్రహేళిక సమాధానాలను కూడా జనవరి '81 ప్రహేళికతో స్వీకరించాలని నిర్ణయించాము ప్రహేళికా ప్రియులు ఈ అవకాశాన్ని వినియోగించుకుంటారని ఆశిస్తున్నాము రెండు ప్రహేళికల సమాధానాలూ వచ్చే సంచికలో ప్రచురిస్తాము

— ఎడిటర్

19. యాత్రలో యిది వాక్యం లో కామా
22. రెండు గణాలు
23 అదృష్టాలు కాబోలు!
25. అయినా మానవచ్చు!
26 పారిభాషిక పదం (నాట్యంలో)
28. జవాబు కోరేది
30. పౌరాణిక నాయిక
31 ఈ కోటి 6 కన్నా ఎక్కువ

నిలువు

1. ఇంకో ఈశ్వరి
2. 31 తో భాష్యం
3 తొలి ఋతువు
4. వీధి అంగడి
5. ఒకడి సొంతం
7. నాటు వైద్యుడు?
8 స్థలం
10. సినిమాలో కమీడియన్
12 సమయం
14 30
15 భట్టు భారతీయుడే
17 రమ్మొక్క వృగమ్ము!
18 లాంగ్రీ మృగం
20 మనదం కాంతి సూచక
2 చూ. 2
23 శ. కానికి మకుటం
24 ప్రాగైత లక్షణం (తల క్రిందులు)
27 ఆమ్రేడితంలో తిరుగుడు
29 బ్రాహ్మి

## నిబంధనలు గమనించండి :

ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లు లేకుండా పూర్తి చేసి డిసెంబర్ 31వ తేదీ లోపు మాకు చేరేట్టు పంపండి తెల్లకాగితం మీద గళ్లు గీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపే వారు వారి పూర్తి చిరునామా ఎంట్రీ పైనే రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు 100/- బహుమతి ఒకటి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీలు వొచ్చినపుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటి రాకపోతే బహుమతి సొమ్ము పైనెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయ బడుతుంది ఒక ఎంట్రీ మీద ఇరువురి పేర్లు వుండకూడదు.

Edited & Published by V. Leelavathy Raghavaiah, at 1-8-4/1/1, Chikkadpalli, Hyderabad-20 & Printed by P Ramakrishna at Raghava Printers, 1-8-4/1/1 Chikkadpalli, Hyderabad-500 020